# వీక్షణం

Veekshanam Fortnightly

ఆర్థిక, సామాజిక పక్ష పత్రిక

సంపుటి : 2 సంచిక : 5,6

మార్చి 1-31, 2005

## బడ్జెట్ ఫోకస్
### కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లపై ఆరు వ్యాసాలు

## పేటెంట్ చట్టం సవరణ

## అమెరికా విదేశాంగ విధానంపై విమర్శ

## నక్సలైట్ ఉద్యమం - కొన్ని ఆలోచనలు

సమతా పబ్లికేషన్స్

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చి అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

# కేంద్ర ప్రభుత్వ ఆదాయ వ్యయాలు

(కోట్ల రూ)

| | | 1990-91 | 1999-00 | 2002-03 | 2003-04 | 2003-04 | 2004-05 |
|---|---|---|---|---|---|---|---|
| 1. | రెవెన్యూ ఆదాయం | 54954 | 181482 | 231748 | 263027 | 263000 | 309322 |
| 2. | రెవెన్యూ ఖర్చు | 73516 | 249078 | 339628 | 362887 | 361308 | 385493 |
| 3. | రెవెన్యూ లోటు | 18562 | 67596 | 107880 | 99860 | 98308 | 76171 |
| 4. | పెట్టుబడి ఆదాయం | 31971 | 116571 | 182414 | 211228 | 208936 | 168507 |
| 5. | పెట్టుబడి ఖర్చు | 24756 | 48975 | 74534 | 111368 | 110628 | 92336 |
| 6. | మొత్తం ఖర్చు (ప్రణాళిక+ప్రణాళికేతర ఖర్చు) | 98272 | 298053 | 414162 | 474255 | 471936 | 477829 |
| 7. | ద్రవ్యలోటు | 37606 | 104716 | 145072 | 132103 | 125960 | 137407 |
| 8. | ప్రాథమికలోటు | 16108 | 14467 | 27268 | 7548 | 1699 | 7907 |

## జిడిపిలో శాతం

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | రెవెన్యూ ఆదాయం | 9.7 | 9.4 | 9.4 | 9.5 | 9.5 | 10.0 |
| 2. | రెవెన్యూ ఖర్చు | 12.9 | 12.9 | 13.8 | 13.1 | 13.1 | 12.4 |
| 3. | రెవెన్యూ లోటు | 3.3 | 3.5 | 4.4 | 3.6 | 3.6 | 2.5 |
| 4. | పెట్టుబడి ఆదాయం | 5.6 | 6.0 | 7.4 | 7.7 | 7.6 | 5.4 |
| 5. | పెట్టుబడి ఖర్చు | 4.4 | 2.5 | 3.0 | 4.0 | 4.0 | 3.0 |
| 6. | మొత్తం ఖర్చు (ప్రణాళిక+ప్రణాళికేతర ఖర్చు) | 17.3 | 15.4 | 16.8 | 17.2 | 17.1 | 15.4 |
| 7. | ద్రవ్యలోటు | 6.6 | 5.4 | 5.9 | 4.8 | 4.6 | 4.4 |
| 8. | ప్రాథమికలోటు | 2.8 | 0.7 | 1.1 | 0.3 | 0.1 | 0.3 |

(ఎకనమిక్ సర్వే 2004-05)

*

విడి ప్రతి: రూ॥ 12/-
వార్షిక చందా: రూ॥150/-లు

# వీక్షణం

ఆర్థిక, సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చి అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సంపుటి: 2 సంచిక: 5,6 మార్చి 1-31, 2005

సంపాదకీయం:

## రాజకీయ ఊసర వెల్లులు

మన రాజకీయ పార్టీలు రంగులు, దిక్కులు మార్చే పద్ధతి చూస్తే ఊసర వెల్లులు కూడ సిగ్గుతో తలలు దించుకుంటాయి. మితవాదపు కొసన ఉన్న భారతీయ జనతాపార్టీ నుంచి వామపక్షాన్నని చెప్పకునే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) వరకు మన పార్లమెంటరీ పార్టీలన్నీ కూడ మాట్లాడే మాటలకు, చేసే చేతలకు ఉన్న తేడా, ఇవాళ కాదన్నదాన్ని రేపు ఔననడం, నిన్న తీవ్రంగా వ్యతిరేకించిన దాన్ని ఇవాళ అమోఘమయినదని తలకెత్తుకోవడం, కనీసమైన నిజాయితీ, ఔచిత్యం, సంబద్ధత లేకుండా ప్రవర్తించడం ఒక కళగా అభివృద్ధిచేశాయి.

మద్యం విధానం విషయంలో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ వేస్తున్న పిల్లి మొగ్గలు ఈ రకమైన బహురూపుల ప్రవర్తినకు ఒకానొక నిదర్శనం మాత్రమే. ఆ పార్టీ తొమ్మిది సంవత్సరాలపాటు విమర్శించిన పనులన్నిటినీ తొమ్మిది నెలలుగా తు.చ. తప్పకుండా పాటిస్తూ వస్తోంది. దానికి మిత్ర పక్షాలుగా ఉన్న వామపక్ష పార్టీలు, ప్రభుత్వంలో దానితో భాగం పంచుకుంటున్న తెలంగాణ రాష్ట్ర సమితి ఇంతవరకు తమ సొంత సమస్యల విషయంతో సహా, ఎప్పుడూ కాంగ్రెస్ విధానాలను విమర్శించని సౌమనస్యాన్ని పాటిస్తున్నాయి. అన్ని పార్టీలూ పేరుకే వేరు వేరుగా ఉన్నాయేమో, ప్రజలను మోసం చేయడంలో తోడు దొంగలేనేమో అని కొందరకయినా ఉండిన అనుమానం ఇప్పడు ఎక్కువ మందికి కలిగితే అందుకు బాధ్యత ఆయా పార్టీలే వహించాలి.

రాష్ట్రంలో దృశ్యం కన్నా చిత్రమైనది కేంద్రంలో దృశ్యం. ప్రపంచబ్యాంకు నుంచి నేరుగా దిగుమతి అయిన మన్మోహన్‌సింగ్-చిదంబరం-మోంటెక్ సింగ్ అహ్లువాలియా పాలనను అక్షరాలా సమర్థించడానికి వామ పక్షాలకు ఏమీ అభ్యంతరం కనబడడం లేదు. పైగా, మా మద్దతు వల్లనే యుపిఏ ప్రభుత్వం నిలబడుతోంది అనే ప్రగల్భాలు మాటి మాటికీ వినబడుతుంటాయి. ప్రగతిశీలమైన 1970 పేటెంట్ల చట్టాన్ని రద్దుచేసి, ప్రపంచబ్యాంకు ఆదేశాల ప్రకారం తయారయిన కొత్త పేటెంట్ల చట్టం సవరణ లోక్‌సభలో గట్టెక్కడానికి వామపక్షాల అంగీకారమే కారణమని అందరూ బహిరంగంగానే చెపుతున్నారు. బహుళజాతి సంస్థల ప్రయోజనాల కోస తయారయిన పేటెంట్ల చట్టం సవరణను మితవాద పార్టీ అయిన భారతీయ జనతాపార్టీ వ్యతిరేకించడం, తమను తాము సామ్రాజ్యవాద వ్యతిరేకులమని చెప్పకునే పార్లమెంటరీ వామ పక్షాలు సమర్థించడం సూచించేదేమిటి?

రెండు సంవత్సరాల కింద ప్రపంచబ్యాంకు ఆదేశం మేరకు దేశ వ్యాప్తంగా విలువ ఆధారిత పన్ను (వాల్యు ఆడెడ్ టాక్స్ - వాట్) ను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించిన భారతీయ జనతాపార్టీ ఇవాళ నూట ఎనభై డిగ్రీలు వెనక్కి తిరిగి తాను పాలించే రాష్ట్రాల్లో వాట్‌ను ప్రవేశ పెట్టబోనని అంటోంది.

ఈ ఊసరవెల్లుల రంగుల మార్పిడి క్రీడలో మోసపోతున్నదెవరు?

## లోపలి పేజీల్లో...



### చందాదారులకు విజ్ఞప్తి

వీక్షణం చందాదారులలో చాలామంది వార్షిక చందా డిసెంబర్ 2004 సంచికతో అయిపోయింది. అయినా తిరిగి చెల్లిస్తారనే నమ్మకంతో ఈ సంచిక కూడా పంపుతున్నాం. సంవత్సర చందా రు. 150 వెంటనే పంపించి తమ చందాలను పునరుద్ధరించుకోవలసిందిగా చందాదారు లందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం.

- సం.

## ఉత్తరాలు:

'వీక్షణం' ఫిబ్రవరి సంచిక వేరు వేరు అంశాలపై వ్యాసాలతో నిండుగా వుంది. కొన్ని వ్యాసాలు చర్చకు ప్రేరేపించేవిగా వున్నాయి. ముఖ్యంగా 'వై ఎస్ చైనా పర్యటన' అని దిగుమర్తి నరసింహారావు గారు రాసిన వ్యాసంలో కొన్ని అసందర్భ వాదనలు, వైరుధ్యాలు వున్నాయి. ఆ వ్యాసాన్ని విమర్శించాలంటే మరొక వ్యాసమే రాయవలసి వస్తుంది. నేను అలా రాయగల రచయితను కాను. కాని పాఠకుడిగా నా అధ్యయనం నుంచి ఆ వ్యాసంలో కొన్ని పొరపాట్లను మీ దృష్టికి తేదలిచాను.

ఆ వ్యాసానికి పునాదిగా ఉన్న అవగాహన - చైనా కమ్యూనిస్టు దేశమనే అవగాహన - సరికాదని నేననుకుంటాను. అక్కడ అధికారంలో ఉన్న పార్టీ పేరు కమ్యూనిస్టుపార్టీ కావచ్చు గాని గత రెండు దశాబ్దాలకు పైగా అక్కడ అమలు జరుగుతున్న పాలనా విధానాలకూ కమ్యూనిస్టు మౌలిక సూత్రాలకూ చుక్కెదురు. దాదాపు పదిహేను సంవత్సరాల కిందనే విలియం హింటన్ రాసిన 'ది గ్రేట్ రివర్సల్' నుండి ఇటీవల రాబర్ట్ వెయిల్ రాసిన 'రెడ్ క్యాట్ వైట్ క్యాట్' వరకు ఎన్నో గ్రంథాలలో చైనా పెట్టుబడిదారీ మార్గంలో ఎంతగా వెనక్కి పోతున్నదో సోదహరణంగా వివరాలున్నాయి.

అదే విధంగా, వ్యాసరచయిత, చైనాలో అమలు జరుగుతున్న ప్రపంచీకరణ విధానాలను సమర్థించడానికి చాలా శ్రమ పడ్డారు. ప్రపంచబ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థ వంటి సంస్థలు మన దేశంలో ప్రతిపాదిస్తున్న విధానాలకూ, చైనాలో అమలు చేస్తున్న విధానాలకూ "చాలా భేదమున్నది" అని కూడా ఆయన రాశారు. ఇది ఎంత మాత్రమూ నిజం కాదు. చైనాలో ప్రభుత్వరంగ, సమష్టి సంస్థలను ప్రైవేటీకరించడం, బహుళజాతి సంస్థలకో, వారి తైనాతీలయిన చైనీయులకో, కమ్యూనిస్టు పార్టీ నాయకులకో ఎట్లా అప్పగించడం జరిగిందో వందలాది విశ్లేషణలు అందుబాటులో ఉన్నాయి.

సోషలిస్టు మార్కెట్ అనేదాన్ని సమర్థించటానికి రచయిత చాలా ప్రయత్నం చేశారు గాని గత ఇరవై సంవత్సరాలుగా చైనాలో పెరిగిపోయిన పేదరికం, పట్టణ గ్రామీణ అంతరాలు, ఆదాయ వ్యత్యాసాలు, స్త్రీలను అంగడి సరుకులుగా మార్చడం, విషపూరితమైన సామ్రాజ్యవాద సంస్కృతికి తలుపులు బార్లా తెరవడం మొదలైన ఏ ఒక్క రంగం చూసినా అక్కడ ఉన్నది ఫక్తు పెట్టుబడిదారీ మార్కెట్టే తప్ప సోషలిజం కాదని తేట తెల్లమవుతుంది.

ఇటువంటి వ్యాసం 'వీక్షణం'లో రావటం ఆశ్చర్యకరం.

-పి. సుబ్బారావు,
**విజయవాడ**

( వీక్షణం అన్ని రకాల అభిప్రాయాలకు వేదిక కల్పిస్తుంది. సంపాదకులకు, నిర్వాహకులకు ఉన్న అభిప్రాయాలే, అచ్చయిన అన్ని రచనలలోను ఉండాలని నియమమేమీ లేదు - సం.)

# కొత్త మద్యం విధానం- ప్రభుత్వ దిశ ఏమిటి?

- రాజవరం పార్థసారథి

గత ఐదు వారాలలో కొత్త ప్రభుత్వం మద్యం విషయంలో అవలంబించిన విధానం, దానిపై కోర్టు తీర్పులు, తత్ఫలితమైన మార్పులు, విభిన్న రాజకీయ పక్షాల భిన్న స్వరాలు కలగలిసి ఒక గందరగోళ పూరితమైన వాతావరణం తలెత్తింది. ప్రభుత్వానికి, లేదా కాంగ్రెస్ పార్టీకి మద్యం విధానం విషయంలో ఒక స్పష్టమైన వైఖరి ఉందా లేదా అని సందేహించడానికి తగిన వాతావరణం తయారయింది. ఎన్నికల ప్రణాళికలో రాసిన విషయాలకు, ఎన్నికల ప్రచారంలో చేసిన వాగ్దానాలకు, చంద్రబాబునాయుడు పాలనాకాలంలో ప్రతిపక్షపార్టీగా చేసిన వాదనలకు కాంగ్రెస్ పార్టీ వీసమెత్తు విలువ కూడా ఇవ్వడం లేదని ఈ ఐదువారాల పరిణామాలు తేటతెల్లం చేస్తున్నాయి. గద్దెనెక్కక ముందు ఒక మాట, గద్దె నెక్కిన తర్వాత మరొక మాటగా విక్రమార్కుని గద్దె జానపద గాథను మన రాజకీయ పక్షాలు ప్రతిరోజూ నిజం చేస్తున్నాయనడానికి, కాకపోతే ఆ గాథలో గద్దెమీద నిజం, గద్దె నెక్కక ముందు అబద్ధం ఉంటే మన రాజకీయ పక్షాల ప్రవర్తన అందుకు వ్యతిరేకంగా ఉందని మద్యం విధానం రుజువు చేస్తోంది.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ 2004 ఎన్నికలకు ముందు ప్రకటించిన ప్రణాళికలో 'మద్యపానానికి బానిసలు అయిన వారి వల్ల సమాజం, ముఖ్యంగా మహిళలు, ఇబ్బంది పడుతున్నారని కాంగ్రెస్ పార్టీ గుర్తిస్తోంది. మద్యానికి బానిసలు కావడం వల్ల కలిగే నష్టాన్ని ప్రజలకు తెలియ జెప్పడానికీ, బెల్టుషాపుల మూసివేతకూ, పబ్‌లు, బార్లు అడ్డూ అదుపు లేకుండా పెరిగిపోవడాన్ని నివారించడానికీ కాంగ్రెస్ పెద్ద ఎత్తున ఉద్యమం చేపడుతుంది" అని వాగ్దానం చేసింది (పే.17). "అన్ని మద్యం బెల్టు షాపుల మూసివేతకు కాంగ్రెస్ ఆదేశాలు జారీ చేస్తుది. మద్యపాన దురాచారానికి వ్యతిరేకంగా తీవ్రస్థాయిలో ప్రచారోద్యమం నిర్వహించి దశల వారీగా మద్యనిషేధం ప్రవేశ పెట్టేందుకు కృషి చేస్తుంది" అని కూడ వాగ్దానం చేసింది (పే. 28).

ఈ ప్రణాళిక మీద ఆధారపడిన ఎన్నికలలో గెలిచి 2004 మే 14 న రాష్ట్ర ప్రభుత్వ అధికారం చేపట్టిన కాంగ్రెస్ ఈ రెండు వాగ్దానాలను అమలు చేయడానికి ఎనిమిది నెలలపాటు ఏమీ చేయలేదు. ఆ ఎనిమిది నెలల కాలంలో, అంతవరకూ తాను అతి తీవ్రంగా విమర్శిస్తూ వచ్చిన తెలుగుదేశం పాలక విధానాలనే యథాతథంగా అమలు చేస్తూ వచ్చింది.

ఒక అధికార ఉత్తర్వు ద్వారా మద్యం బెల్టు షాపులను మూసివేయడానికి అవకాశం ఉన్నప్పటికీ అటువంటి ఉత్తర్వు ఇవ్వడానికి ప్రయత్నించలేదు. ఇక ఫిబ్రవరిలో ప్రవేశ పెట్టనున్న బడ్జెట్‌లో ఎక్సైజ్ ఆదాయ అంచనాలలో ప్రభుత్వ మద్యం విధానం బయట పడడానికి కొద్ది రోజులు ముందుగా, ఫిబ్రవరి 8 న కొత్త మద్యం విధానాన్ని ప్రకటించింది.

ఈ కొత్త మద్యం విధానం పాత ప్రభుత్వం అమలు చేసిన మద్యం విధానానికి ఏమీ భిన్నమైనది కాదు. మద్యాన్ని ఆదాయ వనరుగా చూడడంలో, మద్య విధానం ద్వారా అటు మద్యం ఉత్పత్తిలో ఉన్న బహుళజాతి సంస్థలకు, ఇటు మద్యం చిల్లర వ్యాపారులయిన తమ ఆశ్రితులకు లాభాలు చేకూర్చి పెట్టడంలో, ప్రజలను వ్యసనపరులుగా మార్చి వారి నెత్తుటినీ చెమటనూ దోచుకోవడంలో తెలుగుదేశం మద్య విధానానికీ, కాంగ్రెస్ మద్య విధానానికీ మధ్య తేడా ఏమీ లేదు.

కాంగ్రెస్ పార్టీ ప్రకటించిన కొత్త మద్యం విధానంలో ప్రధానాంశాలు:

* పాత విధానం కింద ఉన్న 6,800 మద్యం దుకాణాల లైసెన్సులు రద్దు చేసి, కొత్తగా 7,500 మద్యం దుకాణాలకు అనుమతి ఇవ్వడానికి వీలుగా నిబంధనలు మార్చడం.
* పాత విధానం ప్రకారం ఆంధ్రప్రదేశ్ బెవరేజెస్ కార్పొరేషన్ మద్యాన్ని, బీరును టోకుగా కొనడానికి 28 డిస్టిలరీలు, 4 బ్రూవరీల జాబితా ఉండేది. కొత్త విధానం ఈ టోకు కొనుగోలు ఎవరి నుంచయినా జరగవచ్చని జాబితాను విస్తరించింది.
* పాత విధానం ప్రకారం బార్ ఏర్పాటు చేయడానికి మునిసిపాలిటీ ప్రాంతాలలోనే అనుమతి ఉండగా, కొత్త విధానం ఆ ప్రాతిపదికను మార్చి 25,000 జనాభా ఉంటే బార్లు అనుమతించ వచ్చునని అంటుంది.

మద్యం వ్యాపారంలో బలపడి ఉన్న సిండికేట్లను దెబ్బతీసేందుకు, పోటీని పెంచి మద్యం తక్కువ ధరలకు అందేలా చూసేందుకు, మద్యం వ్యాపారాన్ని క్రమబద్ధీకరించేందుకు మాత్రమే ఈ మార్పులు చేయవలసి వచ్చిందని కాంగ్రెస్ ప్రభుత్వం చెప్పుకుంది. నిజానికి ఈ మూడు కారణాలూ సాకులే తప్ప మద్య నిషేధం దిశగా చేసే ప్రయాణానికి సూచికలు కావు. మద్యం వ్యాపారంలో బలమైన సిండికేట్లు ఏర్పడి ఉన్నాయనే మాట నిజమే.

వాటిని బలహీనపరచడానికి చర్యలు తీసుకోవలసిన అవసరం ఉన్నమాట నిజమే. కాని కొత్త విధానం లక్ష్యం నిజంగా అది కాదు. మద్యం వ్యాపారంలో బలపడి ఉన్న తెలుగుదేశం పార్టీ వారిని తొలగించి, ఆ స్థానంలో కాంగ్రెస్‌వారిని కూచోబెట్టడం కోసం గుత్తగా పాత లైసెన్సులన్నీ రద్దుచేసి కొత్త లైసెన్సులు జారీ చేయాలని కొత్త విధానం సూచించింది. గతంలో రాష్ట్రంలోని డిస్టిలరీల నుంచి, బ్రూవరీల నుంచి మాత్రమే టోకు కొనుగోళ్ళు చేయాలనే నిబంధన ఉన్నందువల్ల ఎపి బివరేజెస్ అధికారులకు గాని, ఎక్సైజ్ అధికారులకు గాని, మంత్రులకు, ముఖ్యమంత్రికి గాని ముడుపులు అందే వనరులు తక్కువగా ఉండేవి. ఆ వనరులను విస్తరించి, ముడుపులు ఇచ్చేవారి మధ్య పోటీ పెంచి, ముడుపులు పెంచుకోవడం కొత్తవిధాన లక్ష్యం. మద్యం వ్యాపారాన్ని క్రమబద్ధీకరించి, మద్యం నుంచి ఆదాయాన్ని పెంచుకోవడానికనే లక్ష్యంతో అనుమతుల సరళీకరణ జరిగింది గాని వాస్తవంగా రాష్ట్రాన్ని మద్యాంధ్రప్రదేశ్‌గా మార్చి, తమ అక్రమాలను గుర్తించి, ప్రశ్నించి, పోరాడడానికి అవకాశం లేని మత్తులో ప్రజల్ని ముంచడానికి ప్రభుత్వం వేసిన ఎత్తుగడ ఇది.

ఈ విధానం 'చట్టం ఎదుట సమానత్వం' అనే సూత్రానికి వ్యతిరేకంగా తమపట్ల వివక్ష చూపుతున్నదని, కనుక ప్రజల్ని పీల్చి పిప్పి చేయడంలో తమ తోటి మద్యం వ్యాపారులకు ఉన్నన్ని అవకాశాలు తమకు కూడ ఉండాలని కొందరు మద్యం వ్యాపారులు కోర్టు కెక్కారు. పాత లైసెన్సు దారులకు, కొత్త లైసెన్సుదారులకు మధ్య తేడా చూపవద్దని ప్రభుత్వాన్ని ఆదేశించమని కోర్టును అభ్యర్థించారు.

సర్వసాధారణంగా ఇటువంటి కేసులు కోర్టుకు వచ్చినప్పుడు కోర్టును కూడ ఏదో ఒక విధంగా ప్రభావితం చేసి తనకు అనుకూలమైన తీర్పు వచ్చేలా చూసుకోవడం చంద్రబాబునాయుడు తొమ్మిది సంవత్సరాలపాటు అమలు చేసిన పద్ధతి. కాంగ్రెస్ ప్రభుత్వం ఇంకా ఆ పద్ధతిలో శిక్షణ పొందినట్టు లేదు. అందువల్ల ఈ కేసులో ప్రభుత్వానికి చుక్కెదురయింది.

జస్టిస్ ఎల్ నరసింహారెడ్డి తీర్పు కేవలం పాత, కొత్త మద్యం వ్యాపారుల మధ్య తేడా గురించి మాత్రమే కాక, ఇతరంగా అవసరమైన సామాజిక, ఆర్థిక, న్యాయపరమైన అంశాలను ప్రస్తావించింది. మద్యం వ్యాపారాన్ని ఇతర వ్యాపారాల లాగ లాభనష్టాల దృష్టితో చూడగూడదని, రాజ్యాంగం నిర్దేశించిన ఆదేశిక సూత్రాల ప్రకారం ప్రభుత్వం క్రమక్రమంగా సమాజాన్ని మద్యరహిత సమాజం దిశగా నడిపించాలని ఈ తీర్పు చెప్పింది.

ఈ మధ్యంతర తీర్పునే మరింత విస్తృతంగా అంతిమ తీర్పుగా పూర్తిబెంచ్ మార్చ్ 22న ప్రకటించింది. ఈ తుది తీర్పు ప్రభుత్వానికి ఒక కొత్త మద్యం విధానం రూపొందించేందుకు ఉన్న హక్కును గుర్తిస్తూనే, రెండు రకాల లైసెన్సుదారులకు మధ్య వివక్ష చూపగూడదని అంది. తుది తీర్పు పూర్తి పాఠం ఇది రాసే సమయానికి అందనప్పటికీ, పత్రికా వార్తల ప్రకారం, పాత 6,800 మద్యం దుకాణాలకు పాత విధానం వర్తించేట్టు, కొత్త 700 దుకాణాలకు కొత్త విధానం వర్తించేట్టు చూడాలని హైకోర్టు చెప్పినట్టు తెలుస్తోంది. ప్రభుత్వం కొత్త విధానం తయారు చేయడానికి అనుమతించినట్టు కూడ తెలుస్తోంది.

తాజా తీర్పు తర్వాత దానిపై అప్పీలుకు సుప్రీం కోర్టుకు వెళతానని ప్రభుత్వం అనగా, ప్రభుత్వ అక్రమం బైటపడిందని ప్రతిపక్షాలు అన్నాయి. ఈ న్యాయపరమైన సాంకేతిక సంక్లిష్టతలు ఎలా ఉన్నా, ప్రజలకు మద్య నిషేధం హామీ ఇచ్చి అధికారానికి వచ్చిన ప్రభుత్వం, ఆ హామీని భగ్నం చేయడంలో అనుచితత్వం గురించి మాత్రం న్యాయస్థానం మాట్లాడ లేదు. సమాజమే మాట్లాడ వలసి ఉంది. *

1996 లో దళిత, గిరిజన కుటుంబాలకు ఎంత భూమి వుందో అయిదు సంవత్సరాల తర్వాత 2000-01లో కూడా అంతే భూమి వుంది. ఆ భూమి సగటు విస్తీర్ణం 0.83 హెక్టారు మాత్రమే. రాష్ట్రంలో 115 లక్షల కమతాల కింద పంటభూమి 144 లక్షల హెక్టార్లుంటే అందులో ఈ కుటుంబాలకున్న 22 లక్షల కమతాల కింద భూమి 28 లక్షల హెక్టార్లు మాత్రమే. రాష్ట్ర ఆర్థిక గణాంకశాఖ 2001లో జరిపిన భూకమతాల సర్వేలో ఈ విషయాలు వెల్లడయ్యాయి. ఈ శాఖ ప్రతి అయిదేళ్ల కొకసారి ఈ సర్వే నిర్వహిస్తుంది. ఒక హెక్టారు లోపు, 1 నుంచి 2 హె., 2 నుంచి 4 హె., 4 నుంచి 10 హె., 10 నుంచి 20 హె. ఆ పైన ఉన్న కమతాల సంఖ్య విస్తీర్ణం జిల్లాల వారీగా గణాంకాలు ఈ సర్వేలో లభించాయి. వ్యక్తిగత పట్టాలు, జాయింటు పట్టాలు, సంస్థల పట్టాలు, విస్తీర్ణం గురించిన వివరాలు కూడా ఈ సర్వేలో లభించాయి. దళితులు, గిరిజనుల కమతాల గణాంకాలు వేరేగా ఇవ్వబడ్డాయి.

ఈ తాజా గణాంకాల వివరాలు, విశ్లేషణలు 'వీక్షణం' వచ్చే సంచికలో...

# కొత్తదనం లేని బడ్జెట్

- వి. హనుమంతరావు

బడ్జెట్ అంటే ఆదాయ వ్యయాలు, లోటు-మిగులు, పన్నులు, సుంకాలు, ఎగుమతులు-దిగుమతులు, విదేశీ మారకం నిల్వలు, జిడిపి, ద్రవ్యలోటు-ఇవి మాత్రమే కాదు; ఇవి ప్రజల జీవితాలను, ముఖ్యంగా సామాన్యుల జీవితగతులను ఎలా ప్రభావితం చేస్తున్నాయి అనేదే గీటురాయిగా వుండాలి. దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ అని మహాకవి గురజాడ ప్రవచనం ఇక్కడ ఉదహరించటం సముచితం. ఆర్థికసూత్రాల ప్రకారం పైనుదహరించినవన్నీ సవ్యంగా వుంటే ఆదాయాలు పెరుగుతాయి, ఉద్యోగాలు లభిస్తాయి. కాని మనం గమనిస్తున్నదీ, అనుభవిస్తున్నదీ సంపద పెరుగుతుంది కాని దాని ఫలితాలు కొద్దిమంది హస్తగతమవుతున్నాయి. మిట్టల్ ప్రపంచంలోనే అత్యంత ధనవంతుల జాబితాలో అగ్రస్థానాలకు చేరితే, లేదా రిలయన్స్ సంస్థ బిలియనీర్ సంస్థల సరసన నిల్చొంటేనేమి, ఆ పరిణామాలు సామాన్యుల పొట్టనింపుతుందా, నిరుద్యోగులకు ఉద్యోగం లభిస్తుందా, మధ్యతరగతి త్రిశంకుస్వర్గంలో వేలాడకుండా స్థిర ఆదాయాన్ని ప్రసాదిస్తుందా అని బడ్జెట్‌ను విశ్లేషించుకొన్నపుడు ప్రశ్నించుకోవాలి. దేశ జనాభాలో ప్రతినలుగురిలో ఒకరు పేదరికపు రేఖకింద నలిగిపోతూంటే, ఇండియా ధనవంత దేశంగా అభివృద్ధి అవుతుంటే ఎవరిక్కావాలి? సంతోషం కొద్దిమందికి, విషాదం అత్యధిక సంఖ్యాకులకు-ఈ పరిస్థితినుంచి ఈ బడ్జెట్ ఈ దేశాన్ని, ఈ ప్రజలను ఒడ్డున పడేస్తుందా అనేదే చూడాలి.

ఒడ్డునపడేస్తుంది అని ప్రజలకు నమ్మ బలకడానికి 'మానవతతో కూడిన సంస్కరణలు' అనే నినాదాన్ని ప్రచారంలో పెట్టారు పాలకులు. (ఇండియా వెలిగిపోతుంది అని బిజెపి అన్నట్లు). అయితే తొమ్మిది నెలల కాలంలోనే ఆ ముసుగు తొలగిపోయి, సంస్కరణల అవతారం బయటపడింది. ఆర్థిక సర్వే చెప్పినదేమంటే 1) రైతులకిచ్చే సబ్సిడీలు ఉపసంహరించాలి. 2) పరిశ్రమల్లో కార్మికులను తొలగించే స్వేచ్ఛ యజమానులకివ్వాలి. 3) చిన్న పరిశ్రమలరంగానికి రిజర్వు చేసిన ఉత్పత్తుల పట్టికను రద్దుచేయాలి. 4) బ్యాంకుల ప్రయివేటీకరణ వైపుగా కొనసాగాలి. 5) మౌలిక సౌకర్యాల రంగంలో ప్రయివేటీకరణకు చోటివ్వాలి. 6)విదేశీ పెట్టుబడులను ధారాళంగా ఆహ్వానించాలి.

ఈ సంస్కరణలను అమలు పరచటం మూలానే అప్పట్లో కాంగ్రెస్, తర్వాత ఎన్.డి.ఎ.లను ప్రజలు నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. మళ్లా ఆ సంస్కరణలనే తిరగదోడి అమలు పరచాలని నిర్ణయించుకొన్నారంటే ప్రపంచబ్యాంకు రుణసహాయం అనే కత్తి ఇంకా ప్రభుత్వం నెత్తిన వేలాడుతుందని స్పష్టం. అయినా, సంస్కరణలు, మానవీయత అనేవి పరస్పర విరుద్ధమైన విషయాలు. ఒకటి వున్న చోట మరొకటి వుండదు. కాగా మానవీయతతో కూడిన సంస్కరణలను ప్రభుత్వం అమలు పరుస్తామని అంటే నమ్మటం మనదే బుద్ధితక్కువేమోనని పిస్తుంది. బడ్జెట్ రచన అనేది మన చేతుల్లో నుంచి ఎపుడో జారిపోయింది. సంస్కరణల అనంతరం ప్రతీ బడ్జెట్ బ్యాంకు ప్రతినిధులు చూచి ఓ.కే అన్న తర్వాతనే పార్లమెంటు సభ్యులు చూస్తున్నారన్న విషయాన్ని గమనించాలి. ఆర్థికసర్వేలో పైన ఉదహరించిన ఆరుపాయింట్లు ప్రపంచబ్యాంకు విధించిన షరతుల్లో భాగమే.

**సాంఘిక సంక్షేమం**

బడ్జెట్‌లో మానవతను సమకూర్చేవి సాంఘిక సంక్షేమ పథకాల పద్దుకింద చేసిన కేటాయింపులు, ఖర్చులు. బడ్జెట్‌లో సాంఘిక సంక్షేమ పథకాలకు 2004-05 ప్రణాళికలో రు. 35,739 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా వేయగా, సవరించిన అంచనా వచ్చే సరికి ఆ ఖర్చు అంచనా రు. 39,378 కోట్లకు పెరిగి వచ్చే ఏడాది రు. 53,384 కోట్లకు చేరుకోనున్నదని చదివినపుడు ఎవరికైనా సెహభాష్ అని అనాలనిపిస్తుంది. కాని కొంచెం దాని నుంచి పక్కకు చూస్తే ప్రణాళిక మొత్తం కేటాయింపులో ఈ పద్దుకింద ఖర్చు 04-05లో 26.11 శాతం వుంటే, వచ్చే ఏడాదికి 25.27 శాతానికి పడిపోయింది. అసలు మొత్తం ప్రణాళిక కేటాయింపే నడుస్తున్న సంవత్సరంలో రు. 1,63,720 కోట్ల నుంచి సవరించిన అంచనా ప్రకారం రు. 1,50,818 కోట్లకు పడిపోయింది. సామాజిక సంక్షేమ పథకాల్లో ఆరోగ్యమంత్రిత్వ శాఖ ఉదాహరణగా తీసుకొంటే నడుస్తున్న సంవత్సరంలో కేటాయించిన మొత్తంలో సగమే ఖర్చు చేయగలిగింది. ఒక పక్క కనీస ఉమ్మడి కార్యక్రమంలో ఆరోగ్యం కోసం జిడిపిలో కనీసం రెండు నుంచి మూడు శాతం మేరకు ఖర్చు చేయాల్సి వుందని చెప్పినా, ఆచరణలో ఉమ్మడి కార్యక్రమం మీద సంతకం చేసిన మొదటి ఏడాదిలోనే కేటాయింపులో సగమే ఖర్చు చేసారు. మార్చి 31 నాటికి 55 శాతం ఖర్చు చేయగలమేమోనని అధికారులు అంటున్నారు. కేటాయింపులు బరువుగా వుంటాయి కాని ఆచరణ వచ్చేనరికి తేలిపోతుందని

అనుభవం చెబుతూంది. అందుచేత కేటాయింపులు చూచి మురిసి పోకూడదు. పాలకులు దీనిని ఒక కళగా రూపొందించుకొన్నారు. ఈ కళలో భాగమే పాప్యులిస్టు పథకాల ప్రకటనలు. ప్రభుత్వ కార్యక్రమాలు అమలు పరచడానికి వివిధ మంత్రిత్వశాఖలున్నాయి. కాని ఆ శాఖలను తత్సంబంధిత పథకాలను అమలు పరచనీయకుండా వాటిని అమలు పరచడానికి పాప్యులిస్టు పథకాలు సృష్టించారు. ఉదాహరణకు ఉపాధి కల్పనకు కార్మిక శాఖ వుంది. పరిశ్రమల శాఖ కూడా ఉద్యోగాలు కల్పించే కార్యక్రమాలను అమలు పరుస్తుంది. అత్యధిక జనాభాకు ఉపాధి కల్పించే వ్యవసాయ శాఖ వుంది. కాని ఉపాధి కల్పించడానికి స్వర్ణజయంతి స్వరోజ్‌గార్ యోజన, సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్‌యోజన లాంటి పథకాలను వేరేగా అమలు పరచడమెందుకు? గృహ నిర్మాణ శాఖ వేరే వుండగా వాంబే పథకాన్ని వేరుగా ప్రవేశపెట్టడమెందుకు? ఇలా వేరే పథకాలు ప్రవేశ పెట్టడంవల్ల వాటికి కావాల్సిన పరిపాలనా యంత్రాంగం కోసం బోలెడంత వ్యయం అవుతుంది. ఇది దుబారా ఖర్చు. పరిపాలనా వ్యవస్థ ఖర్చును ఆదా చేయవచ్చుకదా. కాని ఇలా పాప్యులిస్టు పథకాలు వారి రాజకీయ ప్రయోజనాలకోసం సృష్టించారు.

**ప్రధాని గ్రామీణ రహదారుల పథకం:**

2000 సంవత్సరంలో ప్రారంభమైంది. 60 వేలకోట్ల రూపాయలతో 1.6 లక్షల గ్రామాలకు, పంచాయతీ కేంద్రాలకు, పర్యాటక కేంద్రాలకు రహదారులను 10వ ప్రణాళిక ఆఖరుకు పూర్తి చేయటం లక్ష్యం. డిసెంబరు 02 వరకు 10,882 గ్రామాలకు రహదారులు నిర్మిస్తే, మార్చి 04 వరకూ 20,740 గ్రామాలకు రహదారులు నిర్మించగా అదే సంవత్సరం అక్టోబరు నాటికి 60,024 గ్రామాలకు రహదారులు వేయటం పూర్తి అయిపోయిందంటున్నారు. అంటే రాబోయే రెండేళ్లలో లక్ష గ్రామాలకు రహదారులను నిర్మించాలి. సాధ్యమా? 2000లో ప్రారంభంనుండి అక్టోబరు వరకూ రు. 7,866 కోట్లు ఖర్చు చేసామంటున్నారు. అంటే మిగతా రెండేళ్లలో 52 వేలకోట్ల రూపాయలు ఖర్చు చేయాలి. సాధ్యమా? మొదటి అంచనా ప్రకారం ఈ పథకం పూర్తి చేయడానికి రు. 60 వేలకోట్లు ఖర్చవుతుందని అంచనా వేయగా, ఆ శాఖ అధికారులు రు. 130 వేలకోట్లుంటేనేగాని ఈ పథకం పూర్తి కాదంటున్నారు.

**ప్రధాని గ్రామోదయ యోజన:**

01-02లో ప్రారంభమైంది. ప్రాథమిక వైద్యం, ప్రాథమిక విద్య, గృహ నిర్మాణం, మంచినీరు, పోషకాహారం గ్రామాల్లో ఏర్పాటు చేయడానికి కేంద్రం అదనపు ఆర్థిక సహాయం చేయటం లక్ష్యం. మొదటి రెండేళ్లలో ఏడాదికి రు. 2,500 కోట్లు కేటాయించగా, 02-03, 03-04 సంవత్సరాలకు కలిపి రు. 2,800 కోట్లు, 03-04, 04-05 రెండేళ్లకు రు. 2,800 కోట్లు కేటాయించారు. అంటే చివరి మూడు సంవత్సరాల్లో సగటున ఏడాదికి రు. 1,900 కోట్లు కేటాయించినట్లు? ఈ పథకం అమలు బాధ్యత తత్సంబంధిత మంత్రిత్వ శాఖలకు అప్పగించగా ఆ తర్వాత ప్రణాళికాసంఘమే ఆ బాధ్యతను చేపట్టింది. ఇంతకూ ఇంత డబ్బు ఖర్చు చేసి ఏం సాధించారనే సమాచారం మూడు సంవత్సరాల ఆర్థిక సర్వేలను తిరగేసినా, లభించలేదు.

**స్వర్ణ జయంతి గ్రామ్ స్వరాజ్‌గార్ యోజన:**

స్వయం ఉపాధి కల్పించటం లక్ష్యం. కేంద్రం-రాష్ట్రం 75:25 శాతం నిధులు సమకూర్చుతాయి. ఏప్రియ 1999లో ప్రారంభమైంది. ఏప్రిల్ 2002 వరకూ కేంద్రం, రాష్ట్రాలు కలిసి రు. 4,335 కోట్లు కేటాయిస్తే రు. 3,497 కోట్లు ఖర్చయింది. ఏప్రిల్ 2004 వరకు రు. 6,734 కోట్లు కేటాయింపు, రు. 4,980 కోట్లు మాత్రమే ఖర్చయింది. మొత్తం 46 లక్షలమంది లబ్ధిపొందారు. మొన్న చిదంబరం ప్రవేశపెట్టిన ఆర్థిక సర్వే ప్రకారం 04-05లో కేటాయింపుగాని, ఖర్చు చేయటం గాని జరగలేదు. అంటే ఏడాదికి సగటున రు. 1,347 కోట్లు ఖర్చు చేసి తొమ్మిది లక్షలమంది ఉపాధి కల్పించినట్లు కాగితం మీద లెక్కలు చెబుతున్నాయి. మన రాష్ట్రంలో ఈ పథకం అమలును గీటురాయిగా తీసుకొంటు, ఈ గ్రూపులు ఎడ్రస్ లేకుండా పోవటం జరిగింది. కాగా, పైన ఉదహరించిన 46 లక్షల గ్రూపుల్లో ఎన్ని పని చేస్తున్నాయో తెలియదు. ప్రభుత్వం దగ్గర అలాంటి లెక్కలుండవు.

**సంపూర్ణ గ్రామీణ్‌రోజ్‌గార్ యోజన:**

ప్రతి సంవత్సరం నూరుకోట్ల పనిదినాలు కల్పించే ఈ పథకాన్ని సెప్టెంబరు 2001లో ప్రారంభించారు. తట్ట, పార చేత పట్టుకొని మట్టిపని చేసేవారికి ఉపాధి కల్పన లక్ష్యం. 2001-02లో ఎన్ని పనిదినాలు కల్పించారో లెక్కల్లేవు. శాశ్వత ఆస్తులు ఏమి కల్పించారో చెప్పలేదు. ఈ కూలీలకు తిండి గింజలు సరఫరా చేస్తే, వాటిని పూర్తిగా వినియోగించుకోలేదు.

**ప్రధానిరోజ్‌గార్ యోజన గ్రామీణ, ఉపాధి కల్పన పథకం:**

మొదటిది గ్రామాల్లో, రెండవది స్వయం ఉపాధి కల్పన కోసం ప్రారంభించిన పథకాలు. మొదటి పథకం కింద 03-04లో 8.32 లక్షల ఉద్యోగావకాశాలు కల్పిస్తే 04-05లో 5.25 లక్షలకే లక్ష్యం

పరిమితం చేశారు. ఆ లక్ష్యం ఏ మేరకు సాధించింది చిదంబరం ఆర్థిక సర్వేలో లేదు. విద్యాధికులైన యువతీ యువకులకు ఉద్యోగావకాశాలు కల్పించే లక్ష్యంతో ప్రారంభించిన రెండవ పథకం కింద 04-05లో 3.75 లక్షల ఉద్యోగాల కల్పన చేయాల్సి వుండగా, చేసారో లేదో సర్వేలో సమాచారం లేదు.

**అంత్యోదయ అన్న యోజన:**

పేదల్లో నిరుపేదలకు అతి తక్కువ ధరకు 35 కిలోల బియ్యం, గోధుమ సరఫరా చేయటం లక్ష్యం. అయితే ఈ పథకాన్ని వినియోగించుకోవటంలో రాష్ట్రాలు విఫలమయ్యాయి. 02-03లో కేంద్రం 41.27 లక్షల టన్నులు ఈ పథకానికి కేటాయిస్తే 35.39 లక్షల టన్నులే రాష్ట్రాలు తీసుకొని వెళ్లాయి. తర్వాత సంవత్సరంలో 45.56 లక్షల టన్నులకు గాను 38.24 లక్షల టన్నులే రాష్ట్రాలు తీసుకొన్నాయి. (అయితే 04-05 సర్వే ప్రకారం 41.65 లక్షల టన్నులు తీసుకొని వెళ్లాయి). నిరుపేదలు తగ్గిపోయారా ఏమిటి?

**వాల్మీకి అంబేద్కర్ ఆవాస్ యోజన:**

పట్టణాల్లో, నగరాల్లో నివసించే నిరుపేదలకు గృహ నిర్మాణం ఈ పథకం లక్ష్యం. 04-05 ఆర్థిక సర్వే ప్రకారం ఈ పథకం ప్రారంభించినప్పటి నుంచి డిసెంబరు 04 వరకూ కేంద్రం సబ్సిడీగా రు. 753 కోట్లు మూడున్నర లక్షల గృహ వసతులు ఏర్పాటుకు "విడుదల" చేసింది. 02-03కు 03-04 మధ్య కాలంలో విడుదల చేసిన నిధులు రు. 310 కోట్లయితే ఆ తర్వాత సంవత్సరంలో రు. 231 కోట్లకు తగ్గింది. అసలు విషయం ఏమంటే కేంద్రం తనవంతు సగం నిధులను విడుదల చేసిందని చెబుతుంది తప్ప, రాష్ట్రం తనవంతు ఏభైశాతం విడుదల చేసిందీ లేనిదీ సర్వే చెప్పలేదు. ఎన్ని గృహ వసతులు కల్పించిందో కళ్లల్లో కలికం పెట్టి చూచినా ఆ సమాచారం లేదు. అలాగే స్వర్ణజయంతి షహరీరోజ్‌గార్ యోజన పథకం కింద పట్టణాల్లో పేదరికం తగ్గించడానికి ఉపాధి కల్పించటం లక్ష్యం. పై పథకంలో లాగే ఈ పథకం కింద కేంద్రం తన 75 శాతం నిధులను విడుదల చేసానని చెబుతుందే కాని రాష్ట్రాలు తమవంతు 25 శాతం నిధులను సమకూర్చాయో లేదో, ఎంతమందికి ఉపాధి లభించిందో చెప్పలేదు.

పాప్యులిస్టు పథకాలు ఎంత మోసపూరితమైనవో పైన చేసిన విశ్లేషణ తెలియ చేస్తుంది. కాబట్టి భారీ కేటాయింపుల గణాంకాలు చూచి మూర్ఛపోనక్కర్లేదు. మనకు మేలు జరగాలంటే బడ్జెట్లు దానిని సమకూర్చలేవు; ప్రజల ఆందోళనలు, పోరాటాలు ద్వారా మాత్రమే మనకు కావాల్సిన వాటిని సాధించుకోగలం.

**రుణాల ఊబి:**

ఇంత 'ఘనకార్యాన్ని' సాధించడానిక్కూడా రుణాలకోసం పరుగులు తీయాల్సి వస్తోంది. నడుస్తున్న సంవత్సరంలో రెవెన్యూ ఆదాయం (బ.అం.) రు. 3,09,922 కోట్లు; రుణం వాయిదా, వడ్డీ చెల్లింపు రు. 3,27,880 కోట్లే! అంటే మన రెవెన్యూ ఆదాయం మొత్తం అసలు, వడ్డీ చెల్లింపులకు చాలటం లేదన్న మాట. ఇది చిదంబరం బడ్జెట్ మొదటి విశేషం. పై గణాంకాలు బడ్జెట్ అంచనా అయితే, సవరించిన అంచనా ప్రకారం రెవెన్యూ ఆదాయం తగ్గింది; అసలు, వడ్డీ చెల్లింపు మొత్తం పెరిగింది. ఇది రెండో విశేషం. వచ్చే సంవత్సరంలో రెవెన్యూ ఆదాయం రు. 3,51,200 కోట్లు కాగా, అసలు, వడ్డీ, చెల్లింపులు రు. 3,81,929 కోట్లు. ఇది మూడో విషయం. ఈ ఏడాది ఆదాయం కన్నా చెల్లింపు రు. 18,558 కోట్లు ఎక్కువయితే, వచ్చే సంవత్సరంలో ఈ తేడా రు. 30,729 కోట్లకు పెరగనుంది. ఇది నాలుగో విశేషం. రుణం తిరిగి చెల్లింపు, వడ్డీభారాలు ప్రతీ సంవత్సరం పాపం పెరిగినట్లు పెరుగుతూనే వున్నాయి.

| | 2003-04 | 2003-04 | 2004-05 | 2004-05 | 2005-06 |
|---|---|---|---|---|---|
| | (బ.అం) | (స.అం) | (బ.అం) | (స.అం) | బ.అం |
| 1. రుణం తిరిగి చెల్లింపు | 165376 | 267059 | 198380 | 224075 | 247984 |
| 2. మొత్తం వడ్డీ చెల్లింపు | 123223 | 124555 | 129500 | 125905 | 133945 |
| 3. రుణం+వడ్డీ(1+2) | 288599 | 391614 | 327880 | 349980 | 381929 |
| 4. రెవెన్యూ ఆదాయం | 253935 | 263027 | 309322 | 300904 | 351200 |

పై పట్టిక తెలియ చేసే విశేషమేమంటే ప్రతీ సంవత్సరం బడ్జెట్ అంచనాకంటే సవరించిన అంచనా ఎక్కువగా వుండడం. ఇవి రుణాలు, వడ్డీలకు సంబంధించిన గణాంకాలు కాబట్టి పెరగటం అంటే అదేమీ శుభవార్త కాదు. అప్పుతేవడమంటేనే ప్రభుత్వం ఖర్చును అదుపులో పెట్టలేక పోవటం; అలాంటిది అంచనాను మించి అప్పు తేవటం ప్రభుత్వ అసమర్థత మరింత ఉన్నత శిఖరాలకు చేరటమే. ఇది అయిదో విషయం.

చిదంబరం తన బడ్జెట్ ఉపన్యాసంలో ఈ విషయం చెప్పలేదే అని అంటున్నారా? ఎందుకు చెబుతారు? ఏం ఘన కార్యం సాధించామని చెబుతారు? మన్‌మోహన్‌సింగ్, చిదంబరం, అహ్లువాలియా త్రయం సాధించింది ఇదన్న మాట. అందరూ శ్రీ వైష్ణవులే రొయ్యల బుట్ట మాయమైందన్న సామెత అలా ముగ్గురికి ముగ్గురూ ఆర్థిక శాస్త్ర నిపుణులే, కాగా వాళ్ల తయారు చేసిన బడ్జెట్ నిర్వాకం ఇది.

రుణభారం, వడ్డీ చెల్లింపులు మరో కోణం నుంచి చూస్తే అభివృద్ధిని ఎలా మింగేస్తున్నాయో తెలుస్తుంది. ఏ ఖర్చయినా మానేయవచ్చు, వాయిదా వేయవచ్చు. కాని ఆరునూరైనా, నూరు ఆరైనా కొన్ని ఖర్చులు విధిగా చెయ్యాల్సిందే. అవి రక్షణ, వడ్డీ, సబ్సిడీలు, పింఛన్లు, పరిపాలనా ఖర్చులు. రాబోయే ఆర్థిక సంవత్సరంలో మొత్తం ప్రణాళికేతర ఖర్చులో పై ఖర్చులు 79 శాతం; మొత్తం రెవెన్యూ ఆదాయంలో 83.41 శాతం; మొత్తం మూల ధన ఆదాయం (అంటే ప్రధానంగా రుణాలు) +రెవెన్యూ ఆదాయంలో 55 శాతం. ఇంత శాతం ఎట్టి పరిస్థితుల్లోనూ వాయిదా వెయ్యలేని ఖర్చు చేసిన తర్వాత అభివృద్ధి కోనం ఖర్చు చేయడానికి ఏం మిగులుతుంది? అభివృద్ధి బొట్టుబొట్టుగా రాలుతూంటే అట్టడుగున వున్న నిరుపేదలు అభివృద్ధి ఫలితాలనందుకోవడానికి ఎన్ని దశాబ్దాలు ఆగాలి?

**వేలకోట్లు మింగేస్తున్న రక్షణ ఖర్చు:**

దేశ రక్షణ గంగి గోవు లాంటిది. ఇది కేంద్ర ప్రభుత్వ జాబితాలో విషయం. అది వాస్తవం, అవసరం కూడా. దేశ రక్షణ అంటే రాష్ట్రాలన్నిటి రక్షణ. అందుకు కావాల్సిన నిధులన్నీ రాష్ట్రాలు సమకూర్చాలి. కాని ఈ పద్దుకు కేటాయింపు విషయంలో రాష్ట్రాలకు ఎటువంటి ప్రమేయం లేదు. రాష్ట్రాల మాట అటుంచి కేంద్రానికైనా ఆ విషయంలో ఏమైనా చెప్పే అవకాశం వుందా అని అనుమానం వస్తుంది. రక్షణ శాఖలోని మూడు దళాల అధిపతులు (వాయు, సముద్ర, పదాతి దళాకారులు) చెప్పిందే వేదం. ఈ శాఖకు కేటాయింపు ప్రతి సంవత్సరం పాపం పెరిగినట్లు పెరుగుతూంది. ఇదేమిటని అడిగితే పాకిస్తాన్ బూచిని చూపిస్తారు. 1971 బంగ్లాదేశ్ యుద్ధం తర్వాత మనదేశం యుద్ధం చేయలేదు. (సరిహద్దుల్లో లేదా కాశ్మీర్‌లో జరిగే సరిహద్దు ఘటనలు తప్ప). దీనికోసం రు. 83 వేలకోట్లు పైగా కేటాయింపా? రక్షణ శాఖకు అవసరమైన కొన్ని కీలక యుద్ధ సామాగ్రిని మన రక్షణ శాఖకు పరిశోధనా సంస్థలు రూపొందిస్తున్నాయి. అయినా పాకిస్తాన్ వద్ద ఫలానా రకం ఆయుధం, లేదా విమానం వుంది, మనక్కూడా అలాంటివే కావాలి అంటారు అధికారులు. మనలాంటి అభివృద్ధి చెందుతూన్న దేశం ఇలా వేలకోట్లు రక్షణ పేరుతో ఖర్చు చేస్తూ పోవాల్సిందేనా? ఇలా ఇరు దేశాల మధ్య శత్రుత్వాన్ని ఎగదోయటంలో ఆయుధాల బేహారులైన అమెరికాలాంటి దేశాల పాత్ర వుంది. వారి దేశాల్లోని మారణాయుధాల ఫ్యాక్టరీలకు మార్కెట్ కావాలంటే ప్రపంచంలో యుద్ధాలు జరుగుతూండాలి. పాకిస్తాన్, భారతదేశాల మధ్య శత్రుత్వం కొనసాగటం వారి ప్రయోజనాలకు అవసరం. ఇన్ని వేలకోట్లు ఎంతమేరకు తగ్గించుకోగలిగితే, అంత మేరకు అభివృద్ధికి నిధులు లభిస్తాయి; ఇతర దేశాల ముందు చేయిచాచాల్సిన పని వుండదు. ప్రభుత్వం ఈ విషయం గురించి ఆలోచించదు. రక్షణాధికారుల పంట పండదు. రాజకీయ పార్టీలు, మేధావులు, ప్రజలు ఈ విషయంలో ఉద్యమించాలి.

కుక్కతోక ఎంత సాఫ్ చేసినా వంకర పోదన్నట్లు ఆర్థికమంత్రి ఉపన్యాసమంతా పరిశ్రమలు, కార్పొరేట్లు, వ్యాపారం, ఎగుమతులు, పరిశ్రమల అభివృద్ధి, మౌలిక సౌకర్యాల కల్పన లాంటి విషయాలే ప్రధానాంశాలుగా వున్నాయి. ఒకపక్క రైతులకిచ్చే సబ్సిడీల మీద గుడ్లురుముతూనే పరిశ్రమలకు సబ్సిడీలు ప్రకటించటం ఏం విధానమండీ చిదంబరం గారూ? కస్టమ్స్, ఎక్సయిజు సుంకాలు తగ్గించాలని సంస్కరణలు ప్రారంభమైనప్పటి నుంచీ ప్రపంచబ్యాంకు ఒత్తిడి తీసుకొని వస్తూనే వుంది. ఈ ప్రభుత్వం తగ్గిస్తూనే వచ్చింది. ఈసారి మరోవిడత ఈ సుంకాలను మరింత తగ్గించి (కొన్ని వస్తువుల మీద అయితే అయిదు శాతానికి తగ్గింపు జరిగింది) ఒకపక్క పన్ను- జిడిపి నిష్పత్తి పెంచాల్సిన అవసరం వుందని చెబుతూ, రెండోపక్క ఆ పన్నులు తగ్గించటం జరిగితే, నిష్పత్తి ఎలా పెరుగుతుంది? పోనీ, నిష్పత్తి తగ్గించి ఆదాయం తగ్గినపుడు, అదెలా భర్తీ చేయబోతున్నారో చెబితే బావుండేది. ఇలా పారిశ్రామిక రంగానికి వరాల జల్లు కురిపించారు. సహజంగానే ఆ రంగం ప్రతినిధులు ఎగిరి గంతులు వేస్తున్నారు. మరోవైపు మధ్యతరగతి పన్నులనే నిప్పుల మీద నడిచే పని పెట్టారు ఆర్థికమంత్రి. పెట్రోలు, సర్వీసు ఛార్జీలు, సిగరెట్లు, పాన్ మసాలా లాంటి వస్తువుల మీద పన్నులు వేసినా, ఉద్యోగులకు ఆదాయపు పన్ను మినహాయింపు లక్ష రూపాయలకు, మహిళా ఉద్యోగులకు రు. 1.25 లక్షలకు, వృద్ధుల పరిమితి లక్షన్నరకు పెంచటం కాస్త ఊరట కలిగిస్తుంది. బడ్జెట్ ఉపన్యాసమంతా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు ఆహ్వానాలే. ఈ విషయంలో చైనాతో పోటీ పడడమే లక్ష్యంగా ఉన్నట్లు కనుపిస్తుంది. చైనాకు వచ్చే విదేశీ పెట్టుబడుల్లో సింహభాగం ఇతర దేశాల్లో వున్న చైనీయులు తీసుకొని వచ్చిన పెట్టుబడులే; కాగా మన భారతీయులు తమ దేశంలో డబ్బు వడ్డీకి తిప్పుతున్నారు. నక్కకు నాకలోకానికి వున్నంత తేడా.

మొత్తం మీద చూస్తే దేశంలో చాలా కొద్దిమందికి ఇది డ్రీమ్‌బడ్జెట్; మధ్య తరగతికి వర్షాలేదనిపించే బడ్జెట్; సామాన్యులకు గత ప్రభుత్వ విధానాలను కొనసాగించే బడ్జెట్.

*

# 2005-06 కేంద్ర బడ్జెట్-వ్యవసాయం

- కొల్లి నాగేశ్వరరావు
అధ్యక్షులు, ఎ.పి. రైతుసంఘం

2005-06 కేంద్ర బడ్జెట్ వ్యవసాయానికి ఎంతటి ఉపయోగం అనే అంశం పరిశీలించబోయే ముందు ఈ బడ్జెట్ ఏ నేపథ్యంలో రూపొందించబడింది పరిగణనలో వుంచుకోవాలి. భారతదేశ వ్యవసాయాన్ని సంక్షోభంలోకి నెట్టే, స్వావలంబనను దెబ్బతీసే ప్రపంచబ్యాంకు విధానాలు నమ్మిన ప్రధాని మన్‌మోహన్‌సింగ్ పాలనలో ఆర్థికమంత్రి పి. చిదంబరం ఈ బడ్జెట్ ప్రవేశపెట్టారు. ఈ కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వాన్ని బయటనుండి బలపర్చుతున్న వామపక్ష నాయకత్వం కేంద్ర ఆర్థికమంత్రిని 2005 ఫ్రిబవరి 1న కలిసి 12 పాయింట్ల వినతిపత్రం సమర్పించారు. ఫ్రిబవరి 24న వామపక్ష నాయకత్వం యు.పి.ఎ. చైర్‌పర్సన్ శ్రీమతి సోనియాగాంధి, ప్రధాని, ఆర్థికమంత్రులను కలిసి బడ్జెట్‌పై చర్చించారు.

ఆ వినతిపత్రంలో..."సి.యం.పిలో చేసిన ప్రధానమైన వాగ్దానాలలో ఉపాధి హామీ చట్టాన్ని అమలుపర్చాలి. గ్రామీణ మౌలిక వసతులు, సాగునీటికి సంబంధించి ప్రభుత్వ పెట్టుబడులు పెంచాలి. రానున్న ఐదేళ్ళలో విద్య, వైద్య రంగాలకు జి.డి.పి. లో 6 శాతం, 2-3 శాతం వుండే విధంగా దశల వారీగా వీటిపై ప్రభుత్వ ఖర్చు పెంచాలి. జాతీయ గ్రామీణ ఉపాధి హామీకి తోడ్పడేందుకు ఈ బడ్జెట్‌లో రు. 20,000 కోట్లు అదనంగా కేటాయించాలి. విద్య, వైద్య రంగాలకు చెరొక రు. 8,000 కోట్లు అదనంగా కేటాయించాలి. వ్యవసాయం, నీటిపారుదల గ్రామీణ మౌలిక వసతులకు మొత్తం కేటాయింపు రు. 14,000 కోట్లకు పెంచాలి. మొత్తం మీద సి.యం.సి. లో చేసిన వాగ్దానాల అమలుకు కేంద్ర ప్రణాళికా వ్యయం రు. 50,000 కోట్లు పెంచాలి"

ఆర్థికమంత్రి బడ్జెట్ ఉపన్యాసంలో "గడిచిన ఎన్నికల ఓటు నూతన నాయకత్వానికి అనుకూలమైన ఓటు, నూతన ప్రభుత్వానికి, నూతన విధానాలకు, నూతన రాజకీయాలకు, నూతన పరిపాలనకు మూలమైన సామాన్య మానవునికి అనుకూలమైన విధానాలకోసం ఇచ్చిన ఓటు" అన్నారు.

సి.పి.ఐ(యం) పార్లమెంటు సభ్యుడు మహమ్మద్ సలీం, "సి.యం.పిపరిమితులలో బడ్జెట్ వున్నప్పటికి ఆర్థిక విధానంలో సి.యం.పి. యొక్క అర్థం పూర్తిగా మార్చటంలో విఫలమైంది".

సి.పి.ఐ ప్రధాన కార్యదర్శి ఎ.బి. బర్ధన్ దీనిని "కార్పోరేట్ అనుకూల బడ్జెట్" అన్నారు.

సి.యం.పి. కార్యక్రమాలకు వామపక్షాలు బడ్జెట్‌లో రు. 50,000 కోట్లు కోరగా రు. 25,000 కోట్లు కేటాయించబడినవి. వ్యవసాయం, గ్రామీణాభివృద్ధి ప్రధాన లక్ష్యంగా "భారతనిర్మాణ్" నినాదం ప్రకటించారు. ఇందుకు దోహదంగా గ్రామీణ ప్రాతిపదిక సౌకర్యాలు కల్పించేందుకు ఇరిగేషన్, గృహవసతి, విద్యుత్తు, టెలిఫోన్ సౌకర్యం, రోడ్లు, త్రాగునీరుతో 6 ముఖ్యమైన కార్యక్రమాలు ప్రకటించారు. నేషనల్ రూరల్ ఎంప్లాయిమెంటు స్కీం గతంలో చట్టం చెయ్యబడింది. ప్రస్తుతం గ్రామీణయువతకు పనిహక్కు కల్పించబడింది.

అలాగే 150 జిల్లాలలో అత్యంత పేదవారికి సంవత్సరంలో 100 రోజులు పని కల్పించేందుకు ప్రకటించారు. ఇందుకు వామపక్షాలు రు. 20,000 కోట్లు కోరగా రు. 11,000 కోట్లు కేటాయించారు. ఐతే సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్ యోజన ద్వారా నిరుద్యోగులకు పని కల్పించేందుకు గత బడ్జెట్‌లో రు. 4,050 కోట్లు కేటాయించగా ఈ బడ్జెట్‌లో రు. 3,600 కోట్లకు తగ్గించారు.

ఇందిరా ఆవాస్‌యోజన ద్వారా 2005-06లో 15 లక్షల ఇళ్ళు నిర్మించబడతాయన్నారు. వచ్చే 4 సంవత్సరాలలో 60 లక్షల ఇళ్ళు నిర్మించేందుకు ప్రకటించారు.

**వ్యవసాయం**

2005-06 బడ్జెట్ రు. 5,13,344 కోట్లులో ప్రణాళికా ఖర్చు అంచనా రు. 2,11,253 కోట్లు. దీనిలో వ్యవసాయం అనుబంధ రంగాలకు కేటాయింపు రు. 6,425 కోట్లు గత సంవత్సరం సవరించిన అంచనా రు. 4,799 కోట్లు కంటే రు. 1,626 కోట్లు అదనం. ఐతే మొత్తం ప్రణాళికా కేటాయింపుతో పోల్చితే పెరక్కపోగా కొద్దిగా తగ్గింది.

వ్యవసాయ పరిశోధనకు రు. 1,700 కోట్లు కేటాయింపు మన బడ్జెట్ కేటాయింపులతో పోల్చితే కొంత దగ్గరగానే వున్నా ప్రస్తుతం భారతదేశంలో వ్యవసాయాన్ని కూడా ప్రొడక్టు పేటెంటు పరిమితులలోకి తెచ్చిన నేపథ్యంలో చాలా తక్కువ. ధనిక దేశాల బహుళజాతి సంస్థల పెట్టుబడులు, పరిశోధనలతో పోల్చితే మనం వెనుకబడిపోతాము. ఇప్పటికే భారత ప్రజల పెట్టుబడులతో విద్యాబుద్ధులు పొందిన అనేకులు శాస్త్రవేత్తలు ఎక్కువ సంపాదనకోసం అమెరికా వగైరా దేశాల కంపెనీలలో పనిచేస్తున్నారు.

ప్రస్తుతం భారతదేశంలో వ్యవసాయ పరిశోధన పెంచవలసిన అవసరం ఎనలేనిది. నేటికి ప్రపంచదేశాలతో పోల్చితే ఉత్పాదకతలో మనం వెనుకబడి వున్నాము. వ్యవసాయ ఖర్చులు తగ్గించేందుకు ఉత్పాదకత పెంచేందుకు తరచుగా కరువువాత పడే ప్రాంతాలలో పండే పంటలపై పరిశోధనలు చెయ్యాలి. వ్యవసాయాన్ని అభివృద్ధి చెయ్యాలి.

అంతేకాక ఈ కేటాయింపుల్లో పూలు, పండ్లు, వాణిజ్య పంటలు లాంటి వాటికే ఎక్కువ ప్రాధాన్యత ప్రకటించారు. కార్పోరేటు వ్యవసాయం, కాంట్రాక్టు వ్యవసాయాన్ని ప్రోత్సహించే లక్ష్యం ప్రధానంగా కనిపిస్తుంది. దీనివల్ల ఆహారధాన్యాల ఉత్పత్తి దెబ్బతింటుంది.

ఆర్థిక సర్వేననుసరించి 2001-02 నుండి 2004-05 మధ్య జి.డి.పి.లో వ్యవసాయరంగం వాటా 3.5 శాతం పడిపోయింది. పండ్లతోటలు, పశుపోషణ, ఫిషరీస్ లాంటి వాటా పెరిగి గత సంవత్సరం వ్యవసాయాభివృద్ధి 1.1 శాతం నమోదైనది.

ప్రపంచబ్యాంకు డైరెక్షన్ననుసరించి అమెరికా వ్యవసాయ శాస్త్రజ్ఞులు, ఐక్యరాజ్యసమితి వ్యవసాయ శాస్త్రజ్ఞులు కూడా భారతదేశం వ్యవసాయ సంక్షోభం నుంచి బయటపడాలంటే ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గించి, వాణిజ్య పంటలు పండించాలని సలహా చెప్పారు. ఆహారధాన్యాలు అమెరికా వగైరా దేశాల నుంచి దిగుమతి చేసుకోవాలని కూడా ఉచిత సలహా చెప్పారు. 100 కోట్లుకు పైగా జనాభా కలిగిన భారతదేశం ఆహారధాన్యాలకు అమెరికాపై ఆధారపడటమంటే ఇంతకంటే అధోగతి వుండదు.

మరొకవైపున సర్వేలో వ్యవసాయరంగం వెనుకబడటానికి పెట్టుబడులు తగ్గటమే కారణమని అందువల్ల పెట్టుబడులు పెంచాలంటే వ్యవసాయ సబ్సిడీలు తగ్గించాలని సిఫారసు చేశారు. ప్రస్తుతం భారతదేశ వ్యవసాయం సంక్షోభంలోకి నెట్టబడటానికి ప్రపంచబ్యాంకు తాఖీదులతో ఎరువులు వగైరాలపైన ఇప్పటికే కొంత తగ్గించిన సబ్సిడీలు ఒక ప్రధాన కారణం కాగా, మరికొంత తగ్గిస్తే రైతాంగ ఆత్మహత్యలతో దేశం అధోగతికి నెట్టబడుతుంది.

అందువల్ల ఇలాంటి ప్రమాదకరమైన సలహాలు ప్రక్కనపెట్టి వ్యవసాయరంగానికి, ఇరిగేషన్‌కు, గ్రామీణాభివృద్ధికి, విద్యుత్తుకు అవసరమైన నిధులు కేటాయించాలి. వ్యవసాయ సబ్సిడీలకు డబ్ల్యు.టి.ఒ.లో అనుమతించిన 10 శాతం వరకు పెంచాలి. ఎరువులపై సబ్సిడీ గత సంవత్సరం కేటాయించిన రు. 12,662 కోట్ల నుండి ఈ సంవత్సర బడ్జెట్‌లో రు. 17,000 కోట్లు పెంచారు. ఈ సబ్సిడీ రైతాంగం కంటే ఉత్పాదకత తక్కువగా వున్న ఫ్యాక్టరీ యజమానులకు దిగుమతులు చేసుకొనే వ్యాపారులకు అధికలాభాలకు తోడ్పడుతుంది. ఈ ప్యాక్టరీల యజమానులు సబ్సిడీలు తీసుకొంటూ కూడా ఎరువుల రేట్లు పెంచి రైతాంగాన్ని దోచేస్తున్నారు.

**మద్దతు ధరలు**

పంటలకు గిట్టుబాటయ్యే మద్దతు ధరలు నిర్ణయించి ప్రభుత్వ సంస్థలతో కొనుగోలు చేయించాలి. మద్దతు ధరలంటే పంటలకు మార్కెట్ రేట్లు పడిపోయినప్పుడు కనీసం వ్యవసాయ ఖర్చులైనా వచ్చేట్లు ప్రభుత్వం సిఫారసు చేసే ధరలు. 4 లేక 5 సంవత్సరాల కొక పర్యాయం వ్యవసాయ ఖర్చులు వచ్చే మద్దతు ధరలకు అమ్మవలసి వస్తే రైతాంగం తట్టుకోగలరు తప్ప ప్రతి సంవత్సరం మద్దతు ధరలకు పంటలమ్మవలసి వస్తే రైతాంగం ఎలా జీవిస్తారు? ఎలా తట్టుకొంటారు? అందుకే గిట్టుబాటయ్యే మద్దతు ధరలు అవసరం. పంటలు మార్కెట్లోకి వచ్చే తరుణంలో వ్యాపారులు ధరలు పడగొట్టి రైతాంగాన్ని చేసే దోపిడీ నుండి రక్షణ కావాలి. ప్రస్తుతం పత్తి, మిర్చి, కొబ్బరి, వేరుశెనగ, టమోట, ఉల్లి, పొగాకు అన్ని పంటలకు ధరలు పడగొట్టి రైతాంగాన్ని దోచేస్తున్నారు. పంటలు గిట్టుబాటు ధరలకు కొనుగోలు చేసేందుకు అవసరమైన రివాల్వింగు ఫండ్సు కేటాయించాలి. నాఫెడ్, మార్కుఫెడ్, సి.సి.ఐ, యఫ్.సి.ఐ. టుబాకోబోర్డు, కోకోనట్ బోర్డు, స్పైసెస్ బోర్డు, సివిల్ సప్లైస్ మార్కెట్లోకి మార్కెటింగ్ ప్రారంభంనుండి రావాలి.

ఈ పరిస్థితులలో ప్రభుత్వం మార్కెట్ యార్డులకు పోటీగా ప్రైవేటు మార్కెట్టు యార్డులను ప్రోత్సహించి, ప్రైవేటు వ్యాపారాన్ని ప్రోత్సహించేందుకు ప్రకటించటం అన్యాయం. మార్కెట్ యార్డుల అభివృద్ధికి ప్రకటించిన రు. 70 కోట్లు ఎందుకూ సరిపోవు.

**నీటిపారుదల, వరదనివారణ**

నీటిపారుదలకు ఈ బడ్జెట్‌లో రు. 4,800 కోట్లు కేటాయించారు. గత సంవత్సరం బడ్జెట్‌లో రు. 2,800 కోట్లు కేటాయించారు. ఈ సంవత్సరం 2.5 లక్షల ఎకరాలకు సాగునీరు కొత్తగా ఇస్తామన్నారు. వచ్చే 5 సంవత్సరాలలో 2.5 కోట్ల ఎకరాలకు సాగునీరిస్తామన్నారు. బిందుసేద్యం అభివృద్ధికి రు. 400 కోట్లు కేటాయించారు. బిందుసేద్యం ప్రస్తుతం 30 లక్షల ఎకరాలలో అమలు పర్చబడుతుందన్నారు. క్రమంగా పంచవర్ష ప్రణాళిక ముగింపు నాటికి 350 లక్షల ఎకరాలకు పెంచాలన్నారు.

అలాగే గత సంవత్సరం నిరుపయోగంగా వున్న చెరువులను బాగుచేసి తిరిగి వాడుకలోకి తెచ్చేందుకు ఒక జాతీయ స్కీం ప్రకటించారు. తద్వారా 9 రాష్ట్రాలలో 16 జిల్లాలలో 7,000 చెరువుల అభివృద్ధికి 50 వేల ఎకరాలకు సాగునీరిచ్చేందుకు ప్రకటించారు. ఇది గత బడ్జెట్ కార్యక్రమం. ప్రస్తుత బడ్జెట్‌లో అమలు పర్చేందుకు

ప్రకటించారు. ఈ కార్యక్రమానికి రు. 100 కోట్లు కేటాయించారు. దేశంలో అభివృద్ధి చెయ్యవలసిన చెరువులతో పోల్చితే ఈ ప్రకటించిన కార్యక్రమం చాలా చిన్నది.

1997-98లో సేకరించిన లెక్కల ననుసరించి భారతదేశంలో మొత్తం సాగుభూమిలో 3529.59 లక్షల ఎకరాలకు ప్రాజెక్టుల ఇరిగేషన్ క్రింద సాగు 422.34 లక్షల ఎకరాలు. మొత్తం సాగుభూమిలో 11.98 శాతం. చెరువులు, బోరులతో సహా మొత్తం ఇరిగేషన్ 1348.25 లక్షల ఎకరాలు. సాగుభూమిలో 38.26 శాతం.

ఇరిగేషన్ అభివృద్ధికి ఈ బడ్జెట్‌లో కేటాయించిన నిధుల స్థాయిలో ఐతే సాగుభూమిలో కనీసం సగభాగం ఇరిగేషన్ క్రిందకి తేవాలన్నా ఎన్ని సంవత్సరాలు పట్టేది అర్థం కాదు. ఇరిగేషన్ స్టేట్ సబ్జక్టు కావచ్చును. పండిట్ నెహ్రూ కాలంలో భాక్రానంగల్ వగైరా అంతర్రాష్ట్ర ప్రాజెక్టులు నిర్మించినట్లు ప్రస్తుతం ఇచ్చంపల్లి, గంగ, బ్రహ్మపుత్రపై మరికొన్ని ప్రాజెక్టులు నిర్మించవలసిన అవసరం వుంది. తరచు కరువువాత పడుతున్న అనేక రాష్ట్రాల ప్రజల పరిరక్షణకు ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణానికి మరికొంత నిధులు పెంచాలి. కొన్ని అంతర్రాష్ట్ర ప్రాజెక్టులు కేంద్ర ప్రభుత్వ బాధ్యతతో నిర్మించాలి.

ప్రస్తుతం ప్రకటించిన ఇరిగేషన్ విధానం పరిశీలిస్తే పెద్ద ప్రాజెక్టుల నిర్మాణానికి ఎలా తోడ్పడబోతున్నది వివరణ లేదు. చెరువుల బాగుచేత, బిందుసేద్యం గురించి వున్నది. మేజరు, మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టులు నిర్మించరాదని, మైనర్ స్కీమ్ము నిర్మించవచ్చుననే ప్రపంచబ్యాంకు ఆంక్షలు స్మృతికి తెచ్చుకొంటే వీరి ఇరిగేషన్ విధానం కూడా ఆ డైరెక్షన్‌లోనే వున్నట్లు అర్థమవుతుంది. వ్యవసాయాభివృద్ధికి ఇరిగేషన్ మౌలికాంశం. అంతేకాక ప్రస్తుతం జరుగుతున్న రైతాంగ ఆత్మహత్యలు పరిశీలించినా ఇరిగేటెడ్ ప్రాంతాలలో అత్యల్పం. మెట్ట ప్రాంతాలలో, వర్షాధార ప్రాంతాలలో అత్యధికం. అందువల్ల దేశంలో ప్రస్తుతం ఇరిగేషన్‌కు ఉపయోగించవచ్చునని నిపుణులు చెప్పే అంచనాననుసరించి దేశంలో నదీ జలాల్లో ఇప్పటికి వినియోగంలో వున్న 6261.31 టి.యం.సి. కాక మరి 18,067.62 టి.యం.సి వినియోగించే అవకాశం వుంది. తద్వారా 18 కోట్ల ఎకరాలకు సాగునీరివ్వవచ్చును. కరువులో చెరువులు, బావులు అన్నీ ఎండిపోతాయి. మేజరు ఇరిగేషన్ ప్రాజెక్టులు మాత్రమే గ్యారంటీ. బోరులు, బావుల వినియోగంవల్ల భూగర్భ జలాలు తరిగిపోతే తిరిగి నింపాలన్నా వర్షాలు తక్కువగా వుంటున్న పరిస్థితులలో మేజరు ఇరిగేషన్ ప్రాజెక్టులు ఎనలేని అవసరం. అందువల్ల మేజరు, మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణానికి దీర్ఘకాలిక ప్రణాళిక ప్రకటించాలి. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే అలాంటి ప్రణాళిక ప్రకటించారు. మైనర్ స్కీమ్ము కూడా ప్రత్యేక శ్రద్ధతో నిర్మించాలి.

**రుణపరపతి**

రైతాంగానికి రుణపరపతి మూడేళ్ళలో రెట్టింపు రు. 1,05,000 కోట్లు పెంచుతామని ఆర్థికమంత్రి గత సంవత్సరం ప్రకటించారు. 1997-98, 2001-2002 మధ్య 9వ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయ పెట్టుబడులు రు. 2,29,750 కోట్లు కావాలని ఈ రుణాన్ని సంవత్సరానికి 6 శాతం చొప్పున పెంచాలని ప్రణాళికా సంఘం వ్యవసాయరంగానికి పరపతి సహకారంపై ఏర్పరచిన వర్కింగు గ్రూప్ అంచనా. ఈ అంచనాననుసరించి ప్రస్తుతం రు. 4,15,924 కోట్లు అవసరం. లేక 3 సంవత్సరాలలో ఆర్థికమంత్రి ప్రకటించిన రుణ సదుపాయంతో పోల్చితే ఆనాటికి వ్యవసాయానికి అవసరమైన రుణం సుమారు 5 లక్షల కోట్లకు పైగా వుంటుంది. అనగా అవసరమైన రుణంలో సుమారు 25 శాతం మాత్రమే సంస్థాగతంగా సరఫరా చెయ్యబడుతుంది.

రుణపరపతి గడచిన సంవత్సరం 30 శాతం పైగా పెరిగిందని వచ్చే సంవత్సరం మరి 30 శాతం పెరుగుతుందని ప్రకటించారు. గత సంవత్సరం 58.2 లక్షల రైతులకు రుణాలు అందాయని, ఈ సంవత్సరం మరి 50 లక్షలకు అందిస్తామన్నారు. ఈ ప్రకటనలోని వాస్తవం పరిశీలిస్తే గత సంవత్సరం రుణాలు ఆంధ్రప్రదేశ్‌లో అత్యధికులకు ఎకౌంటుబుక్ ఎడ్జస్టుమెంట్స్ తప్ప వాస్తవంగా రుణాలందినవారు అత్యల్పం. ఇదే పరిస్థితి తారతమ్య భేదాలతో ఇతర రాష్ట్రాలలో కూడా అమలు పర్చబడుతుంది. రైతుల ఆత్మహత్యల నివారణకు గత సంవత్సరం ఆర్థికమంత్రి ప్రకటించిన వ్యవసాయ రుణవిమోచన పథకంలో రుణాలు రీషెడ్యూలు చేసి నూతన రుణాలిచ్చే విధానం పైన తెలిపినట్లు బుక్ ఎడ్జస్టుమెంట్సు మాత్రమే జరిగినవి. ప్రైవేటు అప్పులు తీర్చేభాగం ఒక్కరికి కూడా అమలు పర్చబడలేదు. పాత బకాయిలు సర్దుబాటు కానందువల్ల సన్నకారు, చిన్నకారు రైతులు అత్యధికులు లోన్లు పొందలేకపోయారు. వారు ప్రకటించిన పథకం పూర్తిగా అమలు జరపబడి వుంటే ప్రస్తుతం జరిగే రైతాంగ ఆత్మహత్యలు అరికట్టబడి వుండేవి. సాగుదార్లలో 3వ వంతు వుండే కౌలుదార్లకు సొంతభూమి వుండదు కాబట్టి వారు సంస్థాగత రుణాలు పొందటం లేదు. రైతాంగం సంస్థాగత రుణాలు సుమారు 10 శాతం వరకే పొందగలుగుతున్నారు. మిగిలిన 90 శాతం రుణాలకు ప్రైవేటు వడ్డీ వ్యాపారులపై వ్యవసాయ ఉత్పత్తుల, ఉపకరణాల వ్యాపారులపై ఆధారపడుతున్నారు.

గ్రామాలలో రైతాంగానికి అత్యధికులకు రుణాలిచ్చే సహకార సంఘాలు నష్టాలలో వున్న వాటిని పునరుద్ధరించేందుకు రు. 15,000 కోట్లు సహాయం కావాలని ఎన్ని కమిటీలు సిఫారసు చేసినా నేటికి ఇవ్వలేదు. ఇప్పటికే సహకార సంఘాలు అనేకం మూతపడివున్నవి. వాణిజ్య బ్యాంకులకు రు. 25,000కోట్లు సహాయపడ్డారు. పారిశ్రామిక వేత్తల నిరర్థక ఆస్తుల క్రింద రు. 1,10,000 కోట్లు రద్దు చేశారు. నేటికైనా రైతాంగంపై సవతితల్లి ప్రేమ విడనాడి దేశ ప్రజలందరికి అన్నం పెట్టే రైతాంగ రక్షణకు అవసరమైన నిధులు కేటాయించాలి.

**పంటల బీమా**

ప్రస్తుత పంటల బీమా పథకం ప్రకృతి వైపరీత్యాల నష్టాలలో రైతాంగాన్ని ఏమాత్రం ఆదుకోలేకుండా వున్నది. అవసరమైన నిధుల కేటాయింపు లేదు.

పైన తెలిపినట్లు దేశంలో వున్న మొత్తం సాగుభూమి 35 కోట్ల ఎకరాలలో ప్రాజెక్టుల క్రింద సాగు 11.98 శాతం, మొత్తం ఇరిగేషన్ 38.26 శాతం. వాస్తవాలు పరిశీలిస్తే దేశంలో ప్రతిసంవత్సరం కొన్ని ప్రాంతాలలో కరువు నెలకొంటుందని అర్థమవుతుంది. అలాగే కరువుతోపాటు తరచుగా వచ్చే తుఫానులు, వరదలు, తెగుళ్ళు వగైరా ప్రకృతి వైపరీత్యాలవల్ల ప్రతి సంవత్సరం కొన్ని ప్రాంతాలలో కొన్ని సంవత్సరాలలో అత్యధిక ప్రాంతాలలో రైతాంగం పంటలు నష్టపోతున్నారు.

గ్రీన్‌రివల్యూషన్, హైబ్రీడు రివల్యూషన్ ద్వారా వ్యవసాయ పెట్టుబడులు పెరిగిపోయాయి. మరొకవైపున ప్రపంచబ్యాంకు ప్రభావంలో వ్యవసాయ ఉపకరణాలపై సబ్సిడీలు కొంత తగ్గించటం "ఒంటెనడుం విరగటానికి చివరిగడ్డి పరకగా" పనిచేసింది. ఈ పరిస్థితులలో ప్రకృతి వైపరీత్యాలలో పంటలు నష్టపోయిన రైతాంగం అప్పులపాలై ఆత్మహత్యలు చేసుకొంటుంటే పంటలబీమా పథకం ఏ మాత్రం ఆదుకొనే స్థితిలో లేదు. కన్నీటి తుడుపు సహాయం వల్ల రైతు రక్షణ అసాధ్యం.

పంటల బీమా పథకం రైతాంగ రక్షణ లక్ష్యంతో సవరణకు ఈ బడ్జెట్‌లో ప్రయత్నం లేదు. తగిన నిధుల కేటాయింపు లేదు. ప్రస్తుత విధానంలో రైతులు పంటలకు ఎకరానికి రు. 5,000ల నుండి రు. 25,000 వరకు పెట్టుబడులు పెట్టి పంటలు నష్టపోతే కొందరు రైతులు ఏ మాత్రం నష్టపరిహారం పొందలేకుండా వుంటే కొందరు రైతులకు ఎకరానికి రు. 100 రు. 200 మాత్రమే ఇవ్వటమంటే ఎంత లోపభూయిష్టంగా వుందో అర్థమవుతుంది. ఎకరానికి రు. 1,000 పైగా పొందే రైతులు అరుదుగా వుంటారు. ఆంధ్రప్రదేశ్‌లో తరచు కరువువాత పడే అనంతపురం జిల్లా ఇందుకు ప్రతిబింబం.

అందువల్ల, సన్నకారు, చిన్నకారు రైతుల ప్రీమియం మొత్తం 8:2 నిష్పత్తిలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెల్లించాలి. నష్టపరిహారం కూడా ఇలాగే చెల్లించాలి. పంటలో 90 శాతంలోపు ఎంత నష్టపోయినా ఆ నష్టానికి నష్టపరిహారం చెల్లించాలి. మండలం ఒక యూనిట్‌గా కాక పంటనష్టపోయిన ప్రతిరైతు న్యాయమైన నష్టపరిహారం పొందకలగాలి. నష్టపరిహారం ద్వారా కనీసం పంట రుణం మొత్తం రద్దుకావాలి. ఇలా ఈ పంటల బీమా పథకం సవరించి అమలు పర్చాలి. అందుకు అవసరమైన నిధులు ఈ బడ్జెట్‌లో కేటాయించాలి.

**ముగింపు**

వ్యవసాయానికి భూమి మౌలికాంశం. అలాంటి భూమి పేదలకు పంచి గ్రామీణ పేదలకు ఉపాధి కల్పన గురించి ఈ బడ్జెట్‌లో ప్రస్తావన లేదు. విద్యుత్తు కేటాయింపులు పెంచాలి. వ్యవసాయ విస్తరణ వ్యవస్థను విస్తృత పరచాలి.

అన్నింటిని మించి ముగింపులో అర్థం చేసుకోవలసింది ఈ బడ్జెట్‌లో వ్యవసాయ రంగ కేటాయింపులు, విధానాలపై వామపక్షాల ప్రభావంకంటే ప్రపంచబ్యాంకు ప్రభావమే ఎక్కువ. భారతదేశంలో మొదటిగా ప్రపంచబ్యాంకుకు బలిపెట్టబడింది రైతాంగం, వ్యవసాయరంగం. 1991లో పి.వి. నరసింహారావు ప్రధానిగా మన్‌మోహన్‌సింగ్ ఆర్థికమంత్రిగా ఈ బలి ప్రారంభించబడింది. యన్.డి.ఎ. పాలనలో స్పీడందుకొంది. 1997లో ప్రారంభమైన రైతాంగ ఆత్మహత్యలు నేటికి ఆగకుండా జరుగుతున్నవి. 2001లో ప్రధాని వాజ్‌పాయ్ అధ్యక్షతన జరిగిన ముఖ్యమంత్రుల సమావేశం దేశంలో వ్యవసాయ సంక్షోభానికి ప్రధానకారణం సంస్కరణల అమలని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ సంక్షోభనివారణకు సంస్కరణలు స్పీడుగా అమలు పర్చాలని కూడా తీర్మానించారు.

ప్రస్తుతం ప్రధాని మన్‌మోహన్‌సింగ్ స్పీడుగా సంస్కరణలు అమలు పర్చిన యన్.డి.ఎ.ను గడిచిన ఎన్నికలలో ప్రజలు తిరస్కరించటం పరిగణలో వుంచుకొని సంస్కరణలు మానవముఖంతో అమలు పర్చుతామని ప్రకటించారు. ఐనా వీరు కూడా అమలు పర్చేది ప్రపంచబ్యాంకు తాఖీదులే కాబట్టి పులికి మానవముఖం తగిలించినా మానవులను కబళించటం మానదు.

డబ్ల్యు.టి.ఒ. నిబంధలననుసరించి గతంలో కంటే ప్రమాదకరమైన ప్రొడక్టు పేటెంటు 2005 జనవరి 1 నుండి అమలు ప్రారంభించారు. అందువల్ల ప్రధాని మాటలు ఎలా వున్నా ఆచరణ గతంకంటే ప్రమాదానికి దారితీస్తుంది. ప్రపంచబ్యాంకు విధానాలు అమలు పర్చే లక్ష్యంతో ఈ ప్రమాదాన్ని నివారించటం అసాధ్యం.

**(మిగతా 17వ పేజీలో)**

# బడ్జెట్ 2005-06

- వి. శ్రీహరి

బడ్జెట్ అంటే ఒకనాడు భయం వుండేది. ఉత్కంఠత పెంచేది. ఎకనమిక్ సర్వే అంటే దేశ ఆర్థిక స్థితిగతులను నేరుగా, శాస్త్రీయంగా తెలియచేసే పత్రంగా వుండేది. అదంతా ఇప్పుడు.. "అనగా, అనగా" అని పూర్వీకులు చెప్పుకునే కథల మొదటి మాటను తలపిస్తున్నది. ఆనాటి ఆ ఉత్కంఠతకు కారణం దేశం ఏకొత్త విధానాలను భరించాల్సి వస్తుందోనని. ఏ భారాలు కరవబోతున్నాయోనని గుండెలు లబలబలాడుతుండేవి.

ఈ ఉత్కంఠత, భయం దేశ రాజకీయ విధానంలో అంతర్భాగం. స్వంతకాళ్లు లేని పెట్టుబడిదారీ విధానాన్ని పరుగులు తీయించాలనే పాలకుల అసలు కోరిక. కాని ఎన్నికల్లో ఓటు వెయ్యాల్సిన పేదలు వారు బాగుపడాలని, కనీసం వారి జీవిత పరిస్థితులు దిగజారరాదని కోరేవారు. దానికి తోడు గ్రామీణ "దాయాదులు" ఏ చిన్న భారం మోసేందుకు సిద్ధంకాక పోవడం. తమ కోరికలకు అనువుగా బడ్జెట్ రూపొందాలి. పేదలకోసం రూపొందినట్లు కనపడాలి. స్వతంత్ర భారతంలో మొదటి 40 సంవత్సరాల కసరత్ అదే.

మాటల్లో చెప్పాల్సిన "సోషలిస్టు తరహా" సమాజాల నిర్మాణం, ఇవ్వాల్సిన "గరీబీహఠావో" నినాదాలు, మొదటి 20 పెద్ద కుటుంబాల ఆస్తులు పెంచే చర్యలకోసం చేపట్టే చర్యల మధ్య ఘర్షణ ఆనాటి ఆర్థిక విధానాల ఘర్షణ. అవే బడ్జెట్ కల్పనలో దర్శన మిచ్చేవి. స్వంత వనరుల సేకరణకు పరిమితులు. విదేశాల అప్పుల అనిశ్చితితో నోట్ల ముద్రణే శరణ్యమైంది. వనరుల సేకరణలో వైఫల్యం పేదలకు, అనివార్యమై చేసే, కేటాయింపులలో కోతగాను, ద్రవ్యోల్బణంతో దోచడంగానో చరిత్ర నడిచింది.

ఈ చరిత్రను ఒక్క వాక్యంలో చెప్పాలంటే

"దేశ సంపద పెరగడం-ప్రభుత్వాల భాగం తగ్గడం" గా వర్ణించవచ్చు. ఈ చరిత్రలోని ఈ వక్రపు ఫలితంగా స్వతంత్ర భారతం అభివృద్ధి అంతా "దైవానుగ్రహం" గా మారింది. ఏ ప్రణాళిక, ఏ సంవత్సరమూ ఒక రంగానికి, మరొక రంగానికి పరస్పరాశ్రయత, కలసిసాగడం పోయింది. దాంతో బడ్జెట్, వివిధ పరిశ్రమల మార్కెట్ అవసరాలను తీర్చే పన్నుల ప్రతిపాదనల జాబితాగా కుదింపబడింది. వినిమయదారు చెల్లించే ధరలో ప్రభుత్వం ఎక్సైజ్, అమ్మకం వంటి పన్నులు ఒక ప్రధాన భాగంగా నిలిచేవిగనుక.

ఈ కథంతా ఎందుకు గుర్తు చేసుకోవలసివస్తోంది? ఈనాడు బడ్జెట్ రూపకల్పన ఆర్థికమంత్రి చిత్తం కాదు. దేశ అవసరాలూ కాదు. ప్రపంచబ్యాంకు అంకెల్లో ఆదేశాలు ఇస్తుంది. బడ్జెట్‌లో రెవెన్యూలోటు ఎంత వుండచ్చు? మొత్తం లోటు ఏ శాతంలో వుండాలో గీతలు గీసి, ఆ గీతల్లో నడిస్తేనే "డాలర్"లు కురుస్తాయి. ఆ వాన కురిస్తేనే దేశం పచ్చబడుతుందని భారత రాజకీయ వేత్తలను, అధికార గణాన్ని, కలంపట్టి ఒప్పించగల లాయర్ల వంటి మేధావులను "విద్యావంతుల"ను చేసింది. అది దేశీయ నిర్ణయంగా కనిపింపజేసేందుకు మనపార్లమెంటులోని రెండు పెద్ద పార్టీలను కలిపి చట్టం చేయించారు.

ఈ ఏటి చిదంబరం గారు ప్రవేశపెట్టిన బడ్జెట్ చూస్తే భయమూ లేదు. ఉత్కంఠతా కలగలేదు. చిన్నప్పుడు విన్న కథలు గుర్తొచ్చాయి. చిదంబరం దేవాలయంలో అనుకుంటాను ఏదో తెలియరాని రహస్యం వుండేదట! ఆత్మజ్ఞానం వుంటే తప్ప అదేమిటో అర్థం కాదనే వారు. అర్థంకాని విషయాన్ని "ఇదేదో చిదంబర రహస్యంగా వుందిరా" అనడం, వినడం చాల సహజంగా, సంభాషణలలో దొర్లేవి.

చిదంబరంగారి బడ్జెట్ సాదా, సీదా మనుషులకు "చిదంబర రహస్యం" అని అనుకున్నాను. తనలాంటి మేధావులకూ అది "చిదంబర రహస్య" మేనని సుబ్రమణ్యస్వామి రాస్తున్నారు. ఆయన ఒకనాటి కేంద్రమంత్రి.

చిదంబరం బడ్జెట్ అంతా పన్నుల రాయితీల మయం. కార్పోరేట్ పన్ను తగ్గించారు. అనేక వస్తువుల మీద దిగుమతి సుంకాలు తగ్గించారు. ఎక్సైజ్ పన్నులు తగ్గించారు. పరోక్ష పన్నుల ప్రతిపాదనలు ఆదాయ, వ్యయాలలో ఎలాంటి ప్రభావం కలిగించవని చెప్పారు. ప్రత్యక్ష పన్నుల మార్పులతో మరొక 6 వేలకోట్లు అదనపు ఆదాయం వస్తుందన్నారు. కాని ఆదాయపు పన్ను 30 శాతం, కార్పోరేట్ పన్నులు 33 శాతం, ఎక్సైజ్ డ్యూటీలలో 21 శాతం పెరుగుదల వుంటుందన్నారు.

ఈ ఏడాది ప్రణాళికకు స్థూల బడ్జెట్ కేటాయింపు 16.9 శాతం (గత బడ్జెట్ అంచనా మీద), కేంద్ర ప్రణాళికకు 25.6 శాతం మద్దత్తు వుంటుందని ప్రకటించారు. ఇందుకు ఆధారం మొత్తం కేంద్ర ప్రభుత్వ ఆదాయంలో 21 శాతం వృద్ధి వుంటుందనే అంచనా.

కాని వాస్తవం ఏమిటి? ఈ సంవత్సరం స్థూల జాతీయోత్పత్తి 6.9 శాతం పెరుగుతుందని అంచనా. ద్రవ్యోల్బణం 5 శాతం వుంటుందని

అంచనా వేద్దాం. పెరిగిన 15 శాతం, ఏదో ఒక రూపంలో ప్రభుత్వ వనరులను అదే శాతంలో పెంచుతుందను కుందాం. కాని 21 శాతం వనరులు పెరుగుతాయని ఆర్థికమంత్రి అంచనాకు ఆధారమేమిటి? కేంద్ర ప్రభుత్వానికి రావలసిన పన్నుల బకాయిలు లక్షల కోట్లు వుంది. వాటిని పట్టుదలగా వసూలు చేస్తామని గత సంవత్సరం చేసిన వాగ్దానం వంటిది గూడ ఈసారి బడ్జెట్ ఉపన్యాసంలో లేదు. అంతటి శపథం పట్టిన బడ్జెట్ అంచనాలే తప్పాయి. గత సంవత్సరం రు. 11,000 కోట్ల పన్ను ఆదాయం తగ్గింది. గాలిలో దీపంలా ఎలాంటి ఆధారం లేని 21 శాతం వనరుల పెరుగుదల సమకూరకపోతే బడ్జెట్‌లో ఏ కేటాయింపులు కోతపడతాయి?

రెవెన్యూ ఖర్చులో ఉద్యోగుల జీతాలు తగ్గించలేరు.

సైనిక వ్యయపు అంచనాలు పెరిగాయి. కేటాయింపూ పెరిగింది. వడ్డీ ఖర్చు తగ్గించుకునే క్రమంలో గతంలో డిపాజిట్ రేట్లను తగ్గించి, సాధారణ డిపాజిటర్ల జేబులు కొట్టారు. కార్మికవర్గ ప్రతిఘటన, ఆర్థిక వ్యవస్థలో డబ్బు లభ్యత పెరిగి ద్రవ్యోల్బణం తిరిగి తలెత్తే ప్రమాదం ముంచుకొస్తున్నది. వడ్డీరేట్లు తగ్గించే అవకాశం లేదు. కోత విధించగలవి పెట్టుబడి ఖాతాఖర్చులు, సామాజిక శ్రేయస్సుకు జరిగే కేటాయింపులే.

1991 నుండి ఎన్.డి.ఏ. చివరి బడ్జెట్ వరకు ఆర్థిక విధానాలకూ, దేశ రాజకీయాలకు మధ్య దూరం పెరిగింది. పి.వి. నరసింహారావు ప్రభుత్వం, చావు తప్పి కన్ను లొట్టబోయి అధికారానికి వచ్చింది. ఎన్నికల నాడు చెప్పకుండా హఠాత్తుగా దేశ ప్రజల నెత్తిన కొత్త ఆర్థిక విధానం రుద్దింది. ఆ విధానాలను వ్యతిరేకిస్తామని "స్వదేశీ" నినాదంతో గెలిచిన ఎన్.డి.ఏ. వాగ్దానాలు మరచి పాత విధానాలకు మరింత పదను పెట్టింది. "భారత్ వెలిగిపోతోంది" అని నమ్మించ చూచి శృంగ భంగం చెందింది. ప్రభుత్వపు నడక ఎలావుండాలో ప్రజలు చెప్పడం ప్రారంభించారు. అంతవరకే అయితే కాంగీ మాటలూ నిలిచేవికాదు. ఓటర్లే కాక ప్రభుత్వంలో, బయట వుండే కొన్ని పార్టీలు "అంకుశాలు" గా తయారు కావడం ఈనాటి రాజకీయాలలో విశేషం.

మాటకు-చేతకు కొంతైనా సంబంధం వుండక తప్పని పరిస్థితి. ఆ స్థితిలో రూపొందిన బడ్జెటే ఇది. మనసు-బుద్ధి ప్రపంచ విధానాలకు అంకితమైన ప్రధాని, ఆర్థికమంత్రి, ప్రణాళికా సంఘం అధ్యక్షుడు ప్రభుత్వ మనుగడను నిర్ణయించే విరుద్ధ శక్తులూ. ఈ రెండు పడవల ప్రయాణమే ఈ బడ్జెట్.

ప్రజలకు కనీస ఉమ్మడి కార్యక్రమంలో వాగ్దానాలు. దేశంలో ఈ నాటికే అత్యధిక ప్రజలకు జీవనాధారమైన వ్యవసాయం. ఆ వ్యవసాయరంగమే సంస్కరణలకు బలిపశువు అయింది. ప్రభుత్వ వ్యయం ఎంతో పెరిగితే తప్ప అది బాగుపడే యోగం లేదు. కనీస ఉమ్మడి కార్యక్రమం ఉపాధి గ్యారంటీ వాగ్దానం చేసింది. దేశంలో ఉపాధి కోరే ప్రతి ఇంటికీ ఒక ఉద్యోగం, కనీస వేతనం గ్యారంటీ చేస్తామనేది మాట. 150 జిల్లాలకు పరిమితం చేసింది ఆచరణ. అందుకు నిధులు పెంచారు. అదే చేత్తో ఇతర జిల్లాల్లో ఉపాధి కార్యక్రమాలకు రు. 900 కోట్లు కోత విధించారు. వ్యవసాయంలో దెబ్బతింటున్నది, ప్రమాద ఘంటికలను మోగిస్తున్నదీ ఆహార ధాన్యాల ఉత్పత్తి. కాని పూలు, పండ్లు పెంచి విదేశాలకు పంపడం పై చిదంబరం కేంద్రీకరణ. విద్య, ఆరోగ్యాలకు కేటాయింపులకు, కనీస ఉమ్మడి కార్యక్రమ వాగ్దానాలకు సంబంధం లేదు. పెంచిన మొత్తాలు అతి తక్కువ. గతంలో జరిగిన నష్టాలను రిపేరు చేసేందుకైనా చాలవు ఆ మొత్తాలు.

రాజకీయ అవసరాలకోసం పెరిగిన ఈ రంగాల కేటాయింపులు చాలినంత లేవు అనడం ఒక అంశం. పెరిగిన కొద్దిపాటి కేటాయింపుల నైనా నిజంగా ఖర్చు పెట్టించుకోడం మరొక అంశం. ఎందువల్లనంటే అంచనాల ననుసరించి 21 శాతం వనరులు సమీకరణలో పెరుగుదల లేకుంటే వ్యయం కోత తప్పదు. ఆ వ్యయం కోతకు ఈ రంగాలే బలికాకా తప్పదు. కేటాయింపులు పెంచుకున్న రాజకీయ వత్తిడి, అనుకున్న మొత్తాలు వ్యయం అయ్యేలా చూడడానికీ అవసరం.

ఉమ్మడి కార్యక్రమ వాగ్దానాలకు, బడ్జెట్‌కు సంబంధం లేకపోవడం ఈ బడ్జెట్‌కు ఒకముఖం. బడ్జెట్ వాగ్దానాలకు, కేటాయింపుల అంకెలకు సంబంధం లేకపోవడం మరొక ముఖం.

ఉపాధి కల్పనకు డబ్బు భాగం మాత్రం బడ్జెట్‌లో కేటాయించారు. ఆహార ధాన్యాల కేటాయింపు ఫుడ్ కార్పోరేషన్ నెత్తిన పెట్టారు. ఆ వ్యయం ఆ సంస్థకు సబ్సిడీగా ఇవ్వరు. బడ్జెట్‌లో అందుకు కేటాయింపు లేదు. ఈ తిరకాసుతో ఆ సంస్థ మూసివేతకు, ప్రభుత్వ పంపిణీ వ్యవస్థకు మంగళం పాడేందుకు మొదటి అడుగు ఈ బడ్జెట్. ఇది మార్కెట్ కోసం పండించే రైతుకు, మార్కెట్ బారి నుండి తప్పించుకుందామనుకునే పేద వినిమయదారుకూ కూడ పెట్టిన చిదంబర నామం.

రోడ్లు, నైక్రాశయాలు, విమానాశ్రయాలు అభివృద్ధికి "బ్రిడ్జి" నిధిగా రు. 10 వేలకోట్లు ఖర్చు పెట్టబోతున్నట్లు బడ్జెట్ చెపుతుంది. అది కేటాయింపుల్లో కనపడదు. ఆ డబ్బు సమీకరణ బడ్జెట్‌తో

సంబంధం లేని మరొక మార్గం ద్వారా సమీకరిస్తారట.

ప్రణాళికా వ్యయం, కేంద్రం వాటా పెరిగినట్లు బడ్జెట్ ఉపన్యాసం. పెరిగిన వ్యయం అంతా బడ్జెట్ కేటాయింపుల అంకెల్లో లేదు. రాష్ట్ర ప్రభుత్వాలు మార్కెట్ అప్పులతో రు. 29003 కోట్లు సమీకరించు కుంటాయని సముదాయింపు. ఎన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఆ పని జయప్రదంగా చేయగలవనేది సందేహాస్పదం. అప్పులు తెచ్చి, రాష్ట్రాలకు ఇచ్చే బాధ్యత ఆనవాయితీగా, కేంద్రం భరించేది. ఆ బాధ్యత వదిలేసి కృంగిపోతున్న రాష్ట్రాల ఆర్థిక పరిస్థితిపై మరింత బరువు మోపారు.

ఇదంతా ఎందుకు చేస్తున్నారు? స్థూల జాతీయాదాయంలో కేటాయించిన శాతం మించి బడ్జెట్ లోటు వుండరాదని ప్రపంచ బ్యాంకు ఒక లక్ష్మణరేఖ గీచింది. వారిమాట ఎందువల్ల సుగ్రీవాజ్ఞ ఔతోంది. పెట్టుబడులకు ఈ దేశం ''సురక్షితం'' అని ప్రపంచబ్యాంకు సర్టిఫికేట్ ఇస్తేనే డాలర్లు వస్తాయి. డాలరే మన ఊపిరనే ఆర్థిక వేదాంతం ఇందుకు మూలం.

ఈ వేదాంతంతోనే, ఆ డాలర్లు సంపాదించేందుకే ఎక్సైజ్ సుంకాల తగ్గింపు. వ్యవసాయ ఎగుమతుల పెరుగుదలకు ప్రతిపాదనలు. చేనేత కార్మికులను ముంచే జౌళి పరిశోధన, ఎగుమతి ప్రోత్సాహకాలు. అందుకోసమే గతంలో చిన్న పరిశ్రమలకు రిజర్వు చేసిన వస్తువుల తగ్గింపు. అందుకోసమే బడ్జెట్ అంకెల గారడీ.

అన్ని అభిప్రాయాలను తృప్తి పరచిన, వ్యవసాయానికి పెద్దపీట వేసిన "గ్రీన్" బడ్జెట్ గా పత్రికలు వ్యాఖ్యానించాయి.

కాని ఈ బడ్జెట్ ఫలితం వెంటనే కనపడింది ఎక్కడ?

బడ్జెట్ ఫిబ్రవరి 28న ప్రవేశపెట్టారు. కార్పోరేట్ పన్ను తగ్గించినా అభినందించని పారిశ్రామిక రంగాన్ని చూచి బాధపడినట్లుంది ఆర్థికమంత్రి. మార్చి నాలగవ తేది తన బడ్జెట్ ప్రభావం గురించి ఆయనే చెప్పుకున్నారు.

"బడ్జెట్ ప్రవేశపెట్టిన నాటినుండి రు. 72,095 కోట్లు మీ సంపద పెరిగింది. ఈ ఒక్క రోజు రు. 16,857 కోట్లు స్టాక్ మార్కెట్లో లాభపడ్డారు అభినందనలు" అంటూ తనను తాను అభినందించుకున్నారు చిదంబరం.

అసలు రహస్యం అదీ. చేలో పంటా, ఫ్యాక్టరీలో ఉత్పత్తి పెరగదు ఈ బడ్జెట్‌తో. కుప్పకూలే లోపు స్టాక్ మార్కెట్ చాణిక్యులు సంపన్నులు కావడమే ఈ బడ్జెట్ సారాంశం.

ఇక జనం సంగతా, దేవుడు కరునించి, సకాలంలో వర్షాలు కురిపిస్తే!!

*

(14వ పేజీ తరువాయి)

ఇలాంటి ప్రమాదాన్ని నివారించాలంటే సంస్కరణలలో ప్రపంచబ్యాంకు విధానాలలో మన రైతాంగానికి స్వావలంబనకు ప్రమాదకరమైన వాటిని నిరోధించటం కోసం నిబద్ధత వుండాలి. అది ఈ పాలకులలో కనిపించటం లేదు.

అంతేకాక రాజ్యసభలో ప్రవేశపెట్టిన విత్తనబిల్లులో నకిలి విత్తనాల ప్రమాదం నుండి రైతాంగం రక్షణకు తగిన క్లాజులేదు. ఏ పంటకు గిట్టుబాటు ధర లేకపోవటమే కాక కేంద్ర వ్యవసాయమంత్రి శరద్‌పవర్ గత అనేక సంవత్సరాలుగా చెరుకు రైతులు పొందే రేటు తగ్గించే విధానం ప్రకటించారు. చెరుకు రేటు రికవరి లెక్క 8.5 శాతం నుండి 9 శాతానికి పెంచారు. షేక్ పిరియడ్ రికవరి లెక్క సగటు రికవరికి మార్చారు. 1 లక్ష టన్నుల ముడి పంచదార దిగుమతికి అనుమతించారు. తద్వారా చెరుకు రైతులకు గతంలో పొందుతున్న రేటు కూడా తగ్గిపోతుంది.

మరొకవైపు భారతదేశంలో దిగుమతి ఆంక్షలు 2001లోనే తొలగించబడినవి. దిగుమతి సుంకాలు తగ్గించబడినవి. అమెరికా వగైరా దేశాలలో వ్యవసాయ సబ్సిడీలు పెరగటం వల్ల వారి వ్యవసాయ ఉత్పత్తులు తక్కువ ధరలకు ఎగుమతి చేసే ప్రమాదం పెరిగింది. ఈ నేపథ్యంలో 1993 నాటికి స్వయం సమృద్ధి సాధించిన పంటనూనెల దిగుమతి ప్రస్తుతం రు. 15,000 కోట్ల విలువ వరకు పెరిగింది. ఇతర వ్యవసాయ ఉత్పత్తుల దిగుమతులు కూడా పెరుగుతున్నవి. మన దిగుమతులలో వంటనూనెలు 71 శాతం కాగా పప్పులు 13.7 శాతం. పండ్లు తదితరాలు 6.5 శాతం. వ్యవసాయ సంక్షోభం పెరిగే ప్రమాదమే ఎక్కువ. పెరిగే సంక్షోభం నుండి వ్యవసాయాన్ని రైతాంగాన్ని రక్షించకలిగిన ప్రతిపాదనలు ఈ బడ్జెట్‌లో లేవు.

ఐతే ప్రభుత్వరంగ సంస్థల అమ్మకాలు ఆపటం, నష్టాలలో వున్న వాటి పునరుద్ధరణకు ప్రయత్నించటం దేశ స్వావలంబనకు సానుకూల అంశాలు. అన్నింటిని మించి ప్రస్తుత పాలకులు సెక్యులరిజానికి కట్టుబడి వున్నారు. అలీన విదేశాంగ విధానానికి కట్టుబడి వున్నారు. అందువల్ల ఈ ప్రభుత్వాన్ని బలపర్చటం రాజకీయంగా వామపక్ష ప్రజాతంత్ర శక్తులకు అవసరం. అనివార్యం.

అలాగని ప్రపంచబ్యాంకు వ్యవసాయ వ్యతిరేక, స్వావలంబన వ్యతిరేక విధానాలకు రైతాంగాన్ని, దేశాన్ని బలిపెట్టలేము. కాబట్టి ప్రజలను చైతన్యవంతులను చెయ్యాలి. ప్రజాపోరాటాలు ఉద్యమాలు నిర్వహించాలి. ప్రజాపోరాటాల ద్వారా రైతాంగాన్ని, ప్రజలను రక్షించుకోవాలి.

*

# నీరు కారుతున్న రాష్ట్ర బడ్జెట్ 2005-06

- అపర్ణ

బడ్జెట్ అనేది ఒక ఆర్థిక ప్రక్రియ. ఇది కేవలం ఆదాయ, వ్యయ పట్టికో, కేటాయింపుల పట్టికో మాత్రమే కాదు. వర్ధమాన దేశాల్లో సామాజిక ఆర్థికాభ్యున్నతిని సాధించడానికి, సమతుల్యమైన ప్రగతిని అందుకోవడానికి బడ్జెట్‌లు ఉపకరణాలుగా దోహద పడతాయని ఆర్థిక శాస్త్రవేత్తలు చెబుతూ వుంటారు. ప్రాంతీయ అసమానతలను రూపుమాపేందుకు, అన్ని విధాలుగా మానవ అభివృద్ధి సూచికను సమున్నత దశకు చేర్చేందుకు కూడ బడ్జెట్‌లు ఉపయోగపడతాయని నిపుణుల అంచనా. ప్రతి సంవత్సరం రాష్ట్ర శాసనసభకు బడ్జెట్‌ను సమర్పించడం ఆనవాయితీ. ఈ సందర్భంలోనే రాష్ట్ర ప్రగతికి దోహదపడే విధంగా ప్రాధాన్యతలు నిర్ణయిస్తారు. వీటికి అనుగుణంగా బడ్జెట్ కేటాయింపులను సమకూర్చి రాష్ట్రంలో వున్న అధికార పార్టీ తాము ప్రజలకు ఎన్నికల సమయంలో చేసిన వాగ్దానాలను నిలబెట్టుకునేందుకు కృషి చేయటం పరిపాటి. కాని అధికారం చేజిక్కినాక క్రమక్రమేణా వాగ్దానాలను తృణీకరించటం గూడ జరుగుతూ వుంటుంది.

ఇక అసలు విషయానికి వస్తే డా. వై.యస్. రాజశేఖరరెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టిన నాటినుండి రాష్ట్ర సమగ్రాభివృద్ధికి విశేష కృషి జరుపుతామని రాష్ట్రాన్ని "హరితాంధ్రప్రదేశ్" గా రూపుదిద్దుతామని పదేపదే చాటి చెప్పటం, పల్లెసీమల అభివృద్ధికి "రాజీవ్‌పల్లెబాట", నగరాభివృద్ధికి "రాజీవ్‌నగరబాట" కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. రాష్ట్రంలో పెండింగ్‌లో వున్న నీటిపారుదల ప్రాజెక్టులను రానున్న 5 సంవత్సరాల కాలంలో రు. 46 వేలకోట్లు వెచ్చించి పూర్తి చేస్తామని కూడ చాటి చెప్పతూ ఈ దశలోనే 18 ఫిబ్రవరి 2005న రాష్ట్ర ఆర్థికామాత్యులు కొణిజేటి రోశయ్య 2005-06 సంవత్సరానికి సంబంధించి పూర్తిస్థాయి బడ్జెట్‌ను రాష్ట్ర శాసనసభకు సమర్పించడం జరిగింది.

**రెవెన్యూ రాబడి**

రాష్ట్ర రెవెన్యూ రాబడులు రెండు రకాలు. అవి కేంద్రం నుండి బదలాయింపబడిన వనరులు రాష్ట్ర సొంతవనరులు. కేంద్రం నుండి లభించే వనరులు రెండు రకాలు. అవి కేంద్రం వసూలు చేసే పన్నులలో వాటా, సహాయానుదానం అనగా గ్రాంట్లు. రాష్ట్ర సొంతవనరులు గూడ రెండు రకాలు. అవి సొంత పన్నుల ద్వారా రాబడి, పన్నేతర రాబడి.

రాష్ట్రానికి కేంద్రం ద్వారా బదలాయింపబడే వనరులు మొత్తం మీద 1995-96 సంవత్సరంలో రు. 4,148.98 కోట్లు వుండగా (1997-98, 2002-03 సంవత్సరంలో మినహా) క్రమక్రమంగా పెరిగి 2005-06 బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 11,92.26 కోట్లుకు పెరుగుతాయని అంచనా. మొత్తం రాష్ట్ర రెవెన్యూ రాబడులలో కేంద్రం నుండి బదలాయింప బడిన వనరులు 1995-96 సంవత్సరంలో 42 శాతం వుండగా క్రమక్రమేణా 2002-03 సంవత్సరంలో 29.8 శాతానికి పడిపోయింది. అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం కేంద్రంలో వున్న ఎన్.డి.ఏ. ప్రభుత్వ మనుగడకు ఆక్సిజన్‌లాగా వుపయోగపడ్డా 2005-06 సంవత్సరం బడ్జెట్ అంచనాల ప్రకారం గూడ పెద్దగా పెరుగుదల కానరావటంలేదు. మొత్తం రాబడితో పోలిస్తే రాష్ట్రానికి కేంద్రం నుండి బదలాయించబడిన మొత్తం వనరులలో రాష్ట్రానికి లభించిన కేంద్ర పన్నుల వాటా 1995-96 సంవత్సరంలో 61.8 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం 57.7 శాతానికి పడిపోతున్నాయి. కాగా సహాయానుదానం వాటా 1995-96 సంవత్సరంలో మొత్తం కేంద్రం నుండి బదలాయించిన వనరులలో 38.2 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో 42.3 శాతానికి పెరుగుతుందని అంచనా.

రాష్ట్రానికి సొంతవనరుల ద్వారా లభించే మొత్తం రాబడి 1995-96 సంవత్సరంలో రు. 5,725.91 కోట్లు వుండగా క్రమక్రమేణా పెరుగుతూ 2005-06 సంవత్సరం బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 24,384.27 కోట్లకు పెరుగుతుందని అంచనా. మొత్తం రెవెన్యూ రాబడిలో సొంతవనరుల ద్వారా లభించే రాబడి 1995-96 సంవత్సరంలో 58 శాతం వుండగా 2002-03 సంవత్సరంలో 70.2 శాతానికి పెరగడం అంటే ప్రజలమీద రాష్ట్ర ప్రభుత్వం పన్నుభారం మోపినట్లుగా కానవస్తోంది. 2003-04 సంవత్సరంలో మొత్తం రెవెన్యూ రాబడిలో సొంత వనరులవాటా 64.8 శాతానికి తగ్గినా 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం 67.8 శాతానికి

పెరుగుతుందని అంచనా. సొంత పన్నుల ద్వారా రాబడి మొత్తం రాష్ట్ర సొంతవనరుల ద్వారా లభించిన రాబడిలో 1995-96 సంవత్సరంలో 72 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో 81.9 శాతం వాటాకు పెరిగింది కాని పన్నేతర రాబడి వాటా 1995-96 సంవత్సరంలో 28 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో 18 శాతానికి పడిపోతుందని అంచనా. అదనపు పన్ను ద్వారా రాష్ట్రానికి లభించిన రాబడి మొత్తం సొంత పన్నుల ద్వారా లభించిన రాబడిలో 71.7 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో 68.8 శాతానికి పడిపోతుందని అంచనా. కాగా అబ్కారీ ద్వారా లభించిన రాబడి సొంత రాబడుల్లో 1995-96 సంవత్సరంలో 1.8 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం 14.2 శాతానికి పెరుగుతుందని అంచనా. అనగా రాష్ట్ర మద్యాంధ్రప్రదేశ్‌గా మారబోతున్నట్లుగా గోచరిస్తోంది. వాహనాల ద్వారా లభించే పన్నురాబడి మొత్తం సొంత రాబడిలో 1995-96 సంవత్సరంలో 11.1 శాతం వాటా వుండగా 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం 8 శాతానికి తగ్గిపోతోంది.

పెట్టుబడి వసూళ్ళ ద్వారా రాబడి 1995-96 సంవత్సరంలో మొత్తం రాష్ట్రరాబడిలో 37.8 శాతం వాటా వుండగా 2005-06 సంవత్సరంలో 35 శాతానికి తగ్గిపోతోంది.

రాష్ట్రంలో ప్రజావ్యయం రెండు రకాలు. ఒకటి అభివృద్ధి వ్యయం, రెండవది అభివృద్ధేతర వ్యయం. అభివృద్ధి వ్యయం మొత్తం రాష్ట్ర ప్రజావ్యయంలో 1995-96 సంవత్సరంలో 71 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం 65.1 శాతం వాటాకు తగ్గిపోతోంది. అనగా అభివృద్ధి కుంటు పడుతున్నట్లుగా గోచరిస్తోంది. అభివృద్ధేతర వ్యయం మొత్తం ప్రజా వ్యయంలో 1995-96 సంవత్సరంలో 29 శాతం వుండగా 2005-06 సంవత్సరంలో 34.9 శాతం వాటాకు పెరుగుతుందని అంచనా. రాష్ట్రంలో అనుకొన్న అభివృద్ధి సాధించాలంటే అభివృద్ధేతర వ్యయాన్ని తగ్గించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

**మిగిలివున్న ప్రజారుణం:**

భారత రాజ్యాంగం ప్రకారం రాష్ట్ర సంచితనిధి హామీగా రాష్ట్ర ప్రభుత్వం దేశంలో అంతర్గతంగా రుణాలు పొందే సదుపాయం వుంది. దీనికి సంబంధించిన గరిష్ట పరిమితులను శాసనసభ ఎప్పటికప్పుడు చట్టాల ద్వారా విధించవచ్చు. ఐతే అటువంటి పరిమితుల్ని విధించే చట్టాన్ని శాసనసభ ఇంతవరకు చేయలేదు. ప్రజా రుణం నాలుగు రకాలు. అవి బహిరంగ మార్కెటు రుణాలు, కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు, స్వయం పాలక సంస్థల నుండి రుణాలు, ప్రత్యేక సెక్యూరిటీలు. రాష్ట్రంలో 1995-96 సంవత్సరంలో మిగిలివున్న ప్రజా రుణం రు. 15,164.25 కోట్లు. దీనిలో కేంద్రం నుండి రుణాలు సింహభాగంగా వుంది. ఇంతింతై, అతింతై, వటుడింతై అన్నట్లు 2005-06 సంవత్సరంలో బడ్జెట్ అంచనాల ప్రకారం మిగిలివున్న ప్రజారుణం రు. 76,519.70 కోట్లుకు పెరుగుతుందని అంచనా. దీనిలో ప్రత్యేక సెక్యూరిటీల ద్వారా సేకరించిన రుణం 30.4 శాతం వుండగా బహిరంగ మార్కెటు ఋణాలు 29.7 శాతం వున్నాయి. కాగా తలసరి రుణభారం 1995-96 సంవత్సరంలో రు. 2,115 వుండగా 2005-06 సంవత్సరంలో రు. 9,565కు పెరుగుతోంది. అనగా క్రమక్రమంగా అప్పుల ఊబిలో కూరుకుపోతున్నట్లుగా కానవస్తోంది. అనగా మనం అప్పుచేసి పప్పుకూడు తింటున్నట్లుగా కానవస్తోంది.

**ప్రణాళిక-ప్రణాళికేతర కేటాయింపులు:**

2005-06 సంవత్సరంలో వివిధ రంగాలకు మొత్తం మీద రు. 55,331.30 కోట్లు కేటాయింపులు వుండగా దీనిలో ప్రణాళిక కేటాయింపులు రు. 17,691.59 కోట్లు (32 శాతం), కాగా ప్రణాళికేతర కేటాయింపులు రు. 37,639.71 కోట్లు (68 శాతం). ప్రణాళికేతర కేటాయింపులు సాధారణ సర్వీసులకు 65.71 శాతం కేటాయించగా సాంఘిక సర్వీసులకు 19.60 శాతం, ఆర్థిక సర్వీసులకు 14.69 శాతం కేటాయించడం జరిగింది. ప్రణాళికా కేటాయింపులో ఆర్థిక సర్వీసులకు 66.93 శాతం కేటాయించగా సాంఘిక సర్వీసులకు 32.54 శాతం కేటాయించడం జరిగింది. మొత్తం ప్రణాళికా కేటాయింపులో నీటిపారుదల-వరద నివారణ రంగానికి 36.03 శాతం కేటాయించటం గమనార్హం అయినా మొత్తం కేటాయింపులో (ప్రణాళిక-ప్రణాళికేతర కేటాయింపులు కలిపి) నీటిపారుదల-వరద నివారణకు 15.53 శాతమే కేటాయించటం శోచనీయం.

పై విశ్లేషణ బట్టి తేలేదేమిటంటే రాష్ట్రాన్ని "హరితాంధ్రప్రదేశ్" గా మార్చాలని ఆశయం వున్నా బడ్జెట్ కేటాయింపులు చూస్తే నీటిపారుదల-వరద నివారణ రంగానికి పెద్దగా కేటాయింపు లేనట్లుగా కానవస్తోంది బడ్జెట్ సంగ్రహం ద్వారా. అనగా ఈ బడ్జెట్ 2005-06 ను నీరుకారుతున్న బడ్జెట్‌గా అభివర్ణించ వచ్చును.

## పట్టిక-1

## కేంద్ర ప్రభుత్వం నుండి బదలాయింపబడిన వనరులు

(రు. కోట్లు)

| సం. రెవెన్యూ | కేంద్రం నుండి బదలాయింపబడిన వనరులు | | | |
|---|---|---|---|---|
| | కేంద్రపన్నులలో వాటా | సహాయాను దానం | మొత్తం | [illegible] రాబడిలో శాతం |
| 1995-96 | 2562.67 | 1586.31 | 4148.98 | 42.0 |
| 1996-97 | 2938.71 | 1748.05 | 4686.76 | 41.9 |
| 1997-98 | 3410.74 | 1528.59 | 4939.33 | 35.7 |
| 1998-99 | 3008.17 | 1443.00 | 4451.17 | 31.2 |
| 1999-2000 | 3343.30 | 2011.17 | 5354.47 | 31.9 |
| 2000-01 | 3979.31 | 2201.10 | 6180.41 | 31.7 |
| 2001-02 | 4061.51 | 3315.30 | 7376.81 | 33.8 |
| 2002-03 | 4315.81 | 2540.13 | 6855.94 | 29.8 |
| 2003-04 | 5068.53 | 4389.39 | 9457.92 | 35.2 |
| 2004-05 (స.అం) | 6336.50 | 4066.54 | 10403.04 | 32.5 |
| 2005-06 (బ.అం) | 6688.15 | 4904.11 | 1159.26 | 32.2 |

ఆధారం: బడ్జెట్ సంగ్రహం 2004-05, 2005-06

## పట్టిక-2

## రాష్ట్రం ప్రభుత్వ సొంత వనరులు

(రు. కోట్లు)

| సం. రెవెన్యూ | రాష్ట్ర సొంత వనరులు | | | |
|---|---|---|---|---|
| | సొంతపన్నుల ద్వారా రాబడి | పన్నేతర రాబడి | మొత్తం | [illegible] రాబడిలో శాతం |
| 1995-96 | 4120.44 | 1605.47 | 5725.91 | 58.0 |
| 1996-97 | 4881.83 | 1624.72 | 6506.55 | 58.1 |
| 1997-98 | 7113.55 | 1788.21 | 8901.76 | 64.3 |
| 1998-99 | 7961.38 | 1846.96 | 9808.34 | 68.8 |
| 1999-2000 | 9008.60 | 2441.55 | 11450.15 | 68.1 |
| 2000-01 | 10551.92 | 2742.91 | 13294.83 | 68.3 |
| 2001-02 | 11550.59 | 2917.65 | 14468.24 | 66.2 |
| 2002-03 | 12617.56 | 3529.42 | 16146.98 | 70.2 |
| 2003-04 | 13805.93 | 3604.65 | 17410.58 | 64.8 |
| 2004-05 (స.అం) | 17311.09 | 4279.70 | 21590.79 | 67.5 |
| 2005-06 (బ.అం) | 1998.79 | 4403.48 | 24384.27 | 67.8 |

ఆధారం: బడ్జెట్ సంగ్రహం 2004-05, 2005-06

## పట్టిక-3

## రాష్ట్రంలో ప్రజావ్యయం

(రు. కోట్లు)

| సం. | అభివృద్ధి వ్యయం | | | అభివృద్ధేతర వ్యయం | | | |
|---|---|---|---|---|---|---|---|
| | రెవెన్యూ వ్యయం | మూలధన వ్యయం | మొత్తం | రెవెన్యూ వ్యయం | మూలధన వ్యయం | మొత్తం | మొత్తం ప్రజా వ్యయం |
| 1995-96 | 6845.30 | 2406.31 | 9251.61 | 3768.38 | 15.89 | 3784.27 | 13035.88 |
| 1996-97 | 9897.45 | 113.31 | 10010.76 | 4494.91 | 18.07 | 4512.98 | 14523.74 |
| 1997-98 | 9559.24 | 1064.32 | 10623.56 | 4985.04 | 21.68 | 5006.72 | 15630.28 |
| 1998-99 | 10980.18 | 1559.82 | 12340.00 | 5963.38 | 25.41 | 5988.79 | 18328.79 |
| 1999-2000 | 11006.77 | 1962.39 | 12969.16 | 7031.10 | 29.84 | 7060.94 | 20030.10 |
| 2000-01 | 14110.47 | 2672.95 | 16783.42 | 8959.89 | 50.58 | 9010.47 | |
| 25793.89 | | | | | | | |
| 2001-02 | 14909.93 | 3016.57 | 17926.50 | 9816.40 | 71.70 | 9888.10 | 27814.60 |
| 2002-03 | 14550.76 | 3517.67 | 18068.43 | 11506.13 | 278.40 | 11784.53 | |
| 29852.96 | | | | | | | |
| 2003-04 | 17281.29 | 3989.95 | 21271.24 | 12548.85 | 260.91 | 12809.76 | 34081.00 |
| 2004-05(స.అం) | 20057.91 | 5492.46 | 25550.37 | 13397.56 | 387.76 | 13785.32 | 39335.49 |
| 2005-06(బ.అం) | 22115.70 | 7103.67 | 29219.37 | 15262.21 | 405.20 | 15447.42 | 44886.78 |

ఆధారం: బడ్జెట్ సంగ్రహం 2000-01, 2004-05, 2005-06

## పట్టిక-4

## మిగిలివున్న ప్రజారుణం

(రు. కోట్లు)

| సం. | బహిరంగ | కేంద్రంనుండి | స్వయంపాలక | ప్రత్యేక | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1995-96 | 3515.95 | 9675.45 | 373.46 | 1599.39 | 15164.25 |
| 1996-97 | 4045.40 | 10483.87 | 848.51 | 1842.00 | 17219.78 |
| 1997-98 | 4693.55 | 12059.43 | 1032.99 | 2183.41 | 19969.38 |
| 1998-99 | 6038.36 | 13941.27 | 1408.01 | 2517.50 | 23905.14 |
| 1999-2000 | 7738.99 | 15415.36 | 1807.77 | 4152.04 | 29114.16 |
| 2000-01 | 9137.69 | 16509.67 | 3639.13 | 6364.59 | 35651.08 |
| 2001-02 | 11038.85 | 19032.89 | 4590.31 | 7830.29 | 42492.34 |
| 2002-03 | 14259.07 | 19288.93 | 5632.25 | 10903.07 | 50083.32 |
| 2003-04 | 17085.91 | 18706.40 | 8089.80 | 14888.15 | 58770.26 |
| 2004-05 (స.అం) | 19912.77 | 17734.51 | 9618.76 | 18936.82 | 66202.86 |
| 2005-06 (బ.అం) | 22735.07 | 17338.99 | 13112.32 | 23333.32 | 71519.70 |

ఆధారం: బడ్జెట్ సంగ్రహం 2005-06.

*

# బడ్జెట్టు - కనీస ఉమ్మడి కార్యక్రమం

- గుడిపూడి విజయరావు

యుపిఏ ప్రభుత్వం తన కనీస ఉమ్మడి కార్యక్రమాన్ని బడ్జెట్‌లో ఏ మేరకు అమలు పరిచిందన్నది ఒక ప్రధానాంశం. గతంలో కేంద్రంలో అధికారం నెరపిన సంకీర్ణ ప్రభుత్వాలకూ ఉమ్మడి కార్యక్రమాలున్నాయి. అయినా వాటి అమలు గురించి ఆ ప్రభుత్వాలు కాని ప్రజలు కాని అంతగా పట్టించు కోలేదు. అయినప్పటికీ ప్రస్తుతం కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఏ ప్రభుత్వం ప్రకటించిన కనీస ఉమ్మడి కార్యక్రమం (సిఎంపి) ప్రతి ఒక్కరి దృష్టిలో ప్రాధాన్యత సంతరించుకోవడానికి ప్రత్యేక కారణాలు లేకపోలేదు.

అన్నింటికన్నా ముందుగా చెప్పుకోవలసింది ఈ ఎన్నికల్లో ప్రజలు గత పన్నెండేళ్లుగా అమలవుతున్న సరళీకృత విధానాలకు వ్యతిరేకంగా తీర్పునిచ్చారు. ఆ విధానాలు ప్రజల స్థితిగతులను తీవ్రంగా దెబ్బతీశాయి. ఉపాధి పెరగక పోగా మరింత తగ్గిపోయింది. నిరుద్యోగ సమస్య మరింత అధ్వాన్నమయింది. దారిద్ర్యం అధికమయింది. ఆహార భద్రత దిగజారిపోయింది. గ్రామీణ ప్రాంతాలు ముఖ్యంగా వ్యవసాయరంగం సంక్షోభంలో పడిపోయింది. వీటన్నింటి పట్ల ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేశారు. ఈ విషయాన్ని సరళీకృత విధానాలకు నాందీవాచకం పలికిన కాంగ్రెస్ పార్టీ సైతం గుర్తించింది. అందుచేతనే ప్రధాని పదవిని చేపట్టిన మన్మోహన్ సింగ్ సంస్కరణలను మానవీయ కోణంతో అమలు చేయాలని చెప్పసాగారు. ఎన్నికల్లో వ్యక్తమయిన ప్రజాతీర్పుకు, దాని ప్రకారం తన దృష్టిలో వచ్చిన మార్పుకు అనుగుణంగా కాంగ్రెస్ ప్రభుత్వం సిఎంపి ని ప్రకటించింది. దీనిలో ప్రజానుకూల అంశాలు అనేకం ఉన్నాయి.

సిఎంపి ప్రాధాన్యత పెరగటానికి ఇవే ప్రధాన కారణాలు కావు. యుపిఏ ప్రభుత్వం మెజారిటీ కోసం వామపక్షాల బయటిమద్దతుపై ఆధారపడి ఉంది. వామపక్షాలు సిఎంపి లోని అంశాలను తప్పని సరిగా అమలు చేయాలని పట్టుబడుతున్నాయి.

ఈ నేపథ్యంలో బడ్జెట్‌లో ధ్వనే మారిపోయింది. ఇదే చిదంబరం ఆర్థిక మంత్రిగా, ఆర్థిక సంస్కరణల తిరుగులేని మద్దతుదారుగా కార్పొరేట్ వర్గాల డ్రీం బడ్జెట్‌లను గతంలో ప్రవేశ పెట్టారు. కాని ఇప్పుడు ఆయన మాటల్లో పూర్తి తేడా కనపడుతున్నది. గత బడ్జెట్‌లోను, ప్రస్తుత బడ్జెట్‌లోను కూడ ఈ తేడా స్పష్టం అయింది.

ఉదాహరణకు ఈ బడ్జెట్ ప్రసంగం మొదటి భాగంలో ఆయన చెప్పిన ఈ విషయాన్నే గమనించండి: "అభివృద్ధి, పటిష్టత, సమానత్వం పరస్పరం ఒకదానిపై మరొకటి ఆధారపడిన లక్ష్యాలు. పేద ప్రజలకు అనుకూలంగా ప్రభుత్వ నిర్ణయాత్మక జోక్యానికి సిఎంపి మొగ్గు చూపుతున్నది. భారత ఆర్థిక వ్యవస్థకున్న శక్తిసామర్థ్యాల దృష్ట్యా నిరుద్యోగంపైన, దారిద్ర్యంపైన ప్రత్యక్షదాడికి వనరులను సమీకరించడం సాధ్యమవుతుంది. 'ఆమ్ ఆద్మీ'కి తక్షణం ఉపశమనం కోసం అదే ఏకైక మార్గం." అయితే ఈ మాటలసారం బడ్జెట్ ప్రతిపాదనల్లో ఏమేరకు ప్రతిబింబించిందీ పరిశీలించాల్సి ఉంది.

**ఉపాధి హామీ పథకం**

కనీస ఉమ్మడి కార్యక్రమంలో అతి ప్రధానమైన వాగ్దానం ఉపాధి కల్పనకు సంబంధించినది. ప్రభుత్వం కూడ ఈ విషయాన్ని గుర్తించింది. దీని గురించి సిఎంపి ఇలా చెప్పింది: "యుపిఏ ప్రభుత్వం తక్షణమే జాతీయ ఉపాధి హామీ చట్టాన్ని తెస్తుంది. వనరులు నిర్మించే ప్రభుత్వ పనుల్లో గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో పేద, దిగువ మధ్యతరగతి కుటుంబాలలో పనిచేయకలిగిన ఒకరికి ఏడాదికి కనీసం వంద రోజులపాటు ఉపాధికి ఈ చట్టం హామీ కల్పిస్తుంది. ఈ లోగా ఒక బృహత్తరమైన పనికి ఆహారం పథకం ప్రారంభించబడుతుంది."

కాని ఇప్పటి వరకు ఈ విషయంలో ప్రభుత్వం చేసిందేమిటి? ఈ మేరకు పార్లమెంటులో ప్రవేశపెట్టిన చట్టం అసలు చెప్పిన దానిని నీరుగార్చింది. నిజమైన ఉపాధి హామీ అంటే ఏమిటి? దానిపై విస్తృతమైన చర్చజరిగిన తర్వాత ఏర్పడిన అభిప్రాయానికి, చట్టంలో పేర్కొన్న దానికి మధ్య పెద్ద అగాథం ఉంది. అంతే కాదు ఇంతటి భారీ పథకానికి అవసరమైన నిధులను కేటాయించే ఉద్దేశం కూడ ఆర్థిక మంత్రిత్వ శాఖకు ఉన్నట్లు కనిపించడం లేదు. ఈ పథకాన్ని అమలు చేయాలంటే ప్రభుత్వ అంచనాల ప్రకారమే ఏడాదికి రు.25,000 కోట్లు కావాలి. కొన్ని అంచనాల ప్రకారం ఇది రు.45,000 కోట్లు.

కానీ ఈ పథకానికి ఆరంభంగా భావించబడుతున్న పనికి ఆహారపథకానికి గత ఏడాది యుపిఏ ప్రభుత్వం రు.1,818 కోట్లు మాత్రమే ఖర్చు పెట్టింది. దీనికి తోడు సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్ యోజన(ఎస్‌జిఆర్‌వై)కు రు.4,590 కోట్లు కేటాయించింది. ఈ ఏడాది బడ్జెట్‌లో పనికి ఆహార పథకానికి కేటాయించింది రు.5,400 కోట్లు. గత ఏడాది మీద పెరుగుదల చాల స్వల్పంగా ఉంది. ఇదే సమయంలో ఎస్‌జిఆర్‌వైకి కేటాయింపులను వాస్తవానికి రు.3,600 కోట్లకు తగ్గించింది. నూతన ఉపాధి హామీ పథకానికి కేటాయింపులు ఇప్పటిదాకా అమలవుతున్న ఉపాధి పథకాల నిధులు మాత్రమే అని అర్థమవుతుంది. ఉపాధి హామీ పథకానికి ప్రభుత్వం ఆచరణలో ప్రాధాన్యత ఇవ్వడం లేదని ఈ అంశాలు తెలుపుతున్నాయి.

**వ్యవసాయానికి ప్రాధాన్యత**

ఉపాధి హామీ తర్వాత యుపిఏ ప్రభుత్వం తన ప్రాధాన్యతగా చెప్పుకున్న అంశం వ్యవసాయం. వ్యవసాయ రంగానికి, మొత్తంగా గ్రామీణ ప్రాంతాలకు సంస్థాగత రుణం అధికంగా లభించేలా చూస్తానని సిఎంపి వాగ్దానం చేసింది. ఈ కాలంలో ఈ దిశగా మార్పు ఉండాల్సినంత పరిమాణంలో లేనప్పటికి సానుకూలంగానే ఉందని చెప్పవచ్చు. ఇదే సమయంలో వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడులను పెంచుతానని, భారత రైతాంగానికి అంతర్జాతీయంగా పోటీనెదుర్కోవడంలో మద్దతు కల్పిస్తానని కూడ సిఎంపి వాగ్దానం చేసింది.

సిఎంపి ఇలా పేర్కొంది: "వ్యవసాయ పరిశోధన, విస్తరణ, గ్రామీణ మౌలిక సదుపాయాల కల్పన, ఇరిగేషన్ రంగాలలో ప్రభుత్వ పెట్టుబడులు సాధ్యమైనంత త్వరలో గణనీయంగా పెరిగేలా యుపిఏ ప్రభుత్వం చూస్తుంది." అంతే కాకుండా "రైతాంగానికి దిగుమతుల నుండి అవసరమైన రక్షణను ముఖ్యంగా అంతర్జాతీయ ధరలు పడిపోయినపుడు యుపిఏ ప్రభుత్వం కల్పిస్తుంది."

కాని వాస్తవం మాత్రం ఈ వాగ్దానానికి అనుగుణంగా లేదు. గత బడ్జెట్‌లో కేటాయించిన దానికన్నా ఖర్చుపెట్టింది ఎక్కువగానే ఉంది. బడ్జెట్ అంచనా ప్రకారం ఇది రు.4,643 కోట్లు కాగా రు.4,799 కోట్లు ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో ఖర్చుపెట్టినట్లు సవరించిన అంచనాలు తెలుపుతున్నాయి. రాబోయే ఆర్థిక సంవత్సరానికి కేటాయింపులు ఇంకా పెరిగాయి. ఇది రు.6,425 కోట్లుగా ఉంది. కాని మొత్తం వ్యవసాయరంగాన్ని పరిగణనలోకి తీసుకున్నపుడు ఇవన్నీ నామమాత్రవు మొత్తాలే. వ్యవసాయరంగంలోను, ఇరిగేషన్‌లోను, వ్యవసాయ పరిశోధన, విస్తరణలోను, మౌలిక సదుపాయాల కల్పనలోను అత్యధిక వాటా ఖర్చుపెడుతున్నది రాష్ట్ర ప్రభుత్వాలే. ఈ రంగాలకు ఖర్చు పెరగాలంటే రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక స్థితి మెరుగుపడాలి. కాని కేంద్రం తీసుకుంటున్న చర్యలు వాటి ఆర్థిక స్థితిని మరింత బలహీన పరిచేవిగా ఉన్నాయి.

ఈ బడ్జెట్‌లో కేంద్రం తన రుణభారంలో పెద్ద భాగాన్ని రాష్ట్ర ప్రభుత్వాలపైకి నెట్టివేసింది. ప్రణాళికా వ్యయానికి అవసరమైన రు.29,000 కోట్లను రాష్ట్ర ప్రభుత్వాలు తమంతతాముగానే రుణాలను సేకరించుకుని సమకూర్చుకోవాలని బడ్జెట్ పేర్కొంది. ఇప్పటి దాకాఅనుసరిస్తున్న పద్ధతి ప్రకారం అయితే ఈ నిధులను తానే సేకరించి రాష్ట్రాలకు అందించాల్సి ఉంది. కేంద్రం తన లోటు తక్కువగా చూపించడానికి ఈ విధానాన్ని చేపట్టింది. కాని ఇది రాష్ట్ర ప్రభుత్వాలపై అదనపు భారాన్ని, బాధ్యతను మోపుతుంది.

అంతే కాకుండా అంతర్జాతీయ పోటీనుండి తట్టుకోవడానికి రైతాంగానికి ప్రభుత్వం చేసింది ఏమీ లేదు. అక్కడి ప్రభుత్వాలు ఇచ్చే అధిక సబ్సిడీల ఫలితంగా సంపన్న దేశాలనుండి కారుచౌకగా వ్యవసాయ దిగుమతులు వచ్చిపడుతున్నాయి. వాటినుండి మన రైతాంగాన్ని కాపాడుకోవాలంటే వాటిపై అధిక దిగుమతి సుంకాలు విధించాల్సి ఉంటుంది. కాని ఈ బడ్జెట్‌లో వ్యవసాయసరుకుల దిగుమతుల సుంకాల రేట్లను ఏమీ మార్చలేదు. ఒక్క మినహాయింపు మాత్రం కట్‌ఫ్లవర్స్. పుష్పాలను సాగుచేసే వారు రైతాంగంలో 1 శాతం కూడ లేరు. ధరలు దిగజారి తీవ్ర సంక్షోభంలో పడిపోయిన పత్తి, నూనెగింజల రైతాంగాన్ని ఆదుకోవడానికి మాత్రం వాటి దిగుమతి సుంకాలను ఏ మాత్రం తగ్గించ లేదు.

**సామాజిక రంగాలు**

బడ్జెట్‌లో ఎంతోకొంత సానుకూల మార్పు కనిపించింది ఆరోగ్యం, విద్య లాంటి సామాజిక రంగాలలో అని చెప్పుకోవచ్చు. విద్య గురించి సిఎంపి ఈ వాగ్దానాన్ని చేసింది: "విద్యారంగంపై ప్రభుత్వ వ్యయాన్ని జిడిపిలో కనీసం 6శాతానికి పెంచేందుకు యుపిఏ కృషి చేస్తుంది. దీనిలో సగం మొత్తం ప్రాథమిక, సెకండరీ రంగానికి ఖర్చుపెట్టేలా చూస్తుంది. ఇది దశల వారీగా అమలవుతుంది." ఆరోగ్యరంగంలో "రాబోయే ఐదేళ్లలో ఆరోగ్యరంగానికి జిడిపిలో 2-3శాతం ఖర్చు చేసేలా యుపిఏ

ప్రభుత్వం చూస్తుంది. ప్రాథమిక ఆరోగ్యరంగంపై ప్రధానంగా కేంద్రీకరిస్తుంది."

కచ్చితంగానే ఈ రంగాలకు కేటాయింపులు, ఖర్చు కూడ పెరిగాయి. అయితే ఈ పెరుగుదల ప్రకటించిన లక్ష్యాలను అందుకోవడానికి తగినంత వేగంగా మాత్రం లేదు. అంతే కాకుండా ఇక్కడ కూడ సమస్య వ్యవసాయ రంగంలో లాంటిదే. విద్య, ఆరోగ్య రంగాల ప్రధాన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదే.

**ఆహార భద్రత**

సిఎంపి చేసిన పెద్ద వాగ్దానాలలో ఆహార భద్రత ఒకటి:"రాబోయే మూడు మాసాలలో ఒక మధ్య కాలిక సమగ్ర ఆహార,పౌష్టికాహార పథకాన్ని యుపిఏ రూపొందిస్తుంది. ఒక సర్వజనీన ఆహార భద్రత వైపుకు క్రమంగా సాగిపోవడం దీని లక్ష్యం. యుపిఏ ప్రభుత్వం ప్రజాపంపిణీ వ్యవస్థను ముఖ్యంగా పేద, వెనుక బడిన బ్లాకులలో బలోపేతం చేస్తుంది."

కాని గత ఎనిమిది మాసాల కాలంలో అలాంటి ఆహార భద్రతా పథకం ఏదీ ప్రకటించబడలేదు. ఇది ఆర్థిక మంత్రిత్వ శాఖ బాధ్యత కాదని కూడ వాదించవచ్చు. అయితే ఈ భారాన్ని ఎఫ్‌సిఐ లాంటి ప్రభుత్వ రంగ సంస్థలపై నెట్టేస్తున్నట్లు బడ్జెట్ ప్రతిపాదనలను చూస్తే అనిపిస్తుంది. పనికి ఆహార పథకానికి కావలసిన రు.5,600 కోట్ల విలువైన మొత్తం ఆహారం, ఎస్‌జిఆర్‌వై కి కావలసిన రు.3,000 కోట్ల విలువైన ఆహారాన్ని ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌సిఐ) భరించేలా రంగం సిద్ధం చేస్తున్నారు. ఈ చర్య అర్థరహితమే కాకుండా ఇటు ఎఫ్‌సిఐని అటు పనికి ఆహార పథకాన్ని కూడ బలహీనపరుస్తుంది.

**మౌలికసదుపాయరంగాలలో పెట్టుబడులు**

ఈ అంశంపై సిఎంపి ఇలా పేర్కొంది: "ప్రైవేటు రంగం పాత్ర పెరిగినప్పటికీ మౌలిక సదుపాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడులు అధికం చేయబడతాయి. సబ్సిడీలు బహిరంగం చేయబడతాయి. బడ్జెట్‌ద్వారా అందించబడతాయి." కాని వాస్తవంలో దీనికి పూర్తి విరుద్ధంగా జరుగుతున్నది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరం ప్రణాళికా వ్యయంలో పెట్టుబడి వ్యయం రు.22,712 కోట్లు మాత్రమే.కేటాయింపుతో పోల్చుకుంటే ఇది 14 శాతం తక్కువ. ఈ బడ్జెట్‌లో దాన్ని గత బడ్జెట్‌లో కన్నా నామమాత్రంగా 3 శాతం పెంచారు.

ఆశ్చర్యకరమైన విషయమేమంటే మౌలిక సదుపాయ రంగాలకు ఖర్చును బడ్జెట్ వెలుపలకు తీసుకెళ్లారు. ఈ నిధుల సేకరణకు స్పెషల్ పర్పస్ వెహికల్ (ఎస్‌పివి) ఒక దాన్ని ఏర్పాటు చేస్తారు. రు.10,000 కోట్లను ఈ విధంగా సేకరిస్తారు. దీనికి బడ్జెట్‌కు సంబంధం ఉండదు. పైగా ఇది మొత్తం అవసరాలతో పోల్చుకుంటే చాల తక్కువే. అంతే కాకుండా ఈ విధానం కీలకమైన మౌలిక సదుపాయ రంగాలకు పెట్టుబడుల్లో పారదర్శకత లేకుండా చేస్తుంది.

రాష్ట్ర ప్రభుత్వాలే రు.29,000 కోట్లు సేకరించుకోవాలని చెప్పడం గాని, పనికి ఆహార పథకానికి, ఇతర ఉపాధి హామీ పథకాలకు అవసరమైన ఆహారధాన్యాల సరఫరా బాధ్యతను ఎఫ్‌సిఐ పైకి నెట్టివేయడం కాని, మౌలిక సదుపాయ రంగ పెట్టుబడుల కోసం ఎస్‌పివిని ఏర్పాటు చేయడం కాని కేంద్రం ప్రధానంగా తన లోటు మొత్తాన్ని తక్కువగా చూపడానికి అనుసరించిన ఎత్తుగడ మాత్రమే. రెవిన్యూ లోటును, ద్రవ్యలోటును ప్రపంచ బ్యాంకు, ఇతర అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు నిర్దేశించిన పరిమితికి లోబడేలా ఉంచటానికి చేసిన ప్రయత్నమే. ఇది కీలకమైన అంశాలపై బడ్జెట్ అదుపు లేకుండా చేయడమే కాకుండా మన ఆర్థిక సార్వభౌమాధికారాన్ని దెబ్బతీసే చర్య.

సిఎంపిలో పేద సాధారణ ప్రజానీకానికి, రైతాంగానికి వెసులు బాటు కల్పించే చర్యలపై మాటలు గొప్పగా చెప్పిన ప్రభుత్వం ఆచరణ మాత్రం దానికి పూర్తి అనుగుణంగా లేదు. ఇదే సమయంలో సరళీకృత ఆర్థిక విధానాలకు సంబంధించి, దేశ విదేశీ పెట్టుబడిదారులకు ఇచ్చే రాయితీల విషయంలో మాత్రం తనపని తాను చేసుకుపోతున్నది. పలురంగాలలో ఎఫ్‌డిఐల పరిమితి పెంపు, కార్పొరేట్ పన్ను తగ్గింపు మొదలయినవి దీనికి స్పష్టమైన ఉదాహరణలు. సిఎంపి ని ఈ మాత్రమైనా పరిగణనలోకి ప్రభుత్వం తీసుకుంటున్నదంటే దాని మనుగడ కోసం వామపక్షాల మద్దతుపై ఆధారపడవలసి రావడమే. వాటి వత్తిడి వల్లనే ప్రస్తుత బడ్జెట్‌లో ఈ సాధారణ ప్రజల ప్రయోజనాలు ఎంతో కొంత ప్రతిబింబించాయి. పరిస్థితి ఇలాగే కొనసాగుతుందని చెప్పలేము. వామపక్షాల నిరంతర నిఘా, వత్తిడి, ప్రజల పోరాటాలు, ఉద్యమాలు మాత్రమే సిఎంపి అమలుకు ఎంతో కొంత గ్యారంటీ ఇస్తాయి.

# నవ్య ఉదార వాదంలో అస్తవ్యస్తమౌతున్న విత్త వ్యవస్థ, బడ్జెట్‌లు

-ప్రొ॥ కె. చక్రధరరావు

ఆర్థికమంత్రి చిదంబరం పార్లమెంటులో ప్రవేశపెట్టిన 2005-06 బడ్జెట్ సంతులంగానూ, అన్ని వర్గాలకు లాభదాయకంగానూ, వ్యవసాయం, నీటిపారుదల, గ్రామీణాభివృద్ధి, సామాజిక రంగం, సంక్షేమం, ఉపాధి కల్పనలకు ప్రాధాన్యత నిచ్చి, ఆర్థికవృద్ధి, స్థిరత్వం, సమత్వాలను సాధించేదిగా వుందని చాలామంది మెచ్చుకున్నారు. నిజంగా ఈ బడ్జెట్ దిశ ఎటువైపో, దీనివల్ల ఎవరికి లాభమో, ఎవరికి నష్టమో అనే అంశాన్ని పరిశీలించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

ఇందుకు ఈ బడ్జెట్ వెనుక వున్న ఆర్థిక సిద్ధాంతం, విత్త సూత్రాలను పరిశీలించడం అవసరం. 1991లో ప్రవేశపెట్టిన నవ్య ఉదారవాద ఆర్థిక సంస్కరణలు, ఆర్థిక సరళీకరణం, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలలో భాగంగానే బడ్జెట్‌లు, వాటి వెనుక వున్న విత్త సంస్కరణలు, విధానాలు వస్తున్నాయి. కాబట్టి ఈ బడ్జెట్‌కు కూడా ప్రాతిపదిక నవ్య ఉదారవాదమేననేది స్పష్టం. సంపన్న పెట్టుబడిదారీ దేశాలు, ప్రపంచబ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థలు కలిసి నవ్య ఉదారవాద విత్త సూత్రాలను రూపొందించి వాటిని మూడవ ప్రపంచదేశాలు అనుసరించేటట్లు,వాటి ప్రాతిపదికన విత్త సంస్కరణలను అమలు జరుపడానికి అన్ని విధాలుగా వత్తిడి తెస్తున్నాయి.

నవ్య ఉదారవాద విత్త సూత్రాలు:

1. ప్రభుత్వాల సామర్థ్యం పరిమితమైంది కాబట్టి అది విధులను తగ్గించుకొని, కొన్ని ఆవశ్యక విధులకే పరిమితం కావాలి.
2. అభివృద్ధిని సాధించడాన్ని ప్రైవేటు రంగానికి వదిలి, ప్రభుత్వం దానిని సుకరం చేసేదిగా మాత్రమే వుండాలి. ప్రత్యక్షంగా అభివృద్ధిలో భాగస్వామిగా వుండకూడదు.
3. కార్పొరేటు, ఆదాయపు పన్నుల రేట్లను తగ్గించి, ప్రైవేటు పెట్టుబడులను ప్రోత్సహించాలి.
4. ప్రభుత్వ రంగ సంస్థలలో ఉత్పాదకత, సామర్థ్యం తక్కువ కాబట్టి వాటిలోని పెట్టుబడులను ఉపసంహరించి ప్రైవేటీకరించాలి.
5. స్వేచ్ఛా వాణిజ్యాన్ని పెంపొందించడానికి దిగుమతి, ఎగుమతుల సుంకాలను తగ్గించాలి.
6. రెవెన్యూ, ద్రవ్య లోటులను తగ్గించి విత్త స్థిరీకరణను, క్రమ శిక్షణను సాధించాలి.
7. అందుకు ప్రభుత్వ ఉద్యోగాలు, వేతనాలు, పింఛనులు, అలాగే రాయితీలను తగ్గించాలి.
8. సేవలపై పన్నును, యూజర్ ఛార్జీలను వసూలు చేయాలి.
9. ప్రభుత్వ రుణాలను, వడ్డీ చెల్లింపులను తగ్గించాలి.
10. విదేశీ పెట్టుబడులను సరళతరం చేయాలి.

వీటన్నింటిలో బడ్జెట్ లోటులను తొలగించడానికీ, విత్త స్థిరీకరణకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. వీటిద్వారా ప్రభుత్వం సాధించే లక్ష్యం ఒక్కటే. అదే అధిక వృద్ధి రేటు. ఈ సూత్రాలవల్ల, అధిక వృద్ధి రేటు వల్ల ప్రయోజనం పొందేది కార్పొరేట్‌రంగం మాత్రమే. బీద, బలహీన, మధ్యతరగతి వర్గాలకు ఒనగూడేదేమీ లేదు. ఈ సూత్రాలు స్వేచ్ఛా ఆర్థిక వాదం, స్వేచ్ఛా మార్కెట్ విధానం, స్వేచ్ఛా వాణిజ్యం వంటి కాలం చెల్లిన నవ్య సంప్రదాయ సిద్ధాంతాలకు తిరిగి ప్రాణంపోసి తీవ్ర రూపంలో అమలు జరుపుతున్నాయి.

**విత్త సంస్కరణలు:**

పై సూత్రాలననుసరించి భారత ప్రభుత్వం 1991-92 నుండి విత్త సంస్కరణలను అమలు జరుపుతూంది. చెల్లయ్య కమిటీ సూచనలతో ప్రత్యక్ష, పరోక్ష పన్నుల రేట్లను అధికంగా తగ్గించారు. 2003లో ఫిస్కల్ రెస్పాన్సిబిలిటీ అండ్ బడ్జెట్ మేనేజ్‌మెంట్ చట్టాన్ని తెచ్చారు. దీని ప్రకారం కేంద్ర ప్రభుత్వం 2009 మార్చి వరకు రెవెన్యూ లోటును పూర్తిగా తొలగించి ద్రవ్య లోటును జిడిపిలో 3% కు తగ్గించాలి. ఇందుకొరకు ప్రభుత్వం ఈ కింది నిబంధనలను రూపొందించింది.

1. 2004-05లో ప్రారంభించి ప్రతిఏటా జిడిపిలో రెవెన్యూలోటును 0.5% గానీ, పైగా గానీ తగ్గించాలి.
2. ద్రవ్య లోటును కూడా ఏటా 0.3% గానీ, పైగా గానీ తగ్గించాలి.
3. ప్రభుత్వ రుణాలను (విదేశీ రుణాలతో సహా) 2004-05లో జిడిపిలో 9%కి పరిమితం చేసి, తరువాత ఏడాదికి 1.0% చొప్పున తగ్గించాలి.

4. గ్యారంటీలను జి.డి.పి.లో 0.5%కు పరిమితం చేయాలి.

**12 వ ఫైనాన్స్ కమీషన్:**

నవంబర్ 30, 2004న తన నివేదికను సమర్పించిన రంగరాజన్ అధ్యక్షతలోని 12వ ఫైనాన్స్ కమీషన్ కూడా కేంద్ర, రాష్ట్ర విత్తాలను పునర్వ్యవస్థీకరించాలని, రుణాలను తగ్గించాలని, విత్త సంస్కరణలను చేపట్టిన రాష్ట్రాలకే రుణాల చెల్లింపుకు సాయం చేయాలనీ, కేంద్ర పన్నుల రాబడిలో 29.5% బదులుగా 30.5% రాష్ట్రాలకు బదిలీ చేయాలని సూచించింది.

**పోస్ట్ కీనీషియన్ విత్త సూత్రాలకు తిలోదకాలు:**

నవ్య ఉదారవాద విత్త సూత్రాలు, మన ప్రభుత్వాల విత్త సంస్కరణలు, 1930 నుండి 80 వరకు దాదాపు 5 దశాబ్దాలు అమలులో వున్న పోస్టు కీనీషియన్ విత్త సూత్రాలు, విధానాలకు పూర్తిగా విరుద్ధంగా వున్నాయి. మనదేశంలోని సామాజికార్థిక లక్ష్యాల కనుగుణంగా విత్త విధానం లక్ష్యాలు ఈ క్రింది విధంగా రూపొందించబడ్డాయి.

1. ఉత్పత్తులను పెంచి, అభివృద్ధినీ, ప్రజల జీవన ప్రమాణాలనూ పెంచడం.
2. ఆదాయ అసమానతలను తొలగించి సమానత్వ పంపిణీని సాధించడం.
3. సంపూర్ణ ఉద్యోగితను సాధించడం.
4. పేదరికాన్ని నిర్మూలించడం.

ఈ లక్ష్యాలను సాధించడానికి పన్నుల రేట్లను ప్రొగ్రెసివ్‌గా వుంచి పన్నుల రాబడులను పెంచడం, లోటు బడ్జెట్ విధానాన్ని అనుసరించడం, రుణాలను సేకరించడం చేయవచ్చునని లెర్నర్, మస్‌గ్రేవ్, ప్రెస్టవంటి ఆర్థిక వేత్తలు సూత్రీకరించారు. మార్కెట్ వీటిని సాధించలేదనీ, ప్రభుత్వం తన విత్త విధానం ద్వారా వీటిని సాధించాలనీ మస్‌గ్రేవ్ చెప్పారు. పై సామాజిక లక్ష్యాలను, సూత్రాలను పూర్తిగా వదిలివేసి, నవ్య ఉదారవాదంలో పడి కొట్టుక పోతున్నారు. మన రాజ్యాంగ సూత్రాలు, అభివృద్ధి ప్రణాళికల లక్ష్యాలైన స్వావలంబ వృద్ధి, సామాజిక, ఆర్థిక న్యాయం, సమాన అవకాశాలు, అందరికీ ఉపాధి, విద్య, ఆరోగ్యం, సమానత్వ ఆదాయ పంపిణీలకు వ్యతిరేకంగా, నియోలిబరల్ సూత్రాలను, విధానాలను అమలు జరుపుతున్నారు.

**2005-06 కేంద్ర బడ్జెట్:**

ఈ బడ్జెట్‌లో ఆర్థికమంత్రి చిదంబరం ఆర్థిక సంస్కరణలను, విత్త సంస్కరణలను కొనసాగిస్తామని చెప్పారు. అందులో భాగంగా ప్రత్యక్ష, పరోక్ష పన్నులను మరింత తగ్గించారు. ఆదాయపన్ను నుండి ఆదాయ మినహాయింపు స్థాయిని 1 లక్ష రూపాయలకు పెంచి వివిధ స్లాబుల ఆదాయ పన్ను గరిష్ట రేటును 35% నుండి 30 % కి తగ్గించారు. దీని వలన కార్పొరేట్ రంగానికి, అధిక ఆదాయ వర్గాలకు ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది. కస్టమ్స్, ఎక్సైజ్ పన్నులను కూడా మరింత తగ్గించడం వల్ల కార్పొరేట్ రంగానికే ఎక్కువ లాభం కలిగి, కొందరు వినియోగదారులకు కొద్దిగా లబ్ధి చేకూరుతుంది. రెవెన్యూ లోటును 2.7% (జి.డి.పిలో), విత్తలోటును 4.3% స్థాయికి తగ్గించాలని ప్రతిపాదించారు.

**సామాజిక రంగాలు:**

2004-05 బడ్జెట్‌లో మొత్తం వ్యయం రు. 4,77,829 కోట్లు కాగా 2005-06 బడ్జెట్‌లో రు. 5,14,344 కోట్లు ప్రతిపాదించారు. వీటిలో వివిధ సామాజిక రంగాలకు కేటాయింపులు ఈ కింది విధంగా వున్నాయి.

| సామాజికరంగం | 2004-05 | | 2005-06 | |
|---|---|---|---|---|
| | కేటాయింపు రూ. కోట్లు | మొత్తం వ్యయంలో | కేటాయింపు రూ.కోట్లు | మొత్తం వ్యయంలో |
| విద్య | 12,091 | 2.53% | 18,337 | 3.56% |
| ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం | 8,420 | 1.76 | 10,280 | 2.00 |
| త్రాగునీరు | 3,300 | 0.69 | 4,750 | 0.92 |
| పారిశుధ్యం | - | - | 630 | 0.12 |
| ఉపాధికల్పన(ఎన్ఆర్ఇ) | 4,020 | 0.84 | 11,000 | 2.13 |
| యస్.సి, యస్.టి. సంక్షేమం | 1,410 | 0.29 | 6,253 | 1.21 |
| స్త్రీలు, శిశు సంక్షేమం | - | - | 14,379 | 2.79 |

స్థూల జాతీయోత్పత్తి (జి.డి.పి)లో విద్యకు, ఆరోగ్యానికి, కేంద్ర బడ్జెట్‌లో కేటాయింపులు 0.65% మరియు 0.36% గా వున్నాయి. ఈ బడ్జెట్‌లో విద్య, ఆరోగ్యం, ఉపాధి కల్పన, సంక్షేమాలకు కేటాయింపులు పెంచారు. ఐతే ఇందులో ద్రవ్యోల్బణ ప్రభావాన్ని తీసివేస్తే, వీటికి ఇవ్వాల్సిన ప్రాధాన్యత లభించలేదనే చెప్పాలి.

**సంస్కరణల ప్రభావాలు:**

నవ్య ఉదారవాద విత్త విధానాలు, సంస్కరణల ప్రభావం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విత్తాలు, బడ్జెట్‌లపై ప్రముఖంగా పడి అవి అస్తవ్యస్తమైన తీరును ఈ కింది అంశాలలో చూడవచ్చు.

1. సామాజికార్థిక లక్ష్యాలకు ఇవ్వవలసిన ప్రాధాన్యత ఇవ్వకుండా, రెవెన్యూ, ద్రవ్య లోటులను తగ్గింపుకు, విత్త స్థిరీకరణకు ప్రాధాన్యత నిచ్చారు. ఇవి అభివృద్ధి చెందిన దేశాలకు వర్తించే ప్రాధాన్యతలు.

**(మిగతా 36వ పేజీలో )**

# సాయం కరువైన వ్యవసాయం

- డా॥ బి. ఎర్రంరాజు

రైతు ఉత్పత్తి చేసిన సరుకుపైన వేసే మార్కెటింగు రుసుము 1 శాతం. దీని విలువ సాలీనా రు. 900-1000 కోట్లు, ఈ రుసుముని రైతు ఉత్పత్తి చేసిన సరుకును సజావుగా సరియైన ధరకు అమ్ముకునే సావకాశం కలిగించడానికి వినియోగించాలని రైతుల న్యాయమైన కోరిక. ప్రస్తుతం ఉన్న వ్యవసాయ సంక్షోభానికి ముఖ్యకారణం ఉత్పత్తి చేసిన సరుకుకి గిట్టుబాటు ధర పలకక పోవడమే. రైతు కష్టపడి పండించిన పంటకి సరియైన ధర అంటే ఉత్పత్తి ఖర్చులు, కొంత లాభం వస్తేనే, తీసుకున్న అప్పులు వడ్డీతో సహా సకాలంలో తీర్చి కుటుంబానికి కొంతలో కొంత ఖర్చు పెట్టుకుని మళ్ళీ పంటకి పెట్టుబడి పెట్టే పరిస్థితిలో ఉంటాడు. ఇప్పుడు ఇవేవీ జరగక ఉత్పత్తి చేసిన పంటకి రాజకీయ నాయకుల దయాదాక్షిణ్యాల మీద, అమలుకి నోచుకోని నిపుణుల సంఘాల సిఫార్సుల మీద ఆధారపడుతున్నాడు.

పోనీ బ్యాంకులైనా సకాలంలో సరియైన మేరకు అప్పులిస్తున్నాయా అంటే అదీ లేదు. బ్యాంకులన్నీ అంకెల గారడీ చేసి ఇవ్వని అప్పుని సిగ్గూ ఎగ్గూ లేకుండా ఇచ్చామని చెప్పుకుంటూ కేంద్ర ఆర్థికమంత్రి కనుసన్నలలో మెలిగే బ్యాంకు అధ్యక్షులు, వాళ్ళ కుర్చీలు ఎలా పదిలంగా ఉంచుకోవడమా అన్న దాని మీద కసరత్తులు చేస్తున్నారు. దీనికి దాఖలా ఒకటే. ఏ బ్యాంకునైనా ఏ పంటకి వర్గీకరణ చేసిన చిన్న సన్నకారు, మధ్య, పెద్ద రైతులకి ఎంతెంత ఇచ్చారో చెప్పమనండి చూద్దాం. కొన్ని జిల్లా బ్యాంకుల సమన్వయ సంఘాలలో లీడ్ బ్యాంకు అధికారులని ఇటువంటి గణాంక లెక్కలని కొంతమంది కలెక్టర్లు అడిగి చిన్నబోయారు కూడా.

లక్షలకొద్దీ కిసాన్ క్రెడిట్ కార్డులిచ్చామని లెక్కలు చెబుతున్న బ్యాంకులు ఆ క్రెడిట్ కార్డుల ద్వారా ఎంత సొమ్ము ఎలాంటి రైతులకి బట్వాడా ఏ రకంగా అయినదీ చూద్దామంటే లెక్కల కందవు. ఆ క్రెడిట్ కార్డులిచ్చి ఎంతమంది రైతులు విత్తనాలు, మందులు కొనుక్కున్నారు? ఎంతమంది నగదు రూపంలో మదుపు పెట్టుకున్నారు? ఆ క్రెడిట్ కార్డుల వసూళ్ళు ఏ రకంగా ఉన్నాయి? ఈ వివరాలన్నీ అటు రిజర్వు బ్యాంకుగానీ, ఏ వాణిజ్య బ్యాంకుగానీ ఏ వార్షిక నివేదికలోను ఇవ్వలేదు. కొన్ని లక్షల కార్డులు బట్వాడా చేశామని చెబుతున్నారు.

ఇంకా కొన్ని ప్రభుత్వరంగ బ్యాంకులు రైతులకి మోటారు వాహనాలు కొనుగోలుకిచ్చి (రిటెయిలు బ్యాంకింగు రంగంగా వ్యవహరిస్తున్న ఇటువంటి అప్పులు) వాటిని పంట రుణాల మొత్తంలో కలిపేస్తున్నారు.

పోతే, భూములు చదును చేసుకోవడానికి, నత్తువ చేసుకోవడానికి, ట్రాక్టర్ల కొనుగోలుకి, బావుల త్రవ్వకానికి ఇచ్చే రుణాలు ప్రాజెక్టు రూపంగా ఇవ్వాల్సినవి నానాటికి తగ్గుతూ వచ్చాయి. ఇటువంటి రుణాలు 2002 లో రు. 1,608 కోట్లు ఉంటే 2003 మార్చిలో రు. 1,242 కోట్లు ఉన్నాయి. (నాబార్డ్ వార్షిక నివేదికల ఆధారంగా.)

ఇవి ఈ విధంగా ఉంటే, పంటల బీమా పథకాన్ని క్రమబద్ధీకరణ చేసి రైతుల 'రిస్కు'ని పరిరక్షిస్తామన్న మాటలు ఇంకా కార్యరూపం దాల్చవలసి ఉంది.

రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారని అన్ని పార్టీలూ, అందరు అధికారులూ మొసలి కన్నీరు పెడుతూనే ఉన్నారు. అధ్యయన సంఘాలు నివేదికలు సమర్పించి, సెమినార్లు జరిపి వేదిక లెక్కి, వాదన చేస్తూనే ఉన్నారు.

ఈ సంవత్సరం బ్యాంకులు ఆర్థికమంత్రి ఆదేశం మేరకి పంట రుణాలు పెంచేశామని చెబుతున్నాయి. 13 శాతం వర్షాభావం జరిగి వ్యవసాయ ఉత్పత్తి గణనీయంగా పడిపోతుందని వ్యవసాయ నిపుణులు చెబుతున్నారు. ఈ నేపథ్యంలో బ్యాంకులు ముమ్మరంగా ఇచ్చామన్న అప్పులు ఏమవుతాయి? ఎలా తీర్మానం అవుతాయి? అవకపోతే, బ్యాంకులు బాధ్యతంతా ఆర్థికమంత్రి మీదకి, రిజర్వుబ్యాంకు నాబార్డు మీదకి నెట్టేసి చేతులు దులుపుకుంటాయా? ఏమో వేచి చూడండి.

స్వాతి వానకోసం ముత్యపు చిప్పల్లాగా రాష్ట్ర బడ్జెట్‌కోసం రైతులు ఆశతో ఎదురు చూశారు. రు. 8,589 కోట్లు నీటిపారుదల శాఖకు కేటాయించి ఇదంతా వ్యవసాయానికే, పొమ్మన్నారు. అబ్బ! డబ్బుల్తో నీళ్ళొస్తే ఎంత బావుంటుంది? ఈ ప్రాజెక్టుల నిర్మాణం ఎప్పుడు పూర్తి అవుతుంది? ఎప్పుడు నీళ్ళు వస్తాయి? ఎత్తిపోతల పథకాలు వస్తే గిస్తే రెండేళ్ళ తర్వాత అందివస్తాయి.

రైతుకి పండించిన పంటల గిట్టుబాటు ధరకి, మార్కెట్టులో పలుకుతున్న ధరకి ఉన్న వ్యత్యాసం వల్లనే రైతులు గడ్డి కరుస్తున్నారు. ఇటువంటి వ్యత్యాసాన్ని తగ్గించడానికి రైతులకి నేరుగా మద్దతు ఇచ్చే ప్రతిపాదన గానీ, దానికి తగిన నిధులుగాని బడ్జెటులో కాగడా పెట్టి వెతికినా కనిపించలేదు. ఏదో అతి కష్టంమీద కొన్ని పంటలకి- (వరి, గోధుమ) మాత్రం కనీస మద్దతు ధర అదీ కేంద్ర ప్రభుత్వం కేటాయింపు మేరకు లభ్యమవుతున్నది. ప్రత్తి, మిర్చి, పసుపు వంటి వాణిజ్య పంటలకు, పప్పుదినుసులకు పంట ముమ్మరంగా వచ్చి ధర పడిపోతే ఆదుకునే దిక్కుండదు. లోగడ చెప్పినట్లు అసలు పంటే రాకపోతే బీమా కంపెనీలు ఎక్కడ ఉన్నాయో కనిపించవు. ఇదండీ! వ్యవసాయానికి సాయం! *

# పేటెంట్ చట్టానికి మూడో సవరణ

- రాజీవ్ ధావన్

పార్లమెంటులో సరైన పరిశీలన, చర్చ జరగకుండానే భారత పేటెంట్ల చట్టానికి మూడవ సవరణను అమలులోకి తేవడం ద్వారా భారత పాలకవర్గాలు దేశ ప్రజలకూ, ప్రపంచ ప్రజలకూ కూడ ద్రోహం చేశాయి. దోహానమావేశం అనంతరం కట్టుబడి ఉండవలసిన నియమాలకు తిలోదకాలిచ్చాయి.

పేటెంట్లకూ ఔషధాలకూ మధ్య అవినాభావ సంబంధం ఉంది. పేటెంట్లంటే గుత్తాధిపత్యం. ఎయిడ్స్ మందులతో సహా, ప్రాణాంతక వ్యాధులెన్నిటికో ఉపయోగించి ప్రాణాలు కాపాడే ఎన్నో ఔషధాలపై మందుల కంపెనీలకు గుత్తాధిపత్యం ఉంది. ఈ గుత్తాధిపత్యం వల్ల ఈ అత్యవసరమైన మందులకు ధరలు నిర్ణయించడంలో ఈ కంపెనీలు నిష్పూచీగా ఉంటాయి. ఇలా నిర్ణయించిన విపరీతమైన ధరల వల్ల వైద్య సేవలలో ఖరీదయిన మందులు కొనగల వాళ్ళకూ, కొనలేని వాళ్ళకూ మధ్య స్పష్టమైన విభజన రేఖ ఏర్పడుతుంది.

ఈ గుత్తాధిపత్య కంపెనీలు నిర్ణయించే విపరీతమైన ధరలకూ, ఆ మందుల వాస్తవ ఉత్పత్తి వ్యయానికీ ఏమాత్రం సంబంధం లేదనే విషయం ఇబ్బడి ముబ్బడిగా లాభాలు గడిస్తున్న భారత ఔషధ పరిశ్రమతో తేట తెల్లమవుతోంది. సిప్లాకు చెందిన యూసుఫ్ హమీద్ సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలకు, భారతదేశానికి, ఇతర ప్రపంచానికి కూడ ఇప్పటికన్న చౌక ధరలకు, అందుబాటులోని ధరలకు ఎచ్ఐవి మందులు అందించడం సాధ్యమేనని అన్నారు. తాము పరిశోధన, అభివృద్ధి మీద పెట్టిన ఖర్చుల్ని రాబట్టుకునేందుకే హెచ్చు ధరలు నిర్ణయించవలసి వస్తోందని ఈ గుత్తాధిపత్య కంపెనీలు అంటున్నాయి. కాని ఆ కంపెనీలన్నీ తమ పరిశోధన, అభివృద్ధి వ్యయాల మీద ఇప్పటికే పన్ను రాయితీలు పొందాయి. ఆర్థిక సహాయాలు పొందాయి. అయినా తమ వ్యయం తిరిగి సంపాదించే వరకూ పేదలు ఊపిరి బిగబట్టుకుని ఎదురు చూడాలని గుత్తాధిపతులు అంటున్నారు. వైద్యం అందుబాటులోనే ఉంటుంది. కాని పేదలకు మాత్రం కాదు.

భారత విధానం గురించి ప్రకటిస్తూ ఇందిరాగాంధీ 1981 మే 6న "మెరుగైన ప్రపంచం అంటే వైద్య శాస్త్ర అన్వేషణలపై పేటెంట్లు లేకపోవడమే. జీవన్మరణ సమస్యలనుంచి లాభాలు పిండుకునే అవకాశం లేకపోవడమే" అని అన్నారు. మరి ఈ విధానానికి ఏమయిపోయింది? ప్రపంచంలోని పేదల ఆశాజ్యోతిగా, చౌక మందుల సరఫరా దారుగా ఉండిన భారతదేశం ప్రస్తుత గందరగోళంలోకి ఎలా జారిపోయింది?

తనసొంత విధానానికీ, ప్రయోజనాలకూ హానికరంగా భారతదేశం లొంగిపోవడం 1987 నుంచి 1994 వరకూ ప్రపంచ వాణిజ్య సంస్థ సంప్రదింపులలో జరిగిపోయింది. ఈ కీలక సమన్వయను విస్మరించడం, పక్కన పెట్టెయ్యడం జరిగిందని పార్లమెంటు రికార్డులు పదే పదే చూపుతాయి.

ఐకె గుజ్రాల్ నాయకత్వంలో రాజ్యసభ కమిటీ ఒకటి 1993 డిసెంబర్‌లో ఈ విషయాన్ని పరిశీలించింది. "దేశంలోని ఔషధాల ధరలపై ప్రతిపాదిత పేటెంట్లు వేయగల దుష్పరిణామం" పట్ల ఆందోళన ప్రకటించింది. "పేటెంట్‌దార్ల హక్కుల కన్న ప్రజా ప్రయోజనాలే ప్రాథమికమైనవని హామీ ఇవ్వాలి" అని హెచ్చరించింది. కాని ఈ విషయంపై బహిరంగ చర్చ అడ్డుకోబడింది. 1990ల ప్రారంభంలో అర్జున్‌సింగ్ కమిటీ ఇచ్చిన రహస్య నివేదిక రహస్యంగానే ఉండిపోయింది. పేటెంట్ చట్టాలపై జాతీయ వర్కింగ్ గ్రూప్ రానున్న దుష్ప్రభావాలను ఎన్నోసార్లు హెచ్చరిస్తూనే వచ్చింది.

ప్రపంచ వాణిజ్య సంస్థ ఉనికిలోకి వచ్చే సమయానికి, అమెరికా హెచ్చరికలను భారతదేశం తీవ్రంగా ఎదుర్కోవడం లేదు. 1995 నుంచి 2004 వరకు చాల విదేశీ కంపెనీలు 'మెయిల్‌బాక్స్' పద్ధతి కింద తమ ముందస్తు హక్కులను ప్రకటిస్తూ వచ్చాయి. ఈ పద్ధతిలో నమోదయిన పేటెంట్లు 2005 జనవరి 1 నాటికి వాటంతటవే పూర్తిస్థాయి పేటెంట్లుగా మారిపోతాయి.

వామపక్ష పార్టీలు, భారతీయ జనతాపార్టీ అప్పటి ప్రయత్నాలను ఎదిరించినప్పటికీ, 1999లో భారత పేటెంట్ల చట్టానికి మొదటి సవరణ అమలులోకి వచ్చింది. రెండో సవరణ 2002లో అమలు లోకి వచ్చింది. భవిష్యత్తులో సామాజిక అంశాలకు సంబంధించిన సవరణలను అమలులోకి తీసుకురావడం జరుగుతుందని రాజకీయ వాగ్దానం వెలువడింది. కాని మూడో సవరణ బిల్ 2003 లో పరిస్థితిని చక్కదిద్దే సవరణలేవీ భాగం కాలేదు. ఇప్పుడు ఆ బిల్లునే ఏ మార్పులూ లేకుండా, ఎటువంటి చర్చా లేకుండా హడావుడిగా ప్రవేశపెట్టారు. ఈ సవరణను 2005 జనవరి 1 లోపల చేయకపోతే, సానుకూల నిర్ణయాలు చేయలేదని ప్రపంచ వాణిజ్య సంస్థ చర్య తీసుకుంటుందని అటు ప్రపంచ వాణిజ్య సంస్థ, ఇటు అమెరికా భారత ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చాయి.

స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలలో గుత్తాధిపత్యాలకు, అవి పేటెంట్ల పేరుతో ఉన్నా, మరే పేరుతో ఉన్నా, స్థానం లేదనే విషయం సుస్పష్టమే. కాని తన ఔషధ కంపెనీల మార్కెట్లను పరిరక్షించడానికి అమెరికా ప్రభుత్వం కంకణం కట్టుకున్నది. తన పేద ప్రజలను పరిరక్షించడానికి మాత్రం భారత ప్రభుత్వానికి కోరిక కలగడం లేదు. ప్రపంచ వాణిజ్య సంస్థలో ట్రిప్స్ (వాణిజ్య సంబంధ మేధోసంపద హక్కులు) భాగం కావాలా అని డబ్ల్యుటిఓ అనుకూల ఆర్థిక వేత్తలు

జగదీష్ భగవతి, డాని రోడ్రిక్, మైకెల్ ఫింగర్ వాదిస్తున్నారు. ట్రిప్స్‌ను అంగీకరించే ఆదుర్దాలో భారత ప్రభుత్వం మాత్రం తన అంతర్జాతీయ చట్టాలను తానే తుంగలో తొక్కుతోంది.

భారత దేశంలో అమలయ్యే న్యాయ శాస్త్ర సిద్ధాంతాన్ని సంలీన సిద్ధాంతం అంటారు. అంటే భారత ప్రభుత్వం ఒక ఒడంబడిక మీద సంతకం చేసినంత మాత్రాన సరిపోదు. అది చట్టం కావాలంటే ఆ విషయంలో పార్లమెంటు ఒక చట్టం చేయవలసి ఉంటుంది. కాని, డబ్ల్యుటిఓ విధించిన కాలపరిమితులకు తన ప్రజాస్వామిక సంప్రదాయం కన్న ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్న భారత ప్రభుత్వం తన సార్వభౌమాధికారాన్ని పణంగా పెడుతోంది.

ఆ మాటకొస్తే భారత ప్రభుత్వం కేవలం ప్రపంచ వాణిజ్య సంస్థ ఒడంబడిక మీద మాత్రమే సంతకం చేయలేదు. అది అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటన (1948), పౌర, రాజకీయ, ఆర్థిక, సాంఘిక హక్కుల ఒడంబడికల (1966) మీద, అటువంటి మరెన్నో ఒడంబడికల మీద సంతకం చేసింది. సుప్రీంకోర్టు తీర్పుల వల్ల ఎన్నో మానవ హక్కులు, మంచి ఆరోగ్య హక్కుతో సహా, రాజ్యాంగంలోని 21వ అధికరణంలోని జీవించే, స్వేచ్ఛగా ఉండే హక్కులలో భాగమై పోయాయి. మరి ప్రపంచ వాణిజ్య సంస్థ అనేది ఈ హక్కులనన్నిటినీ రద్దు చెయ్యజాలదు.

ప్రతిపాదిత మూడో సవరణను ప్రవేశపెట్టడానికి హడావుడి పడనక్కర లేదు. ఆరోగ్యం, ఆహారం, సాంకేతిక విజ్ఞానం వంటి ఎన్నో అంశాలను తీవ్రంగా, లోతుగా చర్చించిన తర్వాతనే ఆ సవరణను ప్రవేశపెట్టాలి. డబ్ల్యుటిఓ, ట్రిప్స్ ఒప్పందాలను "సభ్య దేశాలకు ప్రజారోగ్యాన్ని పరిరక్షించేందుకు ఉన్న హక్కును, అందరికీ వైద్యాన్ని అందుబాటులోకి తేవడాన్ని ప్రోత్సహించే హక్కును, లభించే ఔషధాలను అందరికీ అందుబాటులోకి తెచ్చే హక్కును, కొత్త ఔషధాలలో పరిశోధన, అభివృద్ధి జరిపే హక్కును సమర్థించే పద్ధతిలో మాత్రమే అమలు చేయాలని" 2001 దోహా డిక్లరేషన్ ప్రకటించింది.

ఎచ్ఐవి-ఎయిడ్స్ సమస్య దానికదిగా మాత్రమే చూడవలసినది కాదు. ఎయిడ్స్‌కు ప్రపంచ వ్యాప్తంగా నాలుగు కోట్లమంది పీడితులున్నారు. ఎయిడ్స్ బారిన పడిన ప్రాంతాల్లో ఆఫ్రికా ముఖ్యమైనది. ఎయిడ్స్ చైనాలోని 31 రాష్ట్రాలకూ పాకింది. భారత దేశంలో దేశ వ్యాప్తంగా ఉంది. అది కేవలం లారీ డ్రైవర్లకు వచ్చే జబ్బు మాత్రమే కాదు, అది ఇంటింటికీ విస్తరించింది. కోస్టారికా, వెనిజ్యులా వంటి దేశాలు ఎయిడ్స్ బాధితులకు మందులు సరఫరా చేయడం ప్రభుత్వ బాధ్యతగా గుర్తించాయి. భారత ప్రభుత్వం కూడ అటువంటి బాధ్యత తీసుకోవలసి ఉంది.

మూడో పేటెంట్ సవరణలో ఏయే అంశాలు చేర్చవలసి ఉన్నదో అక్టోబర్ 2004లో నాలుగో ప్రజాకమీషన్ నివేదిక విస్పష్టంగా ప్రతిపాదించింది. ఆ కమీషన్‌కు నాయకుడు గుజ్రాల్. భారత పేటెంట్ చట్టం 1970 ఒక ఆదర్శవంతమైన చట్టం అనే పునాది మీద ఈ సిఫారసులు సాగాయి. ఆరోగ్యం, ఆహారం, వ్యవసాయం రంగాలను వేరు చేసి, ఈ రంగాలలో పేటెంట్లపై పరిమితులు విధించాలని ఆ చట్టం భావించింది. ఒకవేళ ప్రస్తుతం ఈ రంగాల ఉత్పత్తులకు కూడ పేటెంట్లు ఇచ్చినా, ప్రజా ప్రయోజనానికి అది భంగకరం కాగూడదు. ఇప్పటివరకూ 1970 భారత పేటెంట్ల చట్టం సెక్షన్ 83 సూత్రాలను దెబ్బతీసే సవరణ ఏదీ ప్రవేశ పెట్టబడలేదు. ఈ సెక్షన్ ప్రజా ప్రయోజనానికి రక్షణ కల్పిస్తుంది. పేటెంట్లను పూర్తిగా వ్యాపారం కోసం వాడుకోవడాన్ని నిరసిస్తుంది. మిగిలిన చట్టానికి చేసే సవరణలు ఈ స్ఫూర్తిని రద్దు చేయగూడదు. ముఖ్యంగా దోహా డిక్లరేషన్ తర్వాత ఆ పని చేయగూడదు. ట్రిప్స్‌లో 7,8 అధికరణాలు కూడ ప్రజా ప్రయోజనాలు, ఆరోగ్యం, సాంకేతిక పరిజ్ఞాన వినిమయం అవకాశాలను విస్తృతం చేశాయి.

ఇప్పుడు ప్రభుత్వం మూడో పేటెంట్ల సవరణ కోసం ఎక్కడలేని హడావుడి ప్రదర్శిస్తోంది. కొన్ని ప్రతిపాదనలను చర్చించి, అందులో భాగం చేయవలసి ఉంది. మొట్టమొదట చైనా ఉదాహరణను అనుసరించి ప్రభుత్వం ఒక ప్రతిపాదన చేయవచ్చు. తద్వారా ఒక గుత్తాధిపత్య సంస్థ నిర్ణీత కాలవ్యవధి లోపల ఆమోదించదగిన వ్యాపార పరిమితికి లోబడి ఉత్పత్తి చేయకపోతే, భారతదేశంలో ఆ సంస్థకు ఆంక్షలకు లోబడిన అనుమతి మాత్రమే లభిస్తుంది.

రెండవది, ఇతర దేశాల ఉదాహరణలను అనుసరించి, పేటెంట్ పారితోషికం 4 శాతానికి మించగూడదని ఆంక్ష విధించవచ్చు.

మూడవది, ఔషధ ఉత్పత్తి అనుమతి ప్రధానంగా భారతీయ మార్కెట్‌లో అమ్మకానికే అయినప్పటికీ, ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాల, తగిన ఉత్పత్తి సామర్థ్యం లేని దేశాల మార్కెట్లకు ఎగుమతిని అనుమతించవచ్చు. మూడో ప్రపంచ దేశాలు ఇటువంటి చౌక ఔషధాలను భారత దేశం నుంచి మాత్రమే పొందగలవు.

నాలుగవది, ఔషధ పరిశోధనలో నూతనత్వాన్ని తగ్గించేలా, అన్ని రకాల ఔషధ కలయికలకూ పేటెంట్ ఇవ్వగూడదు.

ఐదవది, మెయిల్‌బాక్స్ పద్ధతి పేటెంట్ల మీద మన పర్యవేక్షణ ఉండాలి.

ఆరవది, మెయిల్‌బాక్స్‌లోని ఉత్పత్తులలో భారత ఔషధ కంపెనీలు ఉంటే 2005 జనవరి 1 న వారిని అర్ధాంతరంగా ఆపి వెయ్యమని అనగూడదు.

ఏడవది, ఏ పదార్థాలపై పేటెంట్ హక్కులు అనుమతించవచ్చు, వేటిపై అనుమతించగూడదు అనే చర్చ ఇంకా జరగాలి.

సామాజిక న్యాయంతో సంబంధం లేని వైద్యం ఆమోదయోగ్యం కాదు. పేటెంట్లంటే ఔషధ కంపెనీలు ఎటువంటి బాధ్యతలు లేకుండా అధికారం చలాయించడానికి పొందే కానుకలు కాగూడదు.

(హిందూలో 2004 డిసెంబర్ 10న అచ్చయిన వ్యాసానికి స్వేచ్ఛానుసరణ)

*

# నక్సలైట్ ఉద్యమం-కొన్ని ఆలోచనలు

-నెల్లూరి కృష్ణమూర్తి

నక్సలైట్ల కు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మధ్య తొలి విడత చర్చలు జరిగాయి. చర్చలకు ముందు, చర్చల సమయంలో గూడ వార్తా మాధ్యమాలు అత్యంత ఉత్కంఠ భరితంగా వార్తలు రాశాయి, చూపాయి. ఉదారవాద ఫలితాలను రెండు చేతులా జుర్రుకుంటున్న ఈ వ్యాపార వర్గాలు, ఈ సమాజాన్నే సంపూర్ణంగా తారుమారు చేయాలనే "శత్రు" సిద్ధాంత ప్రవచకులకు ఇంత ప్రాధాన్యత, వీరోచిత మర్యాదా చేయడం ఆశ్చర్యపరచే విషయమే కాదు, శత్రు పొగడ్తకు గురయ్యేవారు ఆత్మశోధనకు పూనుకొనవలసిన అంశం గూడ. మలి విడత కేవలం మురిపెంగానే ముగిసేలా కనిపిస్తున్నది. తొలివిడత తరువాత ఇరు పక్షాల నుండీ జరుగుతున్న మారణహోమం, విధ్వంసం చూస్తుంటే, ఎవరికి వారు తమశక్తి యుక్తులను గట్టిపరచుకునే ప్రయత్నంలో వున్నారేమోనని పిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వం అఖిల భారత విధానం నుండి, తన పోలీసు బలగాల ద్వారా వర్గ శత్రువులు చేస్తున్న వత్తిడికి గురౌతున్నది. చర్చలు జరగాలనే క్రిందిస్థాయి రాజకీయ శక్తులనుండి వచ్చే వత్తిడికి మూలం ప్రాణభయం తప్ప రాజకీయ విజ్ఞత కాదని తోస్తున్నది.

అలాగే మావోయిస్టుల విధానానికి, ఆంధ్ర నక్సలైట్ల చర్చలు ఆటంకం అయ్యే అవకాశం వుందని కొత్త అఖిలభారత ఉద్యమం గూడ ఆలోచిస్తున్నట్లుంది.

నక్సలైట్ల సమస్య శాంతి-భద్రతల సమస్య మాత్రమే కాదని, అది పేదప్రజల సాంఘిక ఆర్థిక సమస్యతో ముడిపడి వుందని అంతా అంటుంటారు. కాని ఎవరి అర్థం వారికి వుంది. ఏభై సంవత్సరాలు పాలకులకు పేద ప్రజల సాంఘిక ఆర్థిక పరిస్థితులు తెలియవా? "గరీబీహఠావో" ఎన్ని వికృత రూపాలలో ఎన్నికల నినాదంగా మోసపుచ్చింది? ఈ ఏభై సంవత్సరాలలో పాలకవర్గాలు పేదలకు విదిలించింది సాగుకు లాయకైన భూమిలో నూటికి రెండు వంతులు. మరోసారి ప్రారంభమయ్యే భూపంపకాలయజ్ఞ క్రతువులో మరొక డెసిమెల్ పాయింటో, రెండో దక్కవచ్చు. అంతమాత్రాన సమస్య ఎలా పరిష్కారమౌతుంది? 'దున్నేవానికి భూమి' అనేది స్వాతంత్ర్య ఉద్యమంలో గ్రామీణ పేదల నినాదం. కాంగ్రెస్ గాని, మిగతా ఏ పాలక పక్షంగాని దీనిని ఆమోదించలేదు. వివరణ లేని "భూసంస్కరణలు" అనే నినాదం పాలకులది. బంజర్ల నుండి, పాలకవర్గాల "అదనపు భూముల" పంపకం వరకు జరగనిదే భూ యాజమాన్య వ్యవస్థలో పెద్దమార్పు రాదు.

కాబట్టి అటు నక్సలైట్లు, ఇటు ప్రభుత్వం ముందుగా తేల్చుకొని వుండవలసిన అంశం భూ యాజమాన్యంలో ఏ మార్పు ఇద్దరికీ ఆమోద యోగ్యం? అది అమలు జరిపే యంత్రాంగపు స్వరూపం.

ఇది తేలకపోవడమే చర్చల విషయంలో గందరగోళానికి కారణం.

ఈ గందరగోళం మధ్య చర్చల ప్రయోజనాన్ని ఎవరికి వారు వారికి తోచినట్లు చిత్రిస్తున్నారు. మధ్యవర్తులు, ఇతర కమ్యూనిస్టు పార్టీలు గూడ నక్సలైట్ల సమస్య గ్రామాలలో "కోడె దూడల పోరు మధ్య లేగదూడల్లా" కంటికి కునుకు లేకుండా బాధపడుతున్న ప్రజలకు శాంతిని ప్రసాదించడంగా చూస్తున్నారు. ఇరుపక్షాల నుండి కాల్పులు లేకుండా గ్రామ ప్రజలకు ప్రాణభయం, చిత్రహింసల భయం పోవచ్చు. తమను తాము మనుషులమని, బతికే హక్కు వుందని మరచిపోతే తప్ప. ప్రకృతి వనరుల అనుభవంలో అసమానత వున్నంత వరకూ పేదలకు "శాంతి" ఎలా సాధ్యం?

ఈ సందర్భంలో ఇరుపక్షాలు "ఆయుధం" సమస్యను ముందుకు తెస్తున్నారు. గ్రామాల్లో ఆయుధాలతో సంచరించరాదని మూకీ ఒప్పందం కుదిరిందనేది ఒక వాదన. సుమారు 40 సంవత్సరాలుగా ఆయుధమే ఆయుధంగా ఉద్యమం నడిపిన వారికి ఆ ఆయుధం లేకుంటే, భయంతో వున్న భూస్వాములు, వ్యవస్థ కోసమో, వ్యక్తిగతంగానో "కసి" పెంచుకున్న పోలీసు, ప్రభుత్వ వర్గాలు, ఆయుధంలేని నక్సలైట్లను సహించే శాంతి కపోతాలు ఔతారా? ప్రజల చేతిలో ఆయుధాలు కాకుండా, ప్రజలే ఆయుధం కాకుండా సాగే ఉద్యమాలు ఈ దుస్థితిని ఎదుర్కొనక తప్పదు. ఆయుధం స్వాభావిక ఆభరణం కాకుంటే స్వీయ రక్షణే సమస్య ఔతుంది.

అడవుల్లో ఆయుధాలు వుంచుకోవచ్చనే వాదన ఎలా ఆచరణీయం? గ్రామాల్లో వుండే పోలీస్ స్టేషన్లేగదా అడవుల్లో కూంబింగ్ చేస్తున్నది? అడవి ఆకులు, అలములు ఇస్తుంది.అన్నం పెట్టదు. అడవిలో తినేందుకు సంచారాలకైనా వారు గ్రామాలకు రాక తప్పదు. సంచారాలకు వచ్చే వారిని శాంతి దూతలుగా గ్రామ సమాజం

ఆహ్వానిస్తుందా? ఇవి సమాధాన పడలేని పరిస్థితులు.

ఇందుకు మూలం నక్సలైట్ ఉద్యమ ఆలోచనలలోనే వుందని నా అభిప్రాయం. ఈ విషయాన్ని వివరించే ముందు ఒక విషయం స్పష్టం చేయాలి. యువకుడుగా సమ సమాజాన్ని కలగన్న స్వాప్నికుడిని నేను. అందుకు చేయగలిగిన కృషికి అంకితమైనవాడినే. స్వప్నం ఫలించలేదని విలవిలలాడే వృద్ధ హృదయపు ఆవేదన ఇది. తప్పు, ఒప్పులను విశ్లేషించగల, తీర్పులు చెప్పగల సమర్థతను నాకు, నేను ఆపాదించుకోదలచుకోలేదు. అదే సమయంలో ఉద్యమానికి నాయకత్వం వహించే వారే సర్వజ్ఞులని తలవంచేందుకు సంసిద్ధుడిని కాదు. ఎందువల్లనంటే మన ఆలోచనలనుండి విప్లవాలు తలెత్తవు. పరిస్థితుల నుండి ప్రారంభమౌతాయి. సామాజిక క్రమంలో తలెత్తే విభిన్న విషయాలలో ప్రాధాన్యతాక్రమాలను నిర్ణయించి, పరిష్కార మార్గాలను చెప్పి, ఒప్పించడం నాయకత్వ బాధ్యత. చరిత్రను నిర్మించేది మాత్రం ప్రజలే. నాయకత్వంగాని, త్యాగాలకు సిద్ధమయ్యే దళాలుగాని, వారి చేతిలోని ఆయుధాలుగాని ప్రజలకు ప్రత్యామ్నాయం కాదు.

విప్లవకారుడు ఆయుధాన్ని వదలడు అనే అర్థంలో మావోయిస్టు ప్రతినిధులు చేసే ప్రకటనలు కళాహృదయాల కవితానినాదం కావచ్చుగాని మార్క్సిజమూ కాదు. జీవితానుభవమూ కాదు. ఆత్మరక్షణకో, దాడికో దొంగ, ఫ్యాక్షనలిస్టు గూడ ఆయుధం పడతాడు. ఆయా వ్యవస్థలను కాపాడే ప్రత్యేక బాధ్యతలు పొందే ఉద్యోగులు ఆయుధం పట్టి, సాయుధ దళాలనే పేరే పెట్టుకుంటారు. ఇలాంటి ఆయుధాలు విప్లవ సాధనాలు కావు. దౌర్జన్య సాధనాలు మాత్రమే. అలాగే దళాలకు మాత్రమే పరిమితమైన ఆయుధాలు, దళరక్షణ సాధనాలే తప్ప విప్లవ సాధనాలు కావు.

ఆయుధం పట్టడం విప్లవ సమయంలోనే ననడం సరికాదు. చేను దగ్గర, చెట్టు దగ్గర వచ్చే తగాదాలలో భూస్వాములకో, పెత్తందార్లకో వ్యతిరేకంగానే గాక, ప్రజల మధ్య తగాదాలలో సహితం రాయో, రప్పో, కర్రో వాడతారు. అవి ఘర్షణ సాధనాలు అయినప్పుడు ఆయుధాలు కావా? విస్తారమైన ప్రాంతంలో పాక్షిక కోర్కెల కోసం ప్రజలు ఆయుధం చేపడితే అదీ సాయుధ పోరాటమేనని కామ్రేడ్ స్టాలిన్ సలహాతో రూపొందిన "ఎత్తుగడలపంథా" స్పష్టంగా విశదీకరించింది. ఆ పత్రాన్ని గతంలో సి.పి.ఐ., ఈ మధ్య కాలంలో సి.పి.ఐ(యం) తోసిపుచ్చినట్లు మాత్రమే నాకు తెలుసు.

అందువల్ల చర్చలకు "ఆయుధం" అంశాన్ని కీలకం చేసి "శాంతి" కాముకులను తమపక్షం చేసుకోవాలని, నక్సలైట్ ఉద్యమం ఏర్పడిననాడు ప్రధాన సమస్యగా పేర్కొన్న సామాజికాంశాలను మరుగు పరచాలనేది ప్రభుత్వం చేపట్టిన మార్గం. ఆ వలలో ఉద్యమ కారులు తమ మాటల ద్వారా గాని, చేతల వల్లగాని చిక్కుకొనడం మంచిదా అనేది వారు ఆలోచించవలసిన అంశం. పట్టిన ఆయుధం దించరాదనేది మహాభారతసూక్తి. ఆయుధం పట్టేందుకు, అవసరాన్ని, సందర్భాన్ని బట్టి దింపి, తిరిగి చేపట్టడం ప్రజలహక్కు. ఒకసారి ఆయుధ విసర్జనకు అంగీకరించడం అంటే నిరాయుధీకరణను జిరాయితీ హక్కుగా రాసివ్వడం కాదు. ఆయుధం సిద్ధాంత చర్చకాదు. ఎత్తుగడలలో శాశ్వత అంశమూ కాదు. ఒకానొక కోరికను సాధించుకునేందుకు స్వపర బలాబలాలను బట్టి రూపొందించుకునే పోరాట రూపంలో భాగమే. హింస, అహింసల సమస్యను సైద్ధాంతిక స్థాయికి తెచ్చేందుకు గాంధీజీ ప్రయత్నించారు. ఆ సిద్ధాంత చర్చలలో కూరుకొని భారత కమ్యూనిస్టు ఉద్యమ విస్తరణకు ఎనలేని కృషి చేసిన ఎం.ఎన్.రాయ్ అదే సమయంలో దేశమంతటా సాగుతున్న సాయుధ రైతాంగ పోరాటాలలో భాగస్వామిగా ఉద్యమాన్ని రూపొందించలేక పోయారు. ఆ పొరపాటు ఈనాడు పునరావృతం కానవసరం లేదు.

కాని ఈ వ్యాసం ప్రారంభంలోనే ఈనాడున్నది నక్సలైట్ల ఆలోచనల సమస్య అన్నాను. ముప్పైఏడు సంవత్సరాల క్రితం కమ్యూనిస్టు ఉద్యమంలో ఒకభాగం నక్సలైట్లుగా రూపొందినప్పటి ఆలోచనల గురించి ఇప్పుడు పరామర్శ అనవసరం. నక్సలైట్ ఉద్యమ స్వీకారంతో కమ్యూనిస్టు ఉద్యమం భారతదేశంలో, దేశ పరిస్థితులను గురించి మూడు అంచనాలతో, మూడు తరహాల పరిష్కారంతో మూడు విభాగాలు అయింది.

ఏ ఒక్క భాగంగాని విప్లవాన్ని జయప్రదం చేయలేకపోయింది. కాబట్టి చరిత్ర ఏ అంచనానూ, ఏ పరిష్కారాన్నీ ఆమోదించలేదు.

ఆయాపార్టీల నాయకులు అంగీకరించినా, లేకున్నా, ఉద్యమ శ్రేయోభిలాషులంతా అంగీకరించి ఎదుర్కోవలసిన పచ్చి నిజం. సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) కలవాలనే నినాదంగాని, బేషరతుగా సి.పి.ఐ. తమలో విలీనం కావాలనే సి.పి.ఐ.(యం) పిలుపుగాని, మొత్తంగా ఉద్యమం విఫలమైందనే విషయం గుర్తింపుకు ప్రత్యామ్నాయం కాజాలదు.

ఫ్యూడల్, పెత్తందారీ ప్రభుత్వ విధానం కన్నా బూర్జువా ప్రజాస్వామ్యం మెరుగైంది. మార్క్సిజం అంగీకరించింది అంతవేరకే.

శ్రామిక వర్గ హక్కులకు పోరాడే స్వేచ్ఛకు అవకాశం వుంటుందనే అర్థపు పరిమితిలో మాత్రమే వారు ఆ మెరుగుదలను ఆహ్వానించారు. చారిత్రకంగా బూర్జువా పార్లమెంటరీ పద్ధతులకు కాలం చెల్లిందన్నారు. దీని అర్థమేమిటి? బూర్జువా పార్లమెంటరీ విధానం వ్యూహ సమస్యగా గాక, ఆయా దేశాలలో గల పరిస్థితులననుసరించి చేపట్టాల్సిన ఎత్తుగడల సమస్యగా మాత్రమే మార్క్సిస్టు సిద్ధాంత వేత్తలు పరిశీలించారు. "రాజ్యాంగయంత్రం-విప్లవం", "వామపక్ష పిడివాదం-ఒక బాల్యారిష్టం" అన్న లెనిన్ రచనలను సందర్భ శుద్ధితో చదివితే నిష్పాక్షికులకు తెలిసేనిజం ఇదే. మూడవ అంతర్జాతీయ సంస్థ పార్లమెంటరీ కార్యకలాపాల విషయమై అంగీకరించిన తీర్మానం చెప్పేది అదే.

బూర్జువా వర్గ పాలనను, అది సృష్టించిన పాలనా వ్యవస్థను కూల్చడం, ప్రత్యామ్నాయ వర్గ పాలనను సమకూర్చడం కమ్యూనిస్టుల లక్ష్యం. సిద్ధాంతరీత్యా భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని అన్ని విభాగాలు ఆమోదించాయి. కాని సి.పి.ఐ., సి.పి.యం.లు అధికారయుత ఆచరణ, అందుకు సంబంధించిన తీర్మానాలు ఈ బూర్జువా పాలనా వ్యవస్థ మత మౌఢ్యపు బారిన పడకుండా కాపాడే మహత్తర కర్తవ్యం తమ భుజస్కంధాలతో మోయవలసిన స్థితికి ఇంతకాలం తరువాత ఎందుకు చేరారు? కనీసం ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకు తమ ఆత్మరక్షణకు హామీ ప్రాతిపదికగా తమకు బలంగల ప్రాంతాలలో పోటీపడే వారిలో ఎవరినో ఒకరిని గెలిపించే మూకీ ఒప్పందాలకు నక్సలైట్లు పూనుకుంటున్నట్లు వార్తలు, ఆరోపణలు వస్తున్నాయి. వాటిని నక్సలైట్లుగా ఖండించినట్లు నేను గమనించలేదు.

సిద్ధాంతరీత్యానే పార్లమెంటరీ మార్గాన్ని ఎంచుకుంది సి.పి.ఐ.

పార్లమెంటరీ కార్యకలాపాలను, ఒక పోరాట రూపంగా ఆమోదించినట్లు సి.పి.ఐ.(యం) నాయకత్వం ఆనాడు వివరణ ఇచ్చింది. ఏ వర్గానికి ప్రాతినిధ్యం వహించే పార్టీలో పేర్కొనకుండా, బహుళ పార్టీల రాజకీయ వ్యవస్థను విప్లవానంతరం ఆమోదిస్తున్నామని తాజాపరచిన కార్యక్రమంలో పేర్కొన్నారు.

ఆ విధంగా బూర్జువా వర్గ పాలననే గాదు, అందులో కొన్ని బూర్జువా పార్టీలు చొరబడకుండా కాపలాకాచే స్థితికి, సుమారు నాలుగు దశాబ్దాల విభిన్న కార్యక్రమాలు చేరుకున్నాయి.

మూడు కార్యక్రమాలు, మూడు ఎత్తుగడలు గూడ విఫలమైనాయనేందుకు ఇది గుర్తుగా నేను భావిస్తున్నాను. నా అభిప్రాయం తప్పైతే సవరించుకునే నమ్రత వుందని హామీ ఇస్తున్నాను.

సి.పి.ఐ. కార్యక్రమంలో విప్లవం అనేదే లేదని ఆనాడు మార్క్సిస్టు నాయకులు వ్యాసాలు రాశారు. విప్లవంపట్ల అంకిత భావానికి 1951లో ఉద్యమం ఆమోదించిన "ఎత్తుగడల పంథా" చూపిన మార్గాన్ని ఆమోదించడమే గీటురాయిగా ప్రకటించుకున్నారు. రెండవ చీలిక అనంతరం జరిగిన 8వ కాంగ్రెస్‌లో "ఎత్తుగడల పంథా"ను కార్యక్రమానికి అధికారయుతంగా అనుబంధంగా ప్రకటించారు. 1970లలో ఎదుర్కొన్న సెమీ ఫాసిజం తరువాత, అత్యవసర పరిస్థితి అనంతరం ఏర్పడిన పరిస్థితిలో అనుసరించిన ఎన్నికల ఎత్తుగడలకు అనుగుణ్యంగా ఎత్తుగడల పంథాకు కొత్త అర్థం చెప్పారు. తాజా పరచిన కార్యక్రమం తరువాత, "ఎత్తుగడల పంథా" ఆ పార్టీ కార్యక్రమానికి అనుబంధంగా ప్రచురించడం లేదు. దీనినుండి ఎవరి నిర్ణయాలు వారు తీసుకోవచ్చు.

సిద్ధాంతరీత్యాను, ఆచరణలోను విప్లవానికి అంకితమై వున్నామని నక్సలైట్లు చెపుతున్నారు. వారు వేరు పడేందుకు చెప్పిన వాదం ఏమిటి? భారతదేశం అర్థవలస-అర్థఫ్యూడల్ వ్యవస్థ అనేది చిత్రణ. వారు ఈ నాటికీ అదే అభిప్రాయంతో వున్నారా? గడచిన 40 సంవత్సరాలలో దేశంలో వచ్చిన మార్పులేమిటి? వాటిని వారు ఎలా అంచనా వేస్తున్నారు? సామాజిక సంబంధాలలో వచ్చిన మార్పులేమిటి? ఏ ఉత్పత్తి సంబంధాలు, ఏ ఉత్పత్తి విధానం ఈ మార్పులకు కారణం? (మార్పులే లేవని వాదిస్తే వాటి నిజానిజాలను జీవితానుభవం నుండి ఉద్యమ శ్రేయోభిలాషులంతా పరిశీలించుకోవచ్చు).

వారు తమ పాత చిత్రీకరణను మార్చుకోవలసినన్ని మార్పులు వచ్చాయని నేను దృఢంగా నమ్ముతున్నాను. అలాంటి మార్పులను పాఠకుల దృష్టికి తెస్తున్నాను. ఉద్యమ శ్రేయోభిలాషులు ఈనాటి భౌతిక పరిస్థితులకు అనుగుణ్యంగా కమ్యూనిస్టు ఉద్యమం ఏ మార్గం చేపడితే ప్రజా జీవితం విముక్త మౌతుందో ఆలోచించేందుకు తోడ్పడాలనేదే ఈ రచన ఉద్దేశ్యం. అది చక్కని చర్చకు దోహదం చేసినా ప్రయోజనం నెరవేర్చినట్లే.

-2-

భారతదేశం ప్రజా బాహుళ్యం దృష్ట్యా గ్రామీణ భారతమే. ఆధారపడే ప్రజలసంఖ్య రీత్యా వ్యవసాయక దేశమే. వ్యవసాయానికి మూలమైన భూయాజమాన్యం దృష్ట్యా భూమి కేంద్రీకరణ కొనసాగుతూనే వుంది. భూమే లేని వారి, లేదా కుంటా,సెంటూ వుండే వారి సంఖ్య పెరుగుతూ వుంది.

ఈ వ్యత్యాసాలు, పుట్టిన కులంతో ముడిపడివుండడం గత సమాజపు లక్షణంగా కొనసాగుతున్న దుష్ట సాంప్రదాయం. భూమి తమ భుక్తికి ఏదో ఒక మేరకు గ్యారంటీ కలిగిస్తుందని పేదలు ఈ నాటికీ ఆశిస్తున్నారు. ప్రభుత్వ యంత్రాంగానికి విజ్ఞప్తులు సమర్పించుకుంటూనే వున్నారు. కులం బలంతో ఎదుగుతున్న గ్రామీణ అధికార కేంద్రాల చుట్టూ ప్రదక్షణలు చేస్తూనే వున్నారు.

వారు సమీకృతులై పోరాడడం లేదు. బూర్జువా పార్టీలు ఏవీ, ఓట్ల సమీకరణలో భాగంగా తప్ప, గ్రామీణ జీవితంలోని సామాజిక మార్పులకు ఆధారంగా భూమి పంపకం కీలకమనే ఆర్థికాంశాన్ని ఏనాడూ ఆమోదించలేదు.

భారతదేశ పారిశ్రామికీకరణ అవకాశాలకోసం మహోలనబీస్ ప్రణాళికను రూపొందించారు. ఇందుకు దేశంలో జరిగిన అనేక రైతాంగ పోరాటాలు, ముఖ్యంగా తెలంగాణా సాయుధ పోరాటం భూమిక. మొదటి వయోజన ఓటింగ్‌లో కాంగ్రెస్ ఓటమి మరొక కారణం. ఆహార సమస్య, పారిశ్రామికీకరణకు అవసరమైన వనరులు, మార్కెట్‌లను విస్తరించాలనే కోరిక. అందుకే మొదటి ప్రణాళికలో సేద్యపు నీటివనరులపెంపు, ప్రభుత్వ బంజర్లు, యాజమాన్యంపై సీలింగ్, తద్వారా లభ్యమయ్యే భూమి అంచనాలు వేశారు. ప్రణాళికాయుత అభివృద్ధిని నామమాత్రంగా మాత్రమే భూస్వామిక వర్గాలు ఆమోదించాయి. సాగునీటి వసతుల కల్పనకు, అందుకు కేంద్ర ప్రభుత్వ కేటాయింపులకు పచ్చజెండా ఊపిన రాష్ట్ర ప్రభుత్వాలు, వనరుల సమీకరణకు నిరాకరించాయి. భూస్వాముల నుండి ప్రొక్యూర్‌మెంట్‌ను నిరాకరించాయి. కేంద్రంలో వ్యవసాయ శాఖను నిర్వహించిన మంత్రులు ఈ విషయంలో నెహ్రూను సహితం ధిక్కరించారు. ఆహార ధాన్యాల దిగుమతిపైనే పట్టణ ప్రజలకు ఆహార ధాన్యాలు అందించే ప్రయత్నాలు చేశారు. దేశ భూస్వామిక వర్గాలు పెట్టుబడిదారీ పారిశ్రామికీకరణకు సాగే ఆకాంక్షలను అడ్డుకునేందుకు ప్రణాళికా సంఘాన్ని వేదికగా చేసుకున్నారు. నెహ్రూ మరణానంతరం రాష్ట్రాలస్థాయీ నాయకులు లాల్‌బహదూర్ శాస్త్రిని పీఠమెక్కించారు. ఆయన ప్రణాళికాసంఘాన్నే నిర్వీర్యంచేశాడు.

ఏభై నుండి అరవయ్యవదశకం వరకు పాలకపక్షాలలోని రెండు వర్గాల మధ్య ఆధిపత్య పోరు సాగింది. పాలక పక్షాలతో మధ్య జరిగే పోరును కమ్యూనిస్టు ఉద్యమం సక్రమమంగా అంచనా వేసివుంటే, భారత ప్రజాతంత్ర విప్లవపు రెండవదశకైనా నాయకత్వం వహించగలిగి వుండేది. ఆ విధంగా పేదలను సమీకరించవలసిన ఉద్యమం సిద్ధాంత విభేదాలతో మరొకసారి అవకాశాన్ని వినియోగించుకోలేక పోయింది.

లాల్‌బహదూర్‌శాస్త్రి మరణానంతరం ఇందిరాగాంధీని తమ చెప్పుచేతలలో వుండే ప్రధానిగా ఆశించి ఆవిష్కరించింది సిండికేట్ నాయకత్వమే. ఈ ఘర్షణలో దేశం మరొక సంక్షోభంలో కూరుకుంది. భూమి పంపకం లేనందున విస్తరించని మార్కెట్ మూలంగా పారిశ్రామికీకరణకు వనరులు కరువైనాయి. విదేశీ అప్పులు, ద్రవ్యోల్బణ నిధులతో సాగుతుందనుకున్న పారిశ్రామికీకరణ ఒకదశకు చేరుకుని సంక్షోభ భరితమైంది. ద్రవ్యోల్బణంతో పెరిగిన ధరలతో ఆహార కొరత తోడై పట్టణ ప్రజలు ఆహార పోరాటాలు సాగించారు. అప్పుడే భూమి పంపకం ద్వారా కాక, సాంకేతిక నైపుణ్యం వ్యవసాయాభివృద్ధి సాగాలనే ఫోర్డ్ ఫౌండేషన్ విధానాన్ని ఇందిరాగాంధీ ప్రభుత్వం చేపట్టింది. రాజభరణాల రద్దు, బ్యాంకుల జాతీయకరణల రూపంలో, మరొకసారి సీలింగ్ చట్టాల ఏర్పాటు పేర సాంప్రదాయక భూస్వామిక పెత్తనాన్ని దెబ్బతీసింది. సాగుకు రసాయనిక ఎరువులు, అభివృద్ధి చెందిన విత్తనాలు, వ్యవసాయ సీజన్ విధించే పరిధులను అధిగమించేందుకు యంత్రాలు, పెరిగే ఉత్పత్తి ఖర్చులకు డబ్బు, మార్కెట్ అనేవి కీలకమైనాయి. వ్యవసాయ ఖర్చులో పారిశ్రామిక రంగానికి చెల్లించే వ్యయం భాగం విపరీతంగా పెరుగుతున్నది. పాల ఉత్పత్తి, చేపల ఉత్పత్తి, కోళ్లు, బాతులు, జీవాల పెంపకం వంటివి (ఒక్క పాల ఉత్పత్తి మాత్రం వికేంద్రీకృతమై వుండగా) క్రమేపి మార్కెట్ కోసం, పెట్టుబడిదారీ పద్ధతులలో ప్రవేశించాయి. అడవుల ఉత్పత్తులు గిరిజనుల మనుగడకు ఆధారంగా వుండే స్థితి నుండి కాంట్రాక్టర్ల సొత్తుగా, ప్రభుత్వానికి ఒక ఆదాయ వనరుగా మారాయి. గ్రామీణ సంపద ఉత్పత్తిలో, వ్యవసాయంలో గూడ భూమి ఒక ఉత్పత్తి కారకంగా తన పూర్వ వైభవం కోల్పోతోంది. మానవ శ్రమ స్థానం యంత్రాలు ఆక్రమిస్తున్నాయి.

గ్రామీణ ప్రాంతాల పంటల ప్రభావం నుండి పారిశ్రామిక రంగం విముక్తమైందని చంకలు ఎగరేసిన ఆర్థికశాస్త్రవేత్తలు, వస్తూత్పత్తి పరిశ్రమ పెరుగుదలకు గ్రామీణ సంపద పెరుగుదల పాత్రను తిరిగి అంగీకరిస్తున్నారు.

నష్టాల జాతీయోత్పత్తి వంటి మాయలెక్కలు వదిలేస్తే, నిజమైన సంపద సృష్టిలో, ప్రజల బ్రతుకులకు ఆధారంగా వుండడంలో వ్యవసాయ రంగ ప్రాధాన్యత తగ్గలేదు. వ్యవసాయ ఉత్పత్తులకు వినిమయదారు చెల్లించే ఖరీదులో వ్యవసాయం వ్యవసాయదారుడు

పొందేది 10-15 శాతం మించడం లేదు. గ్రామీణ సాంప్రదాయక అంగళ్లు లేవు. పారిశ్రామిక వస్తువులతో షాపులు వెలుస్తున్నాయి. ఆనాటి వృత్తులు లేవు. చేతి వృత్తులవారు పట్టణాలకు వలసలు పోతున్నారు. ఇతర పేదలు గ్రామాల్లోనే జీవిస్తున్నా వృత్తి కోసం పట్టణాలకు వెళ్లేవారు, గ్రామాలే వదలి బిల్డింగ్ వర్క్సులో కూలీలౌతున్న వారు పట్టణాలలో కనపడే దృశ్యం. ఆహార అవసరాలకోసం ప్రభుత్వ సరఫరాల మీద గ్రామీణులు ఆధారపడడం, వ్యవసాయం కన్నా, ప్రభుత్వ వ్యయంతో కలిగించే వ్యవసాయేతర పనిదినాలు శ్రామికులకు జీవనాధార మౌతున్నాయి. తరుగుతున్న ఈ వనరు సహితం, కాంట్రాక్టర్లు తెచ్చే యంత్రాలు మింగేస్తున్నాయి. ఇదంతా గ్రామ జీవితం డబ్బుమయం, ఆ విధంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతిలో అంతర్భాగమైందనేందుకు చిహ్నం కాదా?

వనుల కరువుతో వంటపాలు కౌలుకాక, డబ్బు ప్రవేశించింది. తనకు గల కుంటా సెంటూ భూమిలో ఉత్పత్తి పెంచుకునే తపనతో చిన్నరైతాంగం అప్పుల పాలౌతున్నది. ఏ చిన్నపాటి వడిదుడుకులకూ తట్టుకోలేని ఈ వర్గం ఆత్మహత్యలకు పూనుకున్నది.

ఈ మార్పులకు స్వీకారం చుట్టిన సమయంలో కమ్యూనిస్టు ఉద్యమం చీలింది. తప్పొప్పుల మాట అలావుంచుదాం. ఆనాడు భూమి సమస్యను లేవనెత్తిన గిరిజనోద్యమాలు, బెంగాల్ ప్రభుత్వ భూపంపక కార్యక్రమం కేంద్ర ప్రభుత్వ పైశాచిక దాడికి గురైనాయి. దీనితో ఈ మార్పులలో బాధపడే ప్రజలకు నాయకత్వం లేకుండా పోయింది. అగచాట్ల బ్రతుకు తప్పదు గనుక ఉపశమనం వెతుక్కుంటూ ప్రజలు బూర్జువా కాంబినేషన్ల మధ్య చీలిపోయారు. ఎన్నికలు, వాటితో వచ్చే మార్పులే తమను కడతేర్చగలవనే భ్రమలకు ప్రజలు లోనౌతున్నారు.

కేవలం భూ యాజమాన్యంలో తేడాలను చిత్రించడం వ్యవసాయక రంగంలో వస్తున్న మార్పులకు దర్పణం కాదని, గ్రామీణ జీవితంలో సమూలంగా తలెత్తి, పెరిగే ఉత్పత్తి విధానాన్ని అంచనా వేయాలని వ్యవసాయరంగంపై తన బృహత్ రచనలలో మార్క్సిస్టు మేధావులకు ప్రబోధించారు లెనిన్.

దేశంలో వ్యవసాయాభివృద్ధిలో అసమానతలువున్నాయి. అసమాన అభివృద్ధి పెట్టుబడిదారీ విధాన లక్షణం. దోపిడీకి అత్యంత హీనమైన సాంప్రాదాయక రీతులను పెట్టుబడిదారీ విధానం స్వంతం చేసుకుంటుంది. నీగ్రోల బ్రతుకులలో వివక్షత, మహిళా కార్మికుల పని పరిస్థితులలో వ్యత్యాసాలు పెట్టుబడిదారీ విధానంలోనూ దోపిడీ రూపాలుగా కొనసాగుతున్నాయి. అంతమాత్రాన ఆ విధానాన్ని అర్థ ఫ్యూడల్ విధానంగా అభివర్ణించలేము.

ఒక పుస్తకమంత వివరాలలోకి పోయి మనం అధ్యయనం చేయవచ్చు. రష్యన్ వ్యవసాయంలో పెట్టుబడి దారీ విధానం 600 పేజీల పైచిలుకు గ్రంథం రాశారు లెనిన్. అమెరికన్ వ్యవసాయం పరిశీలన మరొక పుస్తకం. ఆనాటికి వ్యవసాయం పెట్టుబడిదారీ విధానంలోకి పరివర్తన చెందేందుకు జర్మన్, అమెరికన్ మార్గాలను రెండు మార్గాలుగా ఆయన పేర్కొంటూ, మార్గాలు వేరైనా ఫలితాల సారం ఒకటేనని రుజువు చేశారు. తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న పెట్టుబడిదారీ విధాన కాలంలో కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు మరొక తరహాలో వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానాన్ని ప్రవేశ పెట్టాయి.

ఈ మార్పు వాస్తవం అని అంగీకరిస్తే, గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో అడ్డగోలుగా ఎదుగుతున్న, సంక్షోభ భరితమైన, ప్రజల బ్రతుకునే ప్రశ్నార్థకం చేస్తున్న సంపన్నుల రాజ్యాన్ని కూల్చే కార్యక్రమం ఎలా వుండాలని చర్చించుకోవచ్చు.

కాని సమాజంలో ప్రధాన వైరుధ్యాన్ని గుర్తించడంలో ఏకోన్ముఖంగా కృషి చేయడంలో కమ్యూనిస్టు ఉద్యమం ఈ దేశంలో జయప్రదం కాలేదు.

1930లలో బ్రిటిష్ ప్రభుత్వం సృష్టించిన జమిందారీ వ్యవస్థలో కౌలుదార్లు పోరాడారు. ఆ పోరాటాలను అధికారయుతంగా కాంగ్రెస్ నిరుత్సాహపరచింది. దానిని ప్రధాన వైరుధ్యంగా పార్టీ భావించి కేంద్రీకరించలేదు. ఫలితంగా దేశంలో దాదాపు మూడవ వంతులో సాగుతున్న పోరాటాలకు నాయకత్వం వహించలేకపోయింది.

1942లో ప్రజలలోగల సామ్రాజ్యవాద వ్యతిరేకత స్థానంలో ప్రపంచంలో పెరుగుతున్న ఫాసిస్టు ప్రమాదం కీలకంగా భావించి నష్టపోయింది. స్వాతంత్ర్యానంతరం చర్చలు వినా కార్యక్రమం లేదు.

1960ల చివరిలో ఏర్పడిన మూడు అంచనాలు జయప్రదం కాలేదు. 35 సంవత్సరాలు ఒకజాతి జీవితంలో తక్కువ కాదు. జయాపజయాలను అంచనా వేసేందుకు తక్కువకాలమూ కాదు.

భారత కమ్యూనిస్టు ఉద్యమం ఆత్మావలోకనం చేసుకోగలిగితేనే ప్రజలలో పెరిగే అసంతృప్తి, పెరుగుతున్న పోరాటాలకు ఒకదారీ తెన్నూ చూపగలవు. మరొకసారి 'మేమేం చెప్తే అదే నిజం, మేమేం చేస్తే అదే విప్లవం' అనే ఆలోచనలతో అవకాశం పోగొట్టుకోరనే ఆశిద్దాం. *

# పోలియో నిర్మూలనా కార్యక్రమం పచ్చి బూటకం

-వెన్నెలకంటి రామారావు

దేశ వ్యాప్తంగా 1995 నుండి నేటి వరకు ప్రతి సంవత్సరం పల్స్‌పోలియో ఇమ్యునైజేషన్ కార్యక్రమం (పి.పి.ఐ. ప్రోగ్రాం) నిరాటంకంగా కొనసాగుతూనే వుంది. పెద్ద ఎత్తున ప్రచార ఆర్భాటంతో మొదలవుతున్న ఈ పోలియో నిర్మూలనా కార్యక్రమం ద్వారా పసిపిల్లలలో పోలియో వ్యాధి నిరోధక శక్తి పెంపొందకపోగా పోలియో వ్యాధి బారిన పడడానికి ఈ నోటి మందు పోలియో వ్యాక్సిన్ (ఒపివి-చుక్కలమందు) ఒక వాహికగా ఉపయోగపడుతున్నది. దేశంలో నానాటికి పెరిగిపోతున్న పోలియో కేసులు ఇదే విషయాన్ని రుజువు చేస్తున్నాయి.

2000 సంవత్సరానికల్లా భారతదేశాన్ని పోలియో రహిత దేశంగా మారుస్తామని పాలకులు 1995లో ప్రకటించిన దరిమిలా నేటికి తొమ్మిదేళ్ళ పోలియో నిర్మూలనా కార్యక్రమం ద్వారా వ్యాధి నిర్మూలన జరగకపోగా, అది మరింత ఉధృతమైంది. ప్రారంభంలో తగ్గుముఖం పట్టినట్లుగా కన్పడినా పోలియో వ్యాధి 2002లో ఉపద్రవంగా విరుచుకుపడింది. 2003 నాటికి పోలియో వ్యాధిలేని ప్రాంతాలకు సైతం వ్యాపించింది. ప్రపంచ వ్యాప్తంగా నమోదవుతున్న పోలియో కేసుల్లో మన దేశం వాటా 85 శాతం ఉందని ప్రపంచ ఆరోగ్యసంస్థ యునిసెఫ్‌లు వెల్లడించాయి. ప్రపంచంలో 7 దేశాలలో (ఆఫ్ఘనిస్తాన్, ఈజిప్టు, నైజర్, నైజీరియా, పాకిస్తాన్, సోమాలియా, ఇండియా) పోలియో వైరస్ విలయతాండవం చేస్తోంది. పోలియో రహిత ప్రపంచాన్ని సృష్టించాలని ఊదరగొడుతున్న ప్రపంచ ఆరోగ్య సంస్థ, యూనిసెఫ్‌లు కోటాను కోట్ల రుణంతో కూడిన నోటిమందు పోలియో వాక్సిన్ కార్యక్రమాన్ని చురుకుగా అమలు జరిపి, పోలియో రహితమైన దేశాలుగా ప్రకటించబడ్డ ఉత్తర నైజీరియా, బెనిన్, బర్కినాఫాసో, కామెరూన్, సెంట్రల్ ఆఫ్రికా రిపబ్లిక్, ఛాద్, ఘనా, టోగో, ఐవరీకోస్టు- ఎనిమిది దేశాలలో పోలియో మహమ్మారి తిరిగి విజృంభించింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్ర ప్రాంతాలైన ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలు 1975 నాటికి పోలియో వ్యాధిని పూర్తిగా తరిమివేశాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ పొలిమేర ప్రాంతాలైన వ్యవసాయక దేశాలు, మరీ ముఖ్యంగా ఉష్ణమండల దేశాలలో ఈ వ్యాధి తరచు విపత్తుగా విరుచుకుపడుతోంది. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, పర్యావరణం లాంటి అనేక విషయాల్లో ఉత్తరార్ధ గోళ పారిశ్రామిక దేశాల కూటనీతికి బలైనట్లుగానే పోలియో వ్యాధి నివారణ విషయంలో కూడా దక్షిణార్ధ గోళ వ్యవసాయక దేశాలు బలైపోతున్నాయి.

పోలియో నివారణకు వాడబడే వాక్సిన్‌లు శరీరంలోని రోగ నిరోధక వ్యవస్థలో వ్యాధి కారక క్రిముల్ని తిప్పికొట్టేందుకు తోడ్పడే ప్రతిఘటన శక్తిని అభివృద్ధి చేస్తాయి. పోలియో మృతవైరస్‌ను, నిర్వీర్యమైన పోలియో వైరస్‌ను ఉపయోగించి, 1950లలో జోనాస్‌సాల్క్ అనే శాస్త్రవేత్త సూదిమందు పోలియో వాక్సిన్‌ను అభివృద్ధి చేయగా, 1960లో బలహీనపడిన, సజీవమైన వైరస్‌ను ఉపయోగించి అల్బర్ట్ సబీన్ నోటిమందు పోలియో వాక్సిన్‌ను తయారుచేశారు. ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది పిల్లలకు పోలియో వాక్సిన్ వేయాల్సిన పరిస్థితులలో, ముఖ్యంగా దక్షిణార్ధ గోళ వ్యవసాయక దేశాలలోని మౌలిక వైద్య సదుపాయాల లేమి, ఇంజెక్షన్ వేయగల్గే శిక్షణ పొందినవారు కనీస మాత్రంగా లేని పరిస్థితులలో నోటిమందు పోలియో వాక్సిన్‌కు అధిక ప్రాధాన్యత వచ్చింది. నోటిమందు వాక్సిన్ కుటుంబంలో ఏ ఒక్కరికి వేసినా మిగిలిన అందరికీ వ్యాధి నిరోధకంగా పనిచేసే ప్రయోజనం వుంది కాబట్టి, ఒకరికి మాత్రమే పనిచేసే సూదిమందు పోలియో వ్యాక్సిన్ వాడకాన్ని వదిలేయడం జరిగింది. అదే సమయంలో నోటిమందు వాక్సిన్ ఒక డోసుకు రు. 3 చొప్పున మొత్తం 5 డోసులకు రు. 15 లు మాత్రమే ఖర్చవుతుంది. సూదిమందు ఒకడోసుకు రు. 450 చొప్పున మూడు డోసులకు రు. 1350 ఖర్చు అవుతుండడంతో, ప్రపంచ వ్యాప్తంగా ఆయా ప్రభుత్వాలు చేపట్టే వైద్య సేవలకు తక్కువ ఖర్చు దృష్ట్యా నోటిమందు పోలియో వాక్సిన్‌ను ఎంచుకోవడం జరిగింది. దాంతో ఉత్తరార్ధగోళ పారిశ్రామిక సంస్థలు లక్షల డాలర్ల పెట్టుబడులు పెట్టి నోటిమందు వాక్సిన్‌ను ఉత్పత్తిచేసి సొమ్ము చేసుకుంటున్నాయి. ప్రకృతి సిద్ధమైన పోలియో వైరస్‌ను ఎదుర్కొనేందుకు బలహీనపడిన, సజీవమైన వైరస్‌తో కూడిన నోటిమందు వాక్సిన్ మొదట్లో వ్యాధి నిర్మూలనలో మంచి ఫలితాలనిచ్చింది. కొంతకాలానికి నోటిమందు వాక్సిన్‌లోని బలహీనమైన సజీవమైన వైరస్ వెనక్కి జన్యుమార్పిడికి గురై తీవ్రంగా దాడి చేసింది. అనేక పోలియో రహిత దేశాలు పోలియో విపత్తులను చవి చూశాయి. దాంతో అమెరికా క్రమంగా 1999 నాటికి నోటిమందు పోలియో వాక్సిన్ వాడకాన్ని పూర్తిగా నిషేధించింది. అభివృద్ధి చెందిన ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలన్ని (దాదాపు 25 దేశాలు) నోటిమందు వాక్సిన్ వాడకాన్ని నిషేధించాయి.

ఖరీదైనప్పటికీ, సురక్షితమైనట్టి, సాపేక్షికంగా స్థిరమైనట్టి, ప్రమాదరహితమైనట్టి, మృత వైరస్‌లతో తయారైన సూది మందు పోలియో వాక్సిన్‌ను వాడాలని నిర్ణయించాయి. హంగేరి, ఇజ్రాయిల్, క్రొయేషియా, ఉక్రెయిన్‌లాంటి 11 దేశాలు రెండు రకాల వాక్సిన్‌లను వినియోగిస్తుండగా, దక్షిణార్ధగోళ వెనుకబడిన వ్యవసాయక దేశాలన్నీ ప్రమాదకరమైన నోటిమందు పోలియో వాక్సిన్‌నే వాడుతున్నాయి.

ఉత్తరార్ధగోళ పారిశ్రామిక దేశాలకు సూదిమందు వాడకాన్ని సిఫార్సు చేసిన ప్రపంచ ఆరోగ్య సంస్థ, దక్షిణార్ధ గోళ వ్యవసాయక దేశాలకు (వర్ధమాన దేశాలకు) నోటిమందు పోలియో వాక్సిన్‌ని కట్టబెట్టడంలో దురుద్దేశం వుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ వెనుకబడిన దేశాలలో సూదిమందు వాడకాన్ని, ఉత్పత్తిని అడ్డుకోవడమే కాకుండా, పరిశోధన సైతం చేయకూడదని ఆ దేశాల మందుల పరిశ్రమల్ని ఆదేశించింది. "పాశ్చాత్య దేశాలు 1995 లోనే ఓ.పి.వి. ని సాగనంపడం మొదలు పెట్టాయి. సరిగ్గా అదే సమయంలో పేద దేశాలలో ఓ.పి.వి. కి కొత్త వ్యాపారాన్ని వెతికి పెట్టడంలో యునిసెఫ్ ద్వారా ప్రపంచ ఆరోగ్య సంస్థ తలమునకలైంది" అని వెల్లూరుకు చెందిన ప్రముఖ వైరాలజిస్ట్ జాకబ్‌జాన్ పేర్కొన్నారు. "పదవీ విరమణ అనంతరం ఇటువంటి సంస్థలలో పనిచేయాలని భారతీయ వైద్యాధికారులలో చాలా మంది ఉవ్విళ్ళూరుతుంటారు. అటువంటి వారు ఆ సంస్థల అడుగులకు మడుగులొత్తడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా వుంటున్నారు" అని హైదరాబాద్‌కు చెందిన ప్రముఖ శాస్త్రవేత్త భార్గవ చెప్పారు. ఈ నేపథ్యంలో 1988లో ఢిల్లీ సమీపాన గల గుర్‌గాంవ్‌లో 70 కోట్ల రూపాయల ఖర్చుతో సూదిమందు పోలియో వాక్సిన్ ఫ్రాన్స్ కంపెనీ పాశ్చర్-మెర్యూక్ సహకారంతో కేంద్ర ప్రభుత్వం నిర్మించాలనుకున్నప్పటికీ, ఆ ఫ్రాన్స్ కంపెనీ కెనడా దేశపు మరో కంపెనీలో విలీనం కావడంతో ఆ ప్రతిపాదనను గాలికొదలి, అమెరికా, ఫ్రాన్స్, రష్యాల నుంచి నోటిమందు పోలియో వాక్సిన్‌ను దిగుమతి చేసుకోవాలని నిర్ణయం చేశారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ పూర్తి ప్రమేయంతోనే ఈ మార్పు జరిగింది. ఉత్తరార్ధ గోళ పారిశ్రామిక దేశాల అమానవీయ, స్వలాభేక్షకు సాధనంగా ప్రపంచ ఆరోగ్య సంస్థ పనిచేస్తూ, దక్షిణార్ధగోళ వ్యవసాయ దేశాల పట్ల వివక్షత ప్రదర్శిస్తోంది.

మన దేశంలో ప్రతి ఏటా జన్మిస్తున్న 2 కోట్ల 50 లక్షల మంది పిల్లలకు చెందిన పోలియో నిర్మూలన కార్యక్రమం ఒక మృత్యు పంపిణీ కార్యక్రమంగా మారింది. విదేశీ పారిశ్రామికుల ముష్టికి సాగిలపడే మనదేశ పాలకులు. బడా పారిశ్రామికులు మన పిల్లల భవిష్యత్తును అంధకారంలోకి నెడుతున్నారు. 5000 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి భావితరాలపై నోటిమందు పోలియో మహమ్మారిని ఎగదోస్తున్నారు. నోటిమందు పోలియో వాక్సిన్ పిల్లల నోట్లో పడేంతవరకు శీతలీకరణలో (-8 డిగ్రీల సెంటీగ్రేడ్) లో ఉంచాలి. మనలాంటి దేశాలలో ఈ సంరక్షణ సాధ్యం కాదు. మందు వినియోగాన్ని సరిగా నిర్వహించినా, నిర్వహించకపోయినా, వాక్సిన్ ప్రేరేపిత పోలియో వ్యాధి వచ్చే ప్రమాదం వుంది.

నోటిమందు పోలియో వాక్సిన్‌లోని సజీవమైన వైరస్ నాడీ మండలాన్ని క్షోభింపచేసి పక్షవాత సంబంధమైన పోలియోను గాని; దాంట్లో వాడే ఈస్ట్రోడయోల్ అనే హార్మోన్ వంధ్యత్వం కల్గిస్తుందనీ పునర్జన్యుమార్పుడికి గురైన పోలియోను గాని కల్గించే అవకాశం వుందని రుజువైంది. కొన్ని సందర్భాలలో అంధత్వం కల్గిస్తుందని అరబ్ దేశాల వైద్య నిపుణులు హెచ్చరిస్తున్నారు. ముస్లింల జనాభాను ఉద్దేశ్యపూర్వకంగా తగ్గించేందుకు అమెరికా నాయకత్వానగల క్రిస్టియన్ దేశాలు కుట్ర పన్నుతున్నాయని నైజీరియా లాంటి దేశాలు పోలియో వాక్సిన్ వాడకాన్ని నిషేధించాయి. ఇటీవల చుక్కల మందు ఉపయోగించడం వలన పసిపిల్లల ప్రాణాలకు ముప్పువాటిల్లిన సంఘటనలు దేశ వ్యాప్తంగా వెలుగు చూస్తున్నాయి. 2004 మే 9 న కరీంనగర్ జిల్లా భీమదేవరపల్లి మండలం మాణిక్యాపూర్ గ్రామంలో పల్స్ పోలియో చుక్కలు వేయడంతో రెండు నెలల పసిబాలుడు మృతి చెందాడు. ప్రతి ఏడు ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో విజృంభించే ఈ వ్యాధి ఎక్కువగా ఉత్తరప్రదేశ్‌లో కనబడుతోంది. తర్వాత వరస క్రమంలో బీహార్, హర్యానా, రాజస్తాన్, గుజరాత్‌లు వుంటాయి. ఒక్క మీరట్ నగరంలో గత 9 సంవత్సరాలలో 18 సంవత్సరాల లోపు వయసు వారు 3500 మంది పోలియో బారిన పడ్డారు. గత 3 సంవత్సరాలుగా పోలియో రహిత రాష్ట్రంగా ప్రకటించబడ్డ ఆంధ్రప్రదేశ్‌లో గత సంవత్సరంలో 21 పోలియో కేసులు కర్నూలు, అనంతపురం, కడప, ప్రకాశం జిల్లాల్లో నమోదైనాయి. ప్రకృతి సిద్ధమైన వైరస్‌నుండి, వాక్సిన్ ప్రేరేపిత వైరస్‌ల నుండి సంక్రమించే పోలియో వ్యాధుల్ని అరికట్ట గలిగితేనే పోలియో నిర్మూలన ఉద్యమం విజయవంతమైనట్లుగా గుర్తించాలి.

తొమ్మిది సంవత్సరాల కాలం సుదీర్ఘంగా నోటిమందు పోలియో వాక్సిన్ కార్యక్రమాన్ని కొనసాగించినప్పటికీ మందులోని వైరస్ క్రిముల ద్వారా పోలియో వస్తుంది. ఒకవేళ ఈ వాక్సిన్ వేసే కార్యక్రమం నిలిపివేసినట్లయితే వాక్సిన్ పునర్జన్య మార్పిడితో మరింత తీవ్రంగా విరుచుకుపడుతుంది. మన పాలకుల నిర్లక్ష్యానికి, స్వార్ధపరత్వానికి, క్రూరత్వానికి, కుటిలత్వానికి పల్స్‌పోలియో కార్యక్రమమే ఒక తార్కాణం. నూటికి నూరుశాతం క్షేమకరమైన సూదిమందు పోలియో వాక్సిన్ ఇవ్వడం ద్వారా, దానిరక్షణలో

నోటి మందు వాక్సిన్ ప్రభావాన్ని నిర్వీర్య పరచడం ద్వారా మాత్రమే కోట్లాది మంది పసిపిల్లల్ని భయంకరమైన పోలియో వ్యాధి ఉపద్రవం నుండి రక్షించుకోగలం. నోటిమందు వాక్సిన్ వేసిన వారికి, వెయ్యనివారికి సైతం సూదిమందు పోలియో వ్యాక్సిన్ ఇచ్చి, దేశాన్ని రక్షించుకోవాలి. కొత్తగా పుట్టే పిల్లలకు ట్రిపుల్ వ్యాక్సిన్‌తో పాటు కలిపి సూదిమందు పోలియో వ్యాక్సిన్ ఇవ్వడం వలన మంచి ఫలితాలు కల్గుతాయని జాకబ్‌జాన్ సూచించారు.

అమెరికా అధినాయకత్వాన గల ఉత్తరార్ధగోళ పారిశ్రామికాధిపతులు తయారుచేసిన నోటిమందు పోలియో వ్యాక్సిన్ ప్రమాదకరమని రుజువై నిషేధించబడటంతో, ఆర్థిక సంక్షోభంలోకి వాళ్ళు జారిపోయారు. ఆ పరిశ్రమాధిపతుల ప్రయోజనాల కొరకు ఐక్యరాజ్య సమితి సంస్థలైన ప్రపంచ ఆరోగ్య సంస్థ, యునిసెఫ్‌ల ద్వారా మనలాంటి పేద దేశాలపై ఆ విషపు మందును రుద్దుతున్నారు. అమెరికా చేతిలో కీలుబొమ్మలుగా మారిన ఈ వెనుకబడిన దేశాల పాలకులు వాస్తవాలను పూడ్చిపెట్టి, పోలియో నిర్మూలనా కార్యక్రమం ముసుగులో నీతిమాలిన పోజులు కొడుతున్నారు. విదేశీ పారిశ్రామికుల లాభాపేక్షకు స్వదేశంలోని పసిపిల్లల ప్రాణాలను పణంగా పెట్టడం అత్యంత దారుణం.

దేశ వ్యాప్తంగా పల్స్‌పోలియో పై పెద్ద ఎత్తున ప్రచారం సాగించడం ద్వారా తమ పిల్లలను పోలియో మహమ్మారి నుండి రక్షించుకోవాలనే తపనతో ఆదివాసి, బడుగు, బలహీన వర్గాల ప్రజలు అధికశాతం ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. అత్యంత ప్రమాదకరమైన ఈ మందు ద్వారా అంగవికలురు గాను, అంధులుగాను వికలజీవులుగానూ, మారిపోతే రెక్కలు తప్ప ఆస్తులు లేని ఈ ప్రజలకు దిక్కెవరు?

నోటిమందు పోలియో వాక్సిన్ అయోగ్యతను వైద్య నిపుణుల ద్వారా బహిర్గత పరచాలి. అదే సమయంలో నూరుశాతం ప్రామాణికత కల్గిన సూదిమందు పోలియో వాక్సిన్‌ను, ట్రిపుల్ యాంటిజన్ వాక్సిన్‌తో పాటు కలిపి దేశంలోని అందరు పిల్లలకు వేయాలి. నోటి మందు పోలియో వాక్సిన్‌ను బహిష్కరించి, నిషేధించేందుకు ప్రభుత్వాన్ని ప్రజలంతా వొత్తిడి చేయాలి. పల్స్‌పోలియో మాయనాటకం పాత్రధారులైన మన దేశ పాలకులను, సూత్రధారులైన ఉత్తరార్ధగోళ పారిశ్రామికాధిపతుల దురాశాపూరిత దుష్ట విధానాలను ప్రజలందరం కల్సికట్టుగా ఎదుర్కొని, దేశాన్ని రక్షించుకుందాం!

(రచయిత పర్యావరణ కార్యకర్త, ఫ్రీలాన్స్ జర్నలిస్టు. నోటిమందు పోలియో వాక్సిన్ విషయంలో ప్రభుత్వ విధానాన్ని సవాలు చేస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యం దాఖలు చేశారు)

*

**(25వ పేజీ తరువాయి )**

2. పన్నుల రాబడే ప్రభుత్వానికి ముఖ్యమైన ఆదాయ వనరు. 2004-05 బడ్జెట్‌లో మొత్తం వ్యయంలో పన్నుల రాబడి రు. 3,17,733 కోట్లు అంటే 66.5 శాతంగా వుంది. తక్కువ పన్ను రేట్లు, 10% స్థాయిలో వున్న పన్నులు-జి.డి.పి. నిష్పత్తి వల్ల పన్నుల రాబడి తగ్గు స్థాయిలో వుండి ప్రభుత్వాలు కష్టాలు పడుతున్నాయి. లాభపడుతున్నది మాత్రం కార్పొరేట్ రంగమే.
3. పన్నుల రేట్లను, ముఖ్యంగా కార్పొరేట్ ఆదాయపు పన్ను, వ్యక్తిగత ఆదాయపు పన్ను, కస్టమ్స్ రేట్లను పెంచి పన్ను-జి.డి.పి.నిష్పత్తిని రెట్టింపు చేస్తే పన్నుల రాబడిని కూడా రెట్టింపు చేయవచ్చు. ఈ అదనపు రాబడిలో వ్యవసాయం, నీటిపారుదల, గ్రామీణాభివృద్ధి, ఉపాధికల్పన, విద్య, ఆరోగ్యం, సంక్షేమాలపై వ్యయాలను గణనీయంగా పెంచవచ్చు.
4. పన్నుల రాబడిని పెంచడం వల్ల రాష్ట్రాలకు బదలాయింపులు పెరిగి వాటి విత్త సమస్యలు తగ్గుతాయి.
5. రెవెన్యూ లోటును తగ్గించడానికి రెవెన్యూ వ్యయాన్ని తగ్గిస్తున్నారు. అందువల్ల ఉద్యోగాలు, వేతనాలు, పింఛనులు తగ్గించబడుతున్నాయి. యూనివర్సిటీలు, కాలేజీలు, బడులలో వేలాది ఉపాధ్యాయ పోస్టులు, ఆస్పత్రులలో డాక్టర్లు, వ్యవసాయ శాఖలో విస్తరణాధికారుల పోస్టులను ఖాళీగా వుంచడంతో అవి సరిగా పనిచేయడం లేదు.
6. రెవెన్యూ వ్యయాన్ని తగ్గించడానికి రాయితీల శాతాన్ని తగ్గిస్తున్నారు. ఆహారం, ఎరువులపై రాయితీలు తగ్గితే వ్యవసాయాభివృద్ధి కుంటుబడి ఆహారభద్రత లోపిస్తుంది.
7. ప్రభుత్వాల పన్నుల రాబడులు తక్కువగా వుండి వనరుల కొరత ఏర్పడి దానిని పూరించడానికి ప్రభుత్వరంగ సంస్థలలో పెట్టుబడులను ఉపసంహరించి వాటిని ప్రైవేటీకరిస్తున్నారు.
8. వనరుల కొరత వల్ల ప్రభుత్వాలు అధిక రుణాలను సేకరిస్తున్నాయి. అందువల్ల రుణభారం, వడ్డీ చెల్లింపుల భారం, ద్రవ్యలోటు పెరిగిపోతున్నాయి. ఒకవైపు పన్నులను తగ్గించాలనీ, మరోవైపు ద్రవ్య లోటును తగ్గించాలనీ పరస్పర విరుద్ధ విధానాలను అమలు జరుపుతున్నారు.

ఇప్పుడు చిదంబరంగారి బడ్జెట్ దిశ ఎటువుందో స్పష్టమే కదా. ఈ బడ్జెటే కాక, 1991 నుండి వస్తున్న బడ్జెట్‌లూ, వాటిలోని విత్త సంస్కరణలు కార్పొరేట్ రంగానికి పెద్దపీట, గ్రామీణ బీద, బలహీన, మధ్యతరగతుల ప్రజలకు తాయిలాలు మాత్రమే పంచుతున్నారు.

*

# అమెరికా ఉద్ధృత వైఖరి తగ్గేనా?

-ఆర్.వి.ఆర్.
చంద్రశేఖరరావు

జార్జిబుష్ రెండవ తడవ అధ్యక్ష పదవిని చేపట్టిన సందర్భంగా ఇదివరకటి విధానాలలో మార్పులు వచ్చే అవకాశాల గురించి ప్రస్తావించడం సమంజసం. మార్పులు రావచ్చునని, విధాన పదవిలో మోతాదుతత్వం చోటు చేసుకోగలదనే ఆశలు కలగడం సహజమే. ఇదివరకటి విధానాలపై ప్రపంచ వ్యాప్తంగా విమర్శలు, ఇరాక్‌లో సాధించిన ధ్యేయాలు లోపభూయిష్టంగానే అమలు పరచబడడం, అక్కడి అమెరికా, బ్రిటన్ సైన్యాల పైశాచిక ప్రవర్తన సిగ్గు చేటుకి కారణమవడం, ఐక్యరాజ్యసమితిలో ఏర్పడిన అలజడి, వంటి పరిణామాలవల్ల, వాషింగ్‌టన్ విధానాలలో మార్పు వచ్చే సూచనలు కనబడుతున్నాయనే అభిప్రాయం కొందరు వ్యక్తం, చేస్తున్నారు. ఇది ఎంత మేరకు జరుగుతుందన్నది సందేహం.

బుష్ తన పదవీ స్వీకార సందర్భంలో చేసిన ప్రసంగాలు చిలక పలుకుల లాగా తీయగానే సాగాయి. ఆదర్శప్రాయమైన భావాలను వ్యక్తం చేసారు. ప్రపంచశాంతి చేకూరాలంటే స్వేచ్ఛ, స్వాతంత్రం, ప్రజాస్వామ్యం వ్యాప్తి కావాలని, అమెరికా ధ్యేయం చారిత్రాత్మకంగా ఇదేనని. దాని సాధనే తన తక్షణ కర్తవ్యమని పునరుద్ఘాటించారు. ఈ లక్ష్య సాధనలో ఇతర దేశాలతో కలిసి పనిచేస్తామని చెప్పారు. ఆఫ్ఘనిస్తాన్‌లోనూ, ఇరాక్‌లోనూ ప్రజాస్వామ్య వ్యవస్థలకు అంకురార్పణ జరిగిందని సగర్వంగా ప్రసంగించారు. విసురులను, పౌరుష వాక్యాలను మోతాదులోనే ఉంచారు. అణ్వస్త్ర విసర్జన, నియంత్రణ విషయంలో ఇరాన్, ఉత్తర కొరియాలను తీవ్రంగా విమర్శించారు. చైనాలో మానవహక్కుల పరిరక్షణ ఇంకా చేకూరలేదని వాపోయారు. అరబ్-ఇజ్రాయిల్ సమస్యకు మిత్ర దేశాల చొరవ, సహకారంతో పరిష్కారానికి అన్ని విధాల కృషి చేస్తుందని హామీ ఇచ్చారు.

ఐతే లాంఛనప్రాయమైన విధాన ప్రకటనలు మామూలుగానే ఈ శైలిలోనే ఉంటాయి. అటువంటిది, బుష్ వంటి నైజం గల వ్యక్తి యొక్క మనోభావాలను ఈ ప్రసంగాల ఆధారంగా అంచనా వేయడం కష్టతరం. మాటలెలాగున్నా, చేతలెలాగుంటాయో అన్న అనుమానం ప్రపంచ దేశాలలో పలుచోట్ల పోలేదు.

బుష్ "కాబినెట్" లో ఇది వరకున్న కదనకుతూహలకారులు ఇప్పుడు కూడ అధికారంలో ఉండడమే కాకుండా, మరింతగా పాతుకుపోయారు. రక్షణ సలహాదారుగా ఉన్న కొండొలిసారైస్ ఇప్పుడు విదేశాంగమంత్రిత్వాన్ని సంతరించుకున్నారు. రక్షణ మంత్రిగా డోనాల్డ్ రమ్స్‌ఫెల్డ్ ఆ పదవిలోనే కొనసాగుతున్నారు. ఇరాక్‌పై యుద్ధానికి ముందు, తదుపరి ఇరాక్‌లో ప్రత్యామ్నాయ ఏర్పాట్లను సిద్ధం చేయడంలోనూ ఘోరంగా విఫలమైనా, అమెరికా సైనికుల పైశాచిక ప్రవర్తనలు లోకమంతటా భయాందోళనలకు గురిచేసినా, తనను ఇసుమంతైనా లెక్క పెట్టేదే లేదన్నట్లు, బుష్ రమ్స్‌ఫెల్డ్‌ను వదులుకోలేదు. ఇక ఉపాధ్యక్షుడుగా దిక్‌చీనీ తెరవెనుక నుండి తనశైలి రాజతంత్రాన్ని కొనసాగిస్తున్నారు.

ఇంతేకాక ఇతర ఉన్నతస్థాయి నియామకాలలో కూడా సౌమ్యతా ధోరణులు కనిపించడం లేదు. ఐక్యరాజ్యసమితికి అమెరికా రాయబారిగా జాన్‌బోల్టన్ అనే వారిని నియమించడం ఇందుకొక నిదర్శనం. ఆయన ఇదివరలో ఐక్యరాజ్య సమితి ఉనికినే శంకించిన వ్యక్తి. అటువంటి వారిని రాయబారిగా వేయడం ఐక్యరాజ్య సమితికే చెంపపెట్టు.

ఈ పోకడల ప్రభావం విధాన పుటములులో ఎలాగుంటుందని ఊహించడం కష్టం. ఇదివరలో బుష్ మూడు దేశాలను దుష్టత్రయంగా వర్ణించారు. ఇవి ఇరాక్, ఇరాన్, ఉత్తర కొరియాలు. దుష్ట శిక్షణాపరంగా తన ఏక పక్ష ధోరణిలో ఇరాక్‌ను స్వాధీనం చేసుకొన్నారు. ఇక మిగిలిన రెండు దేశాల మాట ఏమిటి?

ఇరాన్‌లో, ఇరాక్ పయనం పునరావృతమవుతుందా? ఇరాన్ విషయంలో కూడా అమెరికా అభియోగాలు చాల మేరకు ఇరాక్‌పై అభియోగాల లాగే రూపొందాయి. అణ్వాస్త్ర విసర్జనలో ప్రపంచాన్ని తప్పుదోవ పట్టించి అంతర్జాతీయ అణుశక్తి మండలి పర్యవేక్షణాధికారులను మభ్యపెట్టి, వారి విధుల నిర్వర్తనలో అనేక ఆటంకాలను కలిగించిందని, అణ్వస్త్ర సాధనకై నిరంతరం కృషి చేస్తూనే ఉందని అమెరికా పదేపదే నెపాలను వల్లెవేస్తూనే ఉంది. ఇరాన్ ఇదివరలో అణ్వస్త్ర నల్ల మార్కెట్టు నుండి పాకిస్తాన్ అణుశాస్త్రవేత్త అబ్దుల్ ఖాదిర్ ఖాన్ సహకారంతో అణ్వస్త్ర రహస్యాలను, కీలక భాగాలను సమకూర్చుకున్న విషయం లోక విదితమే.

ఇరాన్ విషయంలో వ్యూహం తాజాగా ఉంది. ఇరాక్‌ను అణుపరిశోధన విషయంలోనూ, ఇతర సామూహిక విధ్వంసక

రసాయనిక, జీవ సంబంధమైన శస్త్ర తయారీపై తప్పు పట్టి, ఎట్టకేలకు ఐక్యరాజ్యసమితినే త్రోసి రాజని సైన్య చర్యతో ఆక్రమించుకుంది. ఇటువంటి పంథానే ఇరాన్ విషయంలో అమెరికా అనుసరించనున్నది. అయితే, కొన్ని కీలకమైన మార్పులను చేస్తున్నది కూడాను. వీటిని కొంతవరకు వివరించాలి.

అణుశస్త్ర వ్యాప్తి నిరోధకసంధి ప్రకారం, అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు ఉపయోగించడం తప్పుకాదు. ఈ మూల సూత్రం గత 50 సంవత్సరాల నుండి గుర్తించడమైనది. శాంతికోసం అణు పరిజ్ఞానం సూత్రాన్ని అమెరికా ఆ నాటి అధ్యక్షుడు ఐసన్‌హోవర్ కాలంనుండి ఒక అంతర్జాతీయంగా అంగీకరించబడి, 1968లో కుదుర్చుకున్న అణ్వస్త్ర నిరోధక సంధికి అంతర్గత సూత్రంగా పరిగణించబడుతూంది. ఆ సంధిని ఆమోదించిన సభ్యులలో ఒకరైన ఇరాన్‌కు ఈ హక్కు ఉండనే ఉందని గుర్తించాలి. అణుశక్తి రియాక్టర్ల పరిశోధనలో విద్యుత్‌చ్ఛక్తి ఉత్పత్తికి కావలసిన ఇంధనమైన ప్లుటోనియమ్ ఉత్పత్తి అవుతుంది. ఆధునిక విద్యుత్ ఉత్పత్తిలో ఇది సాధారణ పద్ధతిగానే పరిగణించబడుతోంది. శాంతియుత ప్రయోజనాలకోసం రియాక్టర్లలోనుండి సేకరించిన ప్లుటోనియమ్‌ను అణుబాంబుల తయారీకి వినియోగించడం లక్ష్మణరేఖను దాటడమే అవుతుంది. సాంకేతిక అంశాలలోనికి వెళ్లకుండా చెప్పాలంటే, ప్లుటోనియమ్‌ను విద్యుత్ ఉత్పాదనకు గాని, ఇతర శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే వినియోగిస్తున్నారా లేదా అనే విషయాన్ని అంతర్జాతీయ అణుశక్తి సంస్థ నియంత్రణ చేస్తుంది.

ఇరాన్ సందర్భంలో ఈ అంశాలలోనే అనుమానాలు, ఆరోపణలు వచ్చాయి. వీటిని ఆసరాగా తీసుకొని అమెరికా వినూత్నమైన షరతులను ప్రవేశ పెడుతూందని ఇరాన్ ఆరోపిస్తూంది. తన ప్లుటోనియంను కేవలం విద్యుత్ తయారీకే ఉపయోగించు కొంటున్నానని అణ్వస్త్ర నిరోధక సంధి ప్రకారం ఇది తనకు హక్కని ఇరాన్ వాదన.

ఈ విషయంలో అమెరికా ప్రముఖమైన యూరోపియను ప్రభుత్వాలు జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటన్‌ల సమర్థనను పొందగలిగింది. ఇరాన్ అణుశక్తి ప్రక్రియలలో అంతర్జాతీయ సమాజాన్ని పెడదారి పట్టిస్తున్నది కనుక, నియంత్రణ కొరకు కొత్త షరతులకు అంగీకరించాలని. ఈ షరతులు అణ్వస్త్ర నిరోధక సంధికి వ్యతిరేకం కావని అమెరికా, యూరోపియన్ రాజ్యాల వాదన. అయితే రష్యా మాత్రం ఇరాన్‌పై కఠినమైన చర్యలకు సుముఖంగా లేదు. అయినా కూడా కీలకమైన యూరపు దేశాల మద్దత్తుతో ఇరాన్‌పై ఉరి కుచ్చును బిగించబోతూంది.

అణుసంధిని కొత్తగా నిర్వచించడంలో కొత్త మెలికలను అమెరికా సృష్టిస్తోందనే అనుమానం రాకమానదు. ప్లుటోనియమ్ తయారీ, దాని వినియోగంలో అనుమానాలు వచ్చినప్పుడు, సరికొత్త షరతులను ప్రవేశపెట్టడం ప్రస్తుత నిర్వచనా సరళికి భిన్నంగా వెళ్లడమే అవుతుంది. అయినా అమెరికా ఈ మార్గాన్నే అనుసరించబూనింది. ఇరాన్‌ను ఏదో విధంగా తప్పుబట్టి, దోషిగాను, భ్రష్ట రాజ్యంగాను పరిగణించడానికే అణ్వస్త్ర సంధిని తన కనువైన సడలింపు రీతులలో అన్వయించి, కొత్త షరతులను విధించి, వేధించడానికే అమెరికా వ్యూహాన్ని పన్నడం జరిగుండవచ్చు. యూరప్ మద్దత్తు ఈ వ్యూహాన్ని సులభ సాధ్యం చేస్తున్నది.

ఈ సందర్భానికి వేరొక నేపథ్యం కూడా లేకపోలేదు. అది ఉత్తర కొరియా సమస్య. ఆదేశం కూడా అణుసంధిపై సంతకం చేసిన దేశమే. కాని క్రమేణా అనేక విధాలుగా ప్లుటోనియం నియంత్రణా పద్ధతులను, పరిమితులను అతిక్రమించి చివరకు తాను అణుబాంబును సిద్ధం చేసుకున్నానని ఉత్తర కొరియా ఇటీవలే ప్రకటించింది. ఇది వాస్తవమైతే ఉత్తర కొరియాను దోషిగా పరిగణించాలి. ఆదేశం ప్రగల్భాలను పలుకుతున్నదా అన్న అనుమానం కూడా అంతర్జాతీయ వర్గాలలో లేకపోలేదు. ఏది ఎలాగైనా ఈ పరిణామం అమెరికాకు పెద్ద సవాలే. ఉత్తర కొరియా అణుబాంబులను సాధిస్తే, జపాను అణ్వస్త్ర విషయంలో ఉదాసీనత, ఉపేక్షతా భావం అవలంబించదు. ఇతర ప్రాంతీయ దేశాలలో భయాందోళనలు కలుగకమానవు.

ఐతే, ఏది ఎలాగైనా ఉత్తర కొరియాపై అమెరికా ద్వేషభావం ఎంత ఉన్నా, ఆ దేశంపై సైనిక చర్య తీసుకోవడం సాధ్యం కాదు. ఎందుకంటే, చైనా ప్రమేయం లేకుండా ఉత్తర కొరియాపై సైనికంగా ధ్వజమెత్తడం అమెరికాకు గాని, ఐక్యరాజ్య సమితికి గాని దుస్సాధ్యమే. ఆ దేశానికి అణుబాంబే ఉంటే సైనిక చర్యలు ఏ పరిణామాలకు దారి తీస్తాయో ఎవ్వరూ చెప్పలేరు. ఈ జటిలమైన సమస్యను నయానో, భయానో, సంప్రదింపుల ద్వారానో పరిష్కరించుకోవలసిందే.

ఉత్తర కొరియా నేపథ్యం, ఇరాన్ సమస్యను తీవ్రం చేసింది. ఇరాన్ అణ్వస్త్ర సాధనా చర్యలను వెంటనే అరికట్టక పోతే, ఇరాన్ ఉత్తర కొరియా దిశగా పయనించే అవకాశం ఎంతైనా ఉందని అమెరికా ఆందోళన. ఈ కారణంగా ఇరాన్ విషయంలో అమెరికా సాహసపూరితమైన చర్యలనే తీసుకోవచ్చును.

ఇప్పటికే అమెరికా, యూరప్‌ల ఒత్తిడితో ఐక్యరాజ్యసమితి ఇరాన్‌కు కొన్ని ప్రతిపాదనల నందజేసింది. వీటిలో ఇరాన్‌ను నయాన దారిలోకి తీసుకొని వచ్చేందుకు కొన్ని అంశాలు జతపరిచారు.

అణుశక్తి పరిశోధనలకు, ఇతరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందచేస్తామని హామీ ఇస్తూ ఇరాన్ ప్లుటోనియమ్‌ను మాత్రం కొత్త షరతులతో కూడిన అంతర్జాతీయ నియంత్రణలోనికి తీసుకొని రావాలని ఇరాన్‌ని హెచ్చరించడం జరిగింది. ఇరాన్ యూరప్ దేశాల దౌత్య ఒత్తిడులకు లొంగుతుందా అన్నది తేలవలసి ఉంది. ఇరాన్ ఈ ప్రతిపాదనలు తన సార్వ భౌమత్వానికే భంగకరమైనవని ఒప్పుకొనేది లేదని చెప్పింది. కాని ఈ వైఖరిని కొనసాగించుకోగలదా అన్న ప్రశ్న కొద్ది రోజులలో తేలుతుంది. ఇరాన్ వైఖరి మారకపోతే, అమెరికా ప్రయుక్త ఆంక్షలు తప్పవేమో. సైనిక చర్యలకు కూడా అవకాశముంది.

వెంటనే యుద్ధం వచ్చినా, రాకపోయినా, ఇరాన్‌పై అమెరికా తక్షణ వీక్షణాలు తీవ్రతరం కానున్నవనేది తథ్యం. బుష్ వ్యూహ రచనలో శిక్షార్హ దేశాలలో ఒకటైన ఇరాన్‌పై వేటుకి రంగం సిద్ధమైందన్న మాట. యూరప్ దేశాలు అమెరికాకు సహకారం అందిస్తాయా? ఐక్యరాజ్య సమితి అమెరికా చొరవను కాదనగలదా? ఎంతమేరకు అడ్డుకోగలదు? అనే ప్రశ్నలకు సమాధానాలివ్వలేము.

ఐక్యరాజ్యసమితిలోని ఇతర సభ్యులు తమ ఉదాసీనతలను వదలి అమెరికా ఉధృతపూరితమైన సైనిక చొరవ విధానాల విషయంలో తగిన రీతిని స్పందించాలి. చైనా, రష్యా, ఇండియా, ఇరాన్ విషయంలో సంయుక్తంగా వ్యవహరించవలసిన తరుణమిదే. అణుశక్తి సమస్య విషయంలో ఇప్పటివరకు ఈ దేశాలు ఇరాన్‌ను సమర్థిస్తున్నాయి. ఇరాన్ అణ్వస్త్ర ఒప్పందాన్ని పాటిస్తున్నదని, కొన్ని సందర్భాలు, అంశాల విషయంలో వచ్చిన సందేహాలను దౌత్య పరంగానే సక్రమ మార్గంలోనికి తీసుకొని రావచ్చునని ఈ దేశాల భావన. ఇదివరలో ఇరాక్ ఉదంతంలో ఐక్యరాజ్యసమితి సభ్యులు తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పలేకపోయారు. అప్పుడు ఇండియా వైఖరి చాలా మెతకగానూ, పిరికిగానూ పరిణమించింది. ఇరాన్ విషయంలో ఐక్యరాజ్య సమితి సభ్యులు బాధ్యతాయుతంగా వ్యవహరించవలసి ఉంది.

అణ్వస్త్ర నిరోధక సంధి ఉల్లంఘనను పురస్కరించుకొని ఆంక్షలను, కఠిన చర్యలను తీసుకునే విషయంలో కేవలం చట్టపరమైన రీతిలోనే ఆలోచించి, అంతర్జాతీయంగా కాని, ఏకపక్షంగా కాని సైనిక చర్యలకు దిగినప్పుడు ఇంకొక విషయాన్ని మరువ కూడదు. అణ్వస్త్ర విస్తరణను నిరోధించడంలో, ఆ అస్త్రాలు లేని దేశాలను నిరోధించడం ఎంత అవసరమో, అణ్వస్త్ర దేశాలలో అణ్వస్త్ర నిలువు విస్తరణను నిరోధించడం అంత ముఖ్యమైన అవసరమనే సంగతి గుర్తించాలి. ఇటువంటి విస్తరణకు Vertcal proliferation అంటారు. ఈ నిలువు విస్తరణను నిరోధించడం అతి కీలకమైన నైతిక బాధ్యత. అణ్వస్త్ర విస్తరణ నిరోధక సంధిని కుదుర్చుకునే సందర్భంలో నిలువు విస్తరణ విషయంలో అప్పటికే అణ్వస్త్రాలను సేకరించుకొన్న దేశాలు హామీలను ఇవ్వడం జరిగింది. ఈ హామీలు నైతిక కట్టుబాట్ల కిందే మిగిలిపోయాయి. తదుపరి అణ్వస్త్ర దేశాలు వాటి పాటవాన్ని పెంచుకుంటూనే వచ్చాయి. అమెరికా, రష్యాలు సాయుధ పోటీలో అమీతుమీగా వ్యవహరిస్తూ వచ్చాయి.

రష్యా ప్రభావం, పటిమా తగ్గిన తరువాత గత దశాబ్దిపైగా అమెరికా అస్త్ర శస్త్ర విస్తరణకు అసలు పరిమితే లేకపోయింది. ఆయుధ విసర్జన, నియంత్రణల ఒప్పందాలనుండి తప్పించుకొని, కొన్నింటిని నామకా పాటిస్తూ, అమెరికా ఆయుధ సముపార్జన విరివిగా జరుగుతోంది. అడిగే వాడేడి అన్న రీతిలో అమెరికా నడుస్తోంది. వీటిని గురించి చర్చించడానికి కాని, అభ్యంతరాలు తెలుపడానికి కాని అంతర్జాతీయ వేదికలే కరువయ్యాయి. అటువంటి అమెరికాకు ఇప్పుడు అణ్వస్త్ర నిరోధక సంధిని పరిరక్షించడానికి ఏకపక్ష అధికారం ఎవరిచ్చారు? తనకు నచ్చని దేశాలపై విరుచు పడడానికి ఎటువంటి హక్కు అమెరికాకు కలదనే సవాలు చేయనవసరం ఇప్పుడు ఎంతైనా ఉంది.

**ఇరాన్‌పై ఆంక్షలు-దక్షిణాసియా ప్రాంతీయ సహకార ప్రయత్నాలపై ప్రభావం**

ఇరాన్‌పై అమెరికా చూపుతున్న శత్రుత్వ భావం, ఇరాన్-పాకిస్తాన్-ఇండియా నెలకొల్ప తలపెట్టిన ఇంధన పైప్ లైన్‌పై ఎంతైనా ఉంది. ఇరాన్‌లో ఉత్పత్తి అయిన చమురు-గ్యాస్‌లను పైప్‌లైన్ ద్వారా పాకిస్తాన్, ఇండియాలకు సరఫరా చేసేందుకు ఒక బృహత్ ప్రతిపాదన రూపుదిద్దుకోబోతున్నది. క్లిష్టమైన అడ్డంకులను (రాజకీయ, నైసర్గిక, దౌత్య, సాంకేతిక అడ్డంకులు) దాటి ఈ పథకాన్ని సూత్ర ప్రాయంగా మూడు దేశాలు (ఆఫ్ఘనిస్తాన్ కూడా దీనికి అంగీకారాన్ని తెలియ చేసింది) ఆమోదించాయి. భారత- పాకిస్తాన్‌ల పరస్పర అనుమానాలని వెనక్కు నెట్టి పాకిస్తాన్ కూడా దీనికి ప్రాధాన్యతనివ్వడం చెప్పుకోతగ్గ ప్రగతి.

అయితే అమెరికా ఇరాన్‌పై అణు-పరిశోధనల సమస్య విషయంలో విధించిన ఆంక్షలను పురస్కరించుకొని, ఇరాన్ ఇంధన వనరులను సరిహద్దులను దాటి సరఫరా చేయ వీలులేదనే ఒక సంకుచిత పరమైన చట్ట నిబంధనను లేవతీసింది. దీని వలన దక్షిణాసియా దేశాలు-ఇరాన్ కుదుర్చుకున్న పథకానికే ముప్పు వాటిల్లవచ్చును. భారత ప్రభుత్వం అమెరికా అభ్యంతరాన్ని లెక్కచేసేది లేదని, ఇరాన్-పాకిస్తాన్-ఇండియా చమురు రహదారిని తప్పక నిర్మించుకుంటామని ప్రకటించింది.

(మిగతా 44వ పేజీలో )

# ఇరాన్ - భారత్ గ్యాస్ పైప్‌లైన్ - అమెరికా వైఖరి

-దిగుమర్తి నరసింహారావు

అమెరికా విదేశాంగమంత్రి, కాన్‌డొలీజా రైస్, తమ భారతదేశ పర్యటన సందర్భంలో ఇరాన్ - పాకిస్తాన్ - భారత్ గ్యాస్ పైప్‌లైన్ ప్రాజెక్టు గురించి చేసిన వ్యాఖ్యానాలు చాలా అభ్యంతరకరమైనవి. అంతకన్నా అభ్యంతరకరమైనది భారత ప్రభుత్వ అధినేతలు, ముఖ్యంగా ప్రధాని మన్‌మోహన్ సింగ్, విదేశాంగ శాఖామంత్రి నట్వర్‌సింగ్ గారి మౌనం. వారు ఇంతవరకు ఈ విషయంపై పెదవి విప్పిన జాడ లేదు. ఆమె ఈ సందర్భంగా అమెరికా సంయుక్త రాష్ట్రాల ఆందోళనను భారత ప్రభుత్వానికి తెలియ చేయడం జరిగిందని అన్నారు. అంతేకాదు. ఇరాన్ దేశంపై అమెరికా సంయుక్త రాష్ట్రాల వైఖరి ఏమిటో అందరికీ తెలిసిందే. అంటే, అమెరికా సంయుక్త రాష్ట్రాలకు ఇరాన్ ఎడల ఎటువంటి సానుభూతి లేదు. ఒక విధంగా ఇరాన్‌ను విరోధ దేశంగా భావిస్తున్నారని భావగర్భితంగా చెప్పడమే. అమెరికా మిత్ర దేశంగా భావించని ఇరాన్‌తో సత్సంబందాలు కలిగి వుండడం అమెరికాకు ఇష్టం వుండదని భారతదేశ ప్రభుత్వ నాయకులు గమనించి వ్యవహరించాలని అమెరికా విదేశాంగ మంత్రి అభిప్రాయమూ స్పష్టంగానే తెలుస్తున్నది. అమెరికా ప్రభుత్వం ఆ దేశం నుంచి, ద్రవ్య సహాయం ఆశించే దేశాలన్నీ, దాని కనుసన్నలలో మెలగాలని రైస్ ఉద్దేశం అయివుండవచ్చు. ఆమె ఇంకా ఇలా అన్నారు: "భారత దేశంలోని అమెరికా రాయబారి ఈ విషయంపై ఇదివరకే భారత ప్రభుత్వానికి అమెరికా అభిప్రాయం తెలియ జేయడం జరిగింది. భారతదేశం వచ్చే కొన్ని దశాబ్దాల కాలం వరకు దాని 'శక్తి' (ఎనర్జీ) అవసరాలు ఎలా సమకూర్చుకోవాలి అన్నది సమస్య. ఈ విషయమై ఒక విశాలమైన పరిధిలో భారత్ - అమెరికాలు సంప్రదింపులు జరపవలసిన అవసరం వుంది" అని భారత విదేశాంగమంత్రి నట్వర్ సింగ్‌తో మాట్లాడిన తరవాత జరిగిన పత్రికా విలేఖరుల గోష్టిలో అన్నారు.

ఈ వ్యాఖ్యలు ఒక మిత్రదేశం, మరో మిత్రదేశం అవసరాల గురించి సానుభూతితో చేసిన వ్యాఖ్యలు కావని వేరే చెప్పనవసరం లేదు. కొన్ని సంవత్సరాల నుంచి, భారత ప్రభుత్వ నాయకులు ఈ 'శక్తి' అవసరాల గురించి అనేక ప్రతిపాదనలు ఆలోచిస్తున్నట్లు పత్రికలలో వచ్చాయి. ముందు తజిక్‌స్తాన్ మున్నగు మాజీ సోవియట్ రిపబ్లిక్స్ నుంచి, ఆఫ్ఘనిస్తాన్ నుండి పైపులైన్ల ద్వారా "గ్యాస్" తీసుకురావడానికి వీలుందేమోనని కొంత అధ్యయనం జరిగింది. తజిక్‌స్తాన్ నాయకులు కూడా అందుకు ఒప్పుకున్నారు. అమెరికా ప్రపంచ వ్యాపార కేంద్రంపై బిన్‌లాడెన్‌కు చెందిన ఆల్‌ఖైదా టెరరిస్టులు విమాన దాడులు జరిపి 2000 సెప్టెంబరు 11 వ తేదీన కూల్చివేసిన తరువాత, ఆఫ్ఘనిస్తాన్‌లోని టాలిబాన్ ప్రభుత్వ అధినేతలు, ఆ దేశంలో బిన్‌లాడెన్, ఆయన సంస్థకు స్థావరాలు కల్పించారన్న అనుమానంతో టెరరిజంపై యుద్ధం ప్రకటించిన అమెరికా ఆఫ్ఘనిస్తాన్‌పై దాడి చేశారు. ఇది అందరికీ తెలిసిన విషయమే. మరో విషయం కూడా క్రమంగా అందరికీ స్పష్టమైంది. అది ఆఫ్ఘనిస్తాన్ అంటుకొని వున్న మధ్య ఆసియా రిపబ్లిక్‌లలో నూనె గనులు తమ ఆధీనంలోనికి తీసుకోవాలన్నది అమెరికా అసలు యోచన. సెప్టెంబరు 11 దాడి, టెరరిజమ్‌పై యుద్ధం ప్రకటన ఆసరాగా తీసుకొని ఆఫ్ఘనిస్తాన్‌లోని టాలిబాన్ ప్రభుత్వాన్ని తొలగించి, దాని స్థానంలో తమకు అందుబాటులో వున్న ప్రభుత్వాన్ని నెలకొల్పడం అమెరికా అసలు ఎత్తుగడ అని.

ఆఫ్ఘన్‌స్తానిలో టాలిబాన్ ప్రభుత్వం స్థానంలో కర్జాయ్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత కూడా చాలాకాలం వరకు అమెరికన్ సేనలు ఆదేశం నుండి తొలగలేదు. నేటికి కూడా కొన్ని తిష్టవేసుకొని కూర్చున్నాయి. అంతేకాదు మధ్య ఆసియా దేశాలలో ఇరాక్‌లోని నూనె గనులు ప్రపంచ విఖ్యాతిని పొందాయి. ఈ గనులపై కూడా ఆధిపత్యం సంపాదించాలన్నది అమెరికా విదేశాంగ విధానంలో ఒక ప్రధాన అంశం. అందుకు అనుగుణంగానే ఇరాక్ అణుబాంబుతో సహా రసాయనిక, ఇతర మారణాయుధాలను

తయారు చేయడానికి సన్నద్ధంఅవుతున్నామన్న నెపంతో ఇరాక్ అధ్యక్షునిపై అనేక ఆరోపణలు ఐక్యరాజ్య సమితిలో చేయగా, తనిఖీ చేయడానికి ఒక నిపుణుని నియమించింది. ఆ నిపుణులు చాలలోతుగా పరిశీలన జరిపి, అలాంటి సూచనలు ఏవీ లేవని తేల్చారు. అమెరికా అధ్యక్షుడు బుష్ సంతృప్తి చెందక ఇరాక్‌పై బ్రిటన్ సహాయంతో దాడి జరిపి, సద్దాం ప్రభుత్వాన్ని ఆధికారం నుంచి తొలగించి, దాని స్థానంలో ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని నెలకొల్పడం జరిగింది. ఆ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఎదిరించి ఇరాక్ ప్రజలు తమ దేశం నుంచి విదేశీ సేనలు వైదొలగాలి అని విరామంలేని గెరిల్లా పోరు సాగిస్తున్నారు.

ఇరాక్ యుద్ధం ఒక కొలిక్కి రాగానే, అమెరికా అధ్యక్షుడు తమ దృష్టిని ఇరాన్‌పై సారించారు. దీని భావమేమి తిరుమలేశ? అని ప్రశ్నించుకొంటే ఆట్టే లోతుగా పరిశీలించకుండా ఇరాక్‌లో లాగే ఇరాన్ కూడా నూనె గనులకు ప్రసిద్ధి. ఇరాన్ నూనె గనులమీద ఆధిపత్యం సాధించాలి. అమెరికాకు మరో నెపం దొరికింది. ఇరాన్ అణు సాంకేతిక పరిజ్ఞానం సంపాదించడానికి ప్రయత్నిస్తున్నదని, సాంకేతిక పరిజ్ఞానం కేవలం విద్యుత్ ఉత్పత్తికే కాకుండా, ఆయుధాల ఉత్పత్తికి కూడా సహాయపడగలదని అందువలన రష్యా ఈ విషయంలో సహాయపడరాదని చూచాయగా హెచ్చరించడం జరిగింది. కాని రష్యా అధ్యక్షుడు పుతిన్, అమెరికా బెదిరింపులను పట్టించుకోవడం లేదు. అప్పటినుంచి ఇరాన్‌పై అమెరికా కన్నెర చేస్తూనే వుంది. ఏదేనా నెపం దొరకదా, ఇరాక్‌కు పట్టిన గతే దానికి పట్టించాలని తాపత్రయ పడుతున్నది. అందుకే అమెరికా రాయబారి, అమెరికా విదేశాంగమంత్రి రైస్ భారత ప్రభుత్వానికి చేస్తున్న హెచ్చరికలు.

అమెరికా విదేశాంగమంత్రి చేసిన వ్యాఖ్యలపై, వివిధ ప్రజాస్వామిక, వామ పక్ష శక్తులు తీవ్రమైన నిరసన తెలిపినా, పలు పత్రికలు అంత తీవ్రంగా కాకపోయినా, కొంతవరకైనా ఇటువంటి వ్యాఖ్యలు చేయడం భారత దేశ ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోలేం అని నేరుగా చెప్పడానికి సాహసించలేక, ఆ ధ్వని స్ఫురించేటట్లు సంపాదకీయాలు రాశాయి. ఇంత జరిగినా, ప్రధాని మన్‌మోహన్‌సింగ్, విదేశాంగ శాఖామంత్రి నట్వర్ సింగ్ ఏ మాత్రం చలించలేదు. ఇదేదో తమకు సంబంధించినది కాదు అన్న ధోరణిలో నట్వర్‌సింగ్ పత్రికా గోష్ఠిలో విలేకర్లతో అన్నారు. అమెరికా వ్యాఖ్యానాలు భారతదేశ ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకోవడ కాదా అన్న విలేకర్ల ప్రశ్నకు నట్వర్‌సింగ్ జవాబు చాలా వింతగా వుంది: పెట్రోలియం శాఖామంత్రి మణిశంకర్ అయ్యర్ ఈ ఇరాన్-పాకిస్తాన్-భారత్ పైపులైన్ ప్రాజెక్టు గురించి ఇరాన్‌తో, పాకిస్తాన్‌తో సంప్రదింపులు జరుపుతున్నారని, భారతదేశం శక్తి అవసరాలు రోజురోజుకీ పెరుగుతున్నాయని, భారతదేశానికి ఇరాన్‌కు మధ్య సత్సంబంధాలు సాంప్రదాయంగా వస్తున్నాయని అన్నారు. ఇరాన్ యన్.పి.టి (న్యూక్లియర్ నాన్ ప్రొలిఫరేషన్ ట్రీటీ) అణు ఆయుధాల పెంపుదలను అదుపుచేసే ఒడంబడిక, నిబంధనలకు కట్టుబడి వుంటుందని భారత్ ఆశిస్తున్నదని అన్నారు. ఇరాన్‌తో భారత్‌కు ఏవిధమైన సమస్యలు లేవు అన్నారు. ప్రశ్నకి జవాబుకి ఏమైనా సామీప్యం వుందా అని ఆలోచిస్తే, విలేకరులు వేసిన ప్రశ్నను పూర్తిగా దాటవేస్తూ ఆ విషయం విదేశాంగ శాఖకు సంబంధించినది కాదు అన్నట్లు వ్యవహరించారు.

ఆంగ్లంలో ఒక నానుడి వుంది- లెఫ్ట్ హాండెడ్ కాంప్లిమెంట్ అని దాని తాత్పర్యం హృదయ పూర్వకంగా కాకుండా, మాటవరుసకి, మర్యాదకి అన్న మాటలు అని, అవి పట్టించుకోనవసరం లేదని. నేపాల్ ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని రద్దుచేయడం విషయంలో అమెరికా, భారత్ సమగ్ర అభిప్రాయంతో వుండటమే కాకుండా, ఆ రెండింటికి ప్రాంతీయ, ప్రాపంచిక ('రీజినల్ అండ్ గ్లోబల్') బాధ్యతలున్నాయన్న అవగాహన వుందని అమెరికా విదేశాంగ మంత్రి అన్నారు. అదే సందర్భంలో భారత విదేశాంగ శాఖామంత్రి, పాకిస్తాన్‌కు ఆయుధాల సరఫరా గురించి ముఖ్యంగా ఎఫ్-16 విమానాలు (అణుబాంబులు వేయడానికి ఉపయోగపడే విమానాలు) కొంత ఆందోళన చెందుతున్నదని విలేకర్లతో అంటే, భారత్ నుంచి పాకిస్తాన్ వెళుతున్న రైస్, ఈ విషయంలో అమెరికా ఎలాంటి ప్రకటన చేస్తుందని ఆశించనవసరం లేదని నిర్మొగమాటంగా తెగేసి చెప్పారు. నట్వర్‌సింగ్ దానికి స్పందిస్తూ, ఈ విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు లేవని చక్కదిద్దేశారు.

ఒకటి రెండు విషయాలలో అమెరికాతో భారత్ ఏకీభవించడం లేదు. అయితే అమెరికా-భారత్ సంబంధాలు చాలా పరిపక్వం చెందాయని వాటిని సాఫీగా సంభాషణల ద్వారా జరువ వచ్చునని అన్నారు.

ఇరాన్ నుంచి భారత్‌కు గ్యాస్ ముందర సముద్ర గర్భం ద్వారా తీసుకురావాలని ఒక దశలో కొంత పరిశోధన, సంప్రదింపులు జరిగాయి. సాధ్యాసాధ్యాలు వివరంగా పరిశీలించిన తరువాత సముద్ర గర్భం ద్వారా కాకుండా, భూమార్గం గుండానే పైపులైను ద్వారా పాకిస్తాన్ గుండా తీసుకురావడం మంచిది అన్న అభిప్రాయం వచ్చింది. దీనికి పాకిస్తాన్ కూడా అంగీకరించాలి. ఆదిలో పాకిస్తాన్ అంత సుముఖత చూపించ లేదు. రానురాను అమెరికా ప్రపంచ నూనె వనరులపై ఆధిక్యత సాధించడానికి చేస్తున్న ప్రయత్నాలు గమనించి పాకిస్తాన్ తన దృకథం మార్చుకున్నట్లు కనిపిస్తున్నది. ఈ గ్యాస్‌లో పాకిస్తాన్‌కు కూడా కొంత వాటా ఇస్తే పాకిస్తాన్ భూభాగం గూండా పైపులైను వేయడం పట్ల కొంత సుముఖత వ్యక్తం చేసింది. పాకిస్తాన్ ముభావంగా వున్నంత కాలం అమెరికా ఇరాన్-పాకిస్తాన్-భారత్ గ్యాస్ పైప్ లైన్ ప్రాజెక్టు గురించి అంత పట్టించుకోలేదు. ఎప్పుడైతే ఇరాన్-పాకిస్తాన్-భారత్‌లు ఈ ప్రాజెక్టుపై ఒక అంగీకారానికి రాబోతున్నాయన్న అభిప్రాయం అమెరికాకు ఏర్పడిందో హుటా హుటిన అమెరికా విదేశాంగమంత్రి భారత్ వచ్చి వ్యక్తిగతంగా భారత ప్రధానిని, విదేశాంగ మంత్రిని హెచ్చరించారని విశదంగా కనిపిస్తున్నది.

ఇంతనగ్నంగా అమెరికా విదేశాంగమంత్రి భారత ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నా, భారత విదేశాంగ మంత్రి, ప్రధానమంత్రి ఆగ్రహావేశాలు మాట అటుంచి, అసలు నిరసనను కూడా తెలుపకుండా, నిర్లిప్తంగా ఎందుకు వున్నారో బోధపడడం లేదు. అమెరికా ఎంత ధనవంతమైన దేశమైనా, అమెరికా భారత్‌ను ఏమీ చేయలేదు. భారత జనాభా 100 కోట్లపైగా వుంది. మహా అయితే ఆర్థిక సహాయం మానేస్తుంది. అది ఒక విధంగా మంచిదే. 1917లో సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత బ్రిటన్, మిగతా యూరోపియన్ దేశాలు ఎటువంటి సాంకేతిక, పారిశ్రామిక, ఆర్థిక సహాయం చేయకూడదని నిర్ణయించాయి. అయితే సోవియట్ యూనియన్ స్వశక్తి మీద, తమ ప్రజల త్యాగాల మీద ఆధారపడి చితికి పోయిన ఆర్థిక వ్యవస్థను సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా రూపుదిద్దింది. ఆశ్చర్యకరమైన విషయం కొన్ని ప్రధాన పారిశ్రామిక విషయాల్లో ముఖ్యంగా మోటారు కార్ల తయారీలో అమెరికా పారిశ్రామిక వేత్తలు సహాయపడ్డారు. వారికి కావలసింది వారి సరుకులు అమ్ముడుపోవడం, లాభాలు రాబట్టుకోవడం.

అంతెందుకు పండిట్ నెహ్రూ, భారత్‌ని పారిశ్రామిక దేశంగా చేయాలని ప్రయత్నించినప్పుడు సోవియట్ యూనియన్ భిలాయ్ స్టీల్ ఫ్యాక్టరీకి, జెకోస్లవేకియా భారత్ హెవీ ఎలక్ట్రికల్స్‌కు, ఇంకా ఇతర తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలు ఇతర పరిశ్రమలకు సహాయం చేయడంతో, ఎక్కడ వెనక పడిపోతామోనన్న భయంతో పశ్చిమ జర్మనీ మున్నగు దేశాలు క్రమంగా భారతదేశ పారిశ్రామికీకరణకు కొంచెం కొంచెం సహాయం చేయడం ఆరంభించాయి. ఇందిరాగాంధీ హయాంలో అంతర్జాతీయ ద్రవ్యనిధి చాలా కఠినమైన, అవమానకర షరతులు పెట్టడంతో రుణంలో మొదటి భాగం తీసుకొని తరువాత భాగాలు తీసుకోదలచుకోలేదని, అంతర్జాతీయ ద్రవ్యనిధి సహాయాన్ని పరిమితం చేసింది. దేశాన్ని పరిపాలించే నాయకులకు ఆత్మవిశ్వాసం, ప్రజలలో నమ్మకం, ధైర్యం, ఆత్మగౌరవం ఉన్నప్పుడు ఏ దేశం భారత్‌ను బెదరించలేదు.

అంతేకాక భారతదేశ విదేశీ విధానం భారత స్వాతంత్ర్యంతో ప్రారంభంకాలేదు. దీని బీజాలు జాతీయ పోరాటంలోనే నాటబడ్డాయి. పండిట్ నెహ్రూ బెల్జియమ్‌లో జరిగిన ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక సమావేశంలో పాల్గొడంలోను, చైనాపై జపాన్ దండెత్తినప్పుడు, చైనాకు డా॥ కోట్నిస్ నాయకత్వంలో వైద్య నిపుణులను పంపించడంలోను ప్రారంభం అయింది. స్వాతంత్ర్యం పొందిన తరువాత విదేశాంగ విధానంలో మొట్టమొదటి మౌలిక మలుపు బాండుంగులో చౌ-ఎన్-లైతో పాటు ఆసియా దేశాల సమావేశం ఏర్పాటు చేసి పంచశీల సూత్రాలను నిర్వచించడం.

తరువాత భారతదేశ విదేశాంగ విధానం మరో మలుపు ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిగా వున్నపుడు జరిగింది. అది అలీన

దేశాల ఉద్యమానికి భారతదేశం నాయకత్వం వహించి, అభివృద్ధి చెందుతున్న, బడుగు దేశాలు, సామ్రాజ్యవాద దేశాల కుయుక్తులకు బలి అవకుండా ఒక బలమైన ఉద్యమం నిర్మించడం జరిగింది. ఈ విధంగా, భారతదేశం అంతర్జాతీయ రంగంలో ఒక ప్రధాన పాత్ర వహిస్తూ వచ్చింది. భారతదేశ విదేశాంగ నీతిలో అతి ప్రధానమైనది ముఖ్యమైన సామ్రాజ్యవాద వ్యతిరేకం. కాని ఇందిరాగాంధీ తరువాత భారతదేశ ప్రధానులెవ్వరు ప్రాధాన్యతను గుర్తించకుండా, భారదేశం ఆర్థికంగా, పారిశ్రామికంగా అభివృది చెందటమే లక్ష్యంగా పెట్టుకొని, ఏదేశం అయితే ప్రపంచంలోని సామ్రాజ్యవాదానికి ప్రాతినిధ్యం వహిస్తూ, అభివృద్ధి నిరోధక శక్తులకు నాయకత్వం వహిస్తుందో ఆదేశం సుహృద్భావాన్ని సంపాదించడానికి తాపత్రయం పడడం ప్రారంభించారు. ఈ విదేశాంగ విధానం యన్.డి.ఏ. ప్రభుత్వ కాలంలో పరాకాష్ట చేరింది.

యు.పి.ఏ. ప్రభుత్వంలో భారత దేశానికి తిరిగి మంచి రోజులు వచ్చాయని, భారత విదేశాంగ విధానంలో మరో మౌలికమైన మలుపు తిరుగుతుందని ప్రజలు ఆశించారు. దానికి కారణం యు.పి.ఏ. రూపొందించిన కనీస ఉమ్మడి కార్యక్రమంలో విదేశాంగ విధానం గురించి ఈ విధంగా చెప్పబడింది. యు.పి.ఏ. ప్రభుత్వం స్వతంత్ర విదేశ విధానం అవలంబిస్తూ, గత సాంప్రదాయాలను దృష్టిలో వుంచుకొని, ప్రపంచంలో ఏక ధృవ విధానాన్ని వ్యతిరేకిస్తూ, బహుళధృవ విధానం కొనసాగడానికి శాయ శక్తుల ప్రయత్నిస్తుంది. యు.పి.ఏ. ప్రభుత్వం దక్షిణ ఆసియాలోని పొరుగు దేశాలతో రాజకీయ, ఆర్థిక, ఇతర సంబంధాలు పెంపొందించుకొని సార్క్ సంఘటనను బలపరుస్తుంది. ఆ ప్రాంతంలోని జలవనరులు, విద్యుత్ శక్తి, పరిసర పరిరక్షణ మున్నగు విషయాల గూర్చి సంప్రదింపుల గుండా తగిన శ్రద్ధ వహిస్తుంది. అమెరికాతో సన్నిహిత సంబంధాలు కాంక్షిస్తానే, భారతదేశ విదేశాంగ విధానాన్ని స్వతంత్రంగా రూపొందిస్తూ, ప్రాంతీయ, ప్రాపంచిక సమస్యలపై తనదైన విధానాన్ని రూపొందించుకుంటుంది.

అయితే జరుగుతున్నది ఏమిటి? మన్‌మోహన్‌సింగ్ ప్రభుత్వం అధికారం తీసుకొన్న కొన్ని వారాలలోనే ఇరాక్‌కు సేనలు పంపించడం విషయంలో అమెరికాకు వెళ్లి విదేశాంగమంత్రి నట్వర్‌సింగ్ ఆ విషయం ఆలోచిస్తామని ప్రకటించడంతో దేశంలో నిరసన వెల్లువ రావడంతో నాలిక కరుచుకున్నారు. ఇప్పుడు, ముందు ఇరాన్- పాకిస్తాన్-భారత్ గ్యాస్ పైపులైను ప్రాజెక్టు విషయంలో అమెరికా భారతదేశం ఆంతరంగిక విషయాలలో జోక్యం చేసుకొంటే, ఇతర దేశాల జోక్యం సహించబోమని ఖరా ఖండీగా చెప్పకుండా నీళ్లు నములుతూ భారత ప్రధాని నిరసన వ్యక్తం చేయడం చాలా శోచనీయంగా వుంది.

ఆలోచించవలసిన విషయం ఏమిటంటే ప్రధానమంత్రికి కాని, విదేశాంగ మంత్రికి కాని జాతీయ ఉద్యమ వారసత్వం ఏమాత్రం లేదు. దానికి కారణం వారు నిన్న మొన్నటిదాకా బ్యురాక్రట్లు. స్వంతంగా ఆలోచించే అలవాటు లేదు. అసలు కనీస ఉమ్మడి కార్యక్రమం రూపొందించినా దానిని అమలు చేయగల సామర్థ్యంగాని, నిజాయితీ గాని వారిలో లేదు. వారిని ఆ పదవులకు నియమించిన కాంగ్రెస్ అధ్యక్షురాలు, యు.పి.ఏ. కో ఆర్డినేషన్ కమిటీ అధ్యక్షురాలు అయిన సోనియాకు కూడా జాతీయ ఉద్యమ వారసత్వం, నెహ్రూ-ఇందిరాగాంధీ సిద్ధాంత అవగాహన కూడా ఉన్నట్లు లేదు. కేవలం వివాహ సందర్భంగా ఏర్పడిన బంధుత్వం వలన, వారసత్వం లభించడం కష్టం. ఇది సోనియా గాంధీ యొక్క లోపం లాగ కనిపిస్తుంది. ఆ లోపాన్ని కప్పిపుచ్చగల తెలివి తేటలు, విజ్ఞాన సంపత్తి రాజకీయ రంగంలో ముఖ్యంగా, విదేశీ విధాన రంగంలో భారత ప్రధానికి కాని, విదేశాంగ మంత్రికి కాని వున్నట్లు కనిపించదు.

ఉదాహరణకు భారతదేశానికి భద్రతా మండలిలో శాశ్వత స్థానం కలుగ చెయ్యడం సబబు, సహజం, హేతుబద్ధం. ప్రస్తుత భద్రతా మండలిలో శాశ్వత సభ్యులుగా వున్న అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, చైనాలు ఇవ్వడం లేదు. 1945 బ్రిటన్, ఫ్రాన్స్ దేశాల ఆధీనం క్రింద ఆ దేశ వలస దేశాలు వుండేవి. అందుచేత వారి పలుకుబడిలో వున్న జన సంఖ్య దృష్ట్యా వాటికి శాశ్వత సభ్యత్వం, రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో చేసిన త్యాగాల వలన శాశ్వత సభ్యత్వం లభించింది. కాని ఇప్పుడు ముఖ్యంగా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు కేవలం పూర్వపు ప్రతిష్ట నీడల కిందే బ్రతుకుతున్నాయి. ముఖ్యంగా బ్రిటన్. అందుకే దీని స్థానం అంతర్జాతీయ రంగం నిలుపుకోడానికి అమెరికా గొడుగు

కింద, ఆఖరికి ఇరాక్‌పై దురాక్రమణ యుద్ధానికి సహ మద్దతు ఇన్తూ తలదాచుకొంటున్నాయి. ప్రపంచంలోని అయిదు ఖండాలలో ఒక్క యూరప్‌కే మూడు శాశ్విత స్థానాలు వుండడం సబబు కాదు. భారతదేశ జనాభా కన్నా ఎక్కువ. అందుచేత ఆసియా ఖండానికి రెండు శాశ్వత స్థానాలు వుండడం న్యాయం. ఇది భారతదేశ వాదన. ఈ వాదన కాదనడానికి ఎవ్వరికీ అధికారం లేదు. అయితే ఒకానొక సందర్భంలో భారత విదేశాంగమంత్రి నట్వర్‌సింగ్, వీటో హక్కు మినహా శాశ్వత సభ్యత్వం భారత్‌కు లభించే అవకాశం వుంటే అది ఆలోచించవలసిన విషయమే అన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. శాశ్వత సభ్యత్వం గల మిగతా దేశాల కన్నా ఏ విధంగాను తీసిపోని, భారత్ వీటో హక్కు లేకుండా భద్రతా సంఘం శాశ్వత సభ్యత్వం స్వీకరించడం అంటే దానిని అది చిన్న బుచ్చు కోడమన్న మాట. ఇది భారతీయులందరికీ అప్రతిష్ఠకరం. కేవలం బ్యూరో్క్రాట్సుకు రాజకీయ పదవులు కట్టబెడితే వచ్చే బాధ ఇదే. వారు చాలా పరిమితంగా ఆలోచిస్తారు.

అసలు ఏ దేశం అయినా దాని అంతర్గత రాజకీయ, ఆర్థిక, సిద్ధాంత, విధానాల నుంచే దాని విదేశాంగ విధానం రూపొందుతుంది. నెహ్రూ, ఇందిరాగాంధీ కాలంలో ఈ రెండు విధానాలకు, అంతర్గత రాజకీయ, ఆర్థిక, సాంఘిక విధానాలకు, విదేశాంగ విధానానికి చాలా సన్నిహిత పొంతన వుండేది. కాని ఒక మూల ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, స్వేచ్ఛా వ్యాపారం, సరళీకృత విధానాలు త్వరితగతిని అమలు చేయడానికి తహతహ లాడుతూ, దానికి భిన్నమైన కొన్ని సందర్భాలలో ప్రతికూలమైన విదేశాంగ విధానం అమలు చేయడం కష్టం. ప్రధాని మన్‌మోహన్‌సింగ్ పొరపాటునైనా నోటివెంటకాని, విదేశాంగమంత్రి నట్వర్‌సింగ్‌ల పలుకులలో కాని సోషలిజం అన్నమాట వచ్చిన సందర్భం లేదు. ఆశ్చర్య పోవలసిన విషయం ఏమిటంటే భారత రాజ్యాంగంలో, సెక్యులరిజం, సార్వభౌమత్వం, ప్రజాస్వామ్య, గణతంత్ర సూత్రాలతో బాటు సోషలిజం కూడా ప్రస్తావనలోనే (ప్రియాంబుల్) పేర్కొన బడింది. వారు రాజ్యాంగానికిస్తున్న గౌరవం ఇది!

*

---

( 39వ పేజీ తరువాయి )

ఈ విధంగా అమెరికా అవలంబిస్తున్న వైఖరి ప్రాంతీయ సమష్టి సహకార ప్రయోజనాలకు సమస్యగా తయారైంది. ఈ ప్రాంతీయ దేశాలు సమష్టిగా ఈ వైఖరిని ప్రతిఘటించాలి. ఈ సందర్భాన్ని ఉపయోగిస్తూ, అమెరికా ఇరాన్‌పై తలపెట్టిన వేధింపు చర్యలను ఇండియా-పాకిస్తాన్‌లు ఏకాభిప్రాయంతో వ్యతిరేకించడానికి మంచి అవకాశం వచ్చింది. దీనిని జారవిడుచుకోరాదు.

అమెరికా విధానాలనే నిశితమైన విమర్శలకు గురిచేయడం భావ్యం కాదని, ఈ ఒరవడి కేవలం వామపక్ష విశ్లేషకులకు, వామపక్ష పక్ష పాతకులకే చెందుతుందనే అభిప్రాయం కొందరిలో ఉంది. ఎంతైనా ప్రపంచంలోకల్లా ఏకైక శక్తివంతమైన దేశానికి ప్రపంచ వ్యాప్తంగా బాధ్యతలు, ప్రయోజనాలు ఉండడం సహజమని అనడం కొంతవరకు సమంజసమే.

నిజమే. అయినా ఎంత శక్తివంతమైన దేశమో అంత బాధ్యతాయుత ప్రవర్తనను కూడా ప్రదర్శించవలసిన కనీస విధులు అమెరికాకు వర్తిస్తాయి. ఈ విధులను పాటించకపోవడమే అమెరికా అహంభావానికి నిదర్శనం. ఆర్థిక, సైనిక బలాలు ఉంటే సరిపోవు. సిద్ధాంతపరమైన సంకుచితత్వం లేకపోవడం, దౌత్య, మానవ సంబంధాలలో తగు వినయం, నమ్రత, దమం, శమం-దేశాల నిజమైన గొప్పతనానికి గీటురాళ్లు. ఇవి అమెరికా విధానాల్లో కనిపించడం లేదు.

ప్రగల్భాలకే ప్రాధాన్యత నివ్వడం ప్రస్తుత అమెరికాకు పరిపాటి. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం-ప్రాతిపదికలపై విధానాలు రూపొందించేటప్పుడు, ఆ మాటలకు వేరు వేరు పెడర్థాలను ఆపాదించి, ఒక పరి ఒక నిర్వచనం, తదుపరి ఇంకొక నిర్వచనం ఈయడం బుష్ ప్రభుత్వానికి పరిపాటైందని అమెరికాలోని విమర్శకులు కూడా చెప్తున్నమాటే. గత దశాబ్దాలలో నిరంకుశ హయాంలను సమర్థించడం, సైనిక తిరుగుబాట్లను ప్రోత్సహించి ప్రజాస్వామ్య ప్రభుత్వాలను రూపు మాపడం వాషింగ్టన్‌కి కొత్తకాదు. తన ప్రయోజనాలకు అనుకూలమైతే కొన్ని దేశాలకు తాఖీదునిచ్చి, కాకపోతే దేశాలను వెలివేసి, భ్రష్ట రాజ్యాలనే రంగు పూసి వ్యవహరించే తీరును నిశిత విమర్శలకు గురిచేయడం సమంజసమే. అన్నింటికన్నా ముఖ్యమైన అంశం-ఐక్యరాజ్య సమితిపై గల అమెరికా హేయ, తృణీకార భావం. శక్తివంతమైన దేశంగా, కాని చక్కటి రాజకీయ భావాలను ప్రపంచానికంతటికి అందచేసిన రాజకీయ సంస్కృతికి పుట్టినిల్లయిన అమెరికా, తన లక్ష్యాలను, ధ్యేయాలను అంతర్జాతీయ సంస్థల ద్వారా అమలు పరచడం ఎంతైనా మంచిది. అటువంటిది, ఐక్యరాజ్య సమితిని పక్కకు తోసి ప్రపంచాధిపత్యాన్ని సాగిస్తాననుకోవడం ఏమాత్రం సమంజసం కాదు. అందుకే అమెరికాపై విమర్శకుల తీవ్ర వీక్షణం.

*

# కొత్త పరిశోధనా సంస్థ సిడిఆర్‌సి

'వీక్షణం' పాఠకులు రెండు సంచికలుగా వీక్షణం చిరునామాలో మార్పును గమనించే ఉంటారు. జనవరి 2005 సంచిక నుంచి వీక్షణం సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చి అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి) ప్రచురణగా వెలువడుతోంది. భారత రాజకీయార్థిక సామాజిక సాంస్కృతిక పరిణామాల గురించి స్థూలంగా, తెలుగు సమాజం మీద ప్రత్యేక శ్రద్ధతో సమాచారం సేకరించడం, విశ్లేషించడం, పరిశోధనలు నిర్వహించడం, ఆ సమాచారాన్ని, విశ్లేషణను, పరిశోధనా ఫలితాలను సమాజంతో తిరిగి పంచుకోవడం సిడిఆర్‌సి ప్రధాన కార్యక్రమం.

సమాజం పట్ల శ్రద్ధాసక్తులు గల ఆలోచనా పరుల బృందం ఒకటి సిడిఆర్‌సిని స్థాపించింది. సిడిఆర్‌సి ని స్థాపించిన ఆలోచనా పరులలో సామాజిక శాస్త్రవేత్తలు, పాత్రికేయులు ఉన్నారు. వ్యాపార ధోరణికి పోకుండా, ప్రజానుకూలమైన పద్ధతిలో సమాచారాన్ని ప్రోది చేయడం, పరిశోధించడం, విశ్లేషించడం, సమాచార వినిమయం సిడిఆర్‌సి నిర్దేశిత కర్తవ్యాలు. ఆర్థిక వ్యవస్థ, సమాజం, సంస్కృతి, రాజకీయాలు మొదలయిన రంగాలలో ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసే అంశాలన్నీ సిడిఆర్‌సి పరిధిలోకి వస్తాయి.

భారత సమాజం, తెలుగు సమాజం కూడ చలన శీలంగా ఉన్నాయి. ప్రజలు పట్టించుకోవలసిన ఎన్నో అంశాలను లేవనెత్తుతున్నాయి. ఈ అంశాల పట్ల పరిశోధకులలో, మేధావులలో, రాజకీయ వేత్తలలో, విధాన నిర్ణయ కర్తలలో, పారిశ్రామిక వేత్తలలో, అధికారులలో, సాధారణ ప్రజానీకంలో ఎంతో ఆసక్తి రేకెత్తుతోంది. ఈ అంశాల గురించి ఇంకా ఎక్కువ సమాచారం కావాలని, మరిన్ని విశ్లేషణలు కావాలని సమాజం ఎదురు చూస్తోంది.

ఐనా సమాజంలో కనబడుతున్న ఈ ఆసక్తికీ, తగిన పరిశోధనతో సరైన ఆధారాలతో వెలువడే విశ్లేషణకూ మధ్య అంతరం మిగిలిపోతోంది. కొనసాగుతున్న సామాజిక స్థితి గురించి సాధికారికమైన సమాచారంపై ఆధారపడిన విశ్లేషణ తగినంతగా రావడం లేదు. విశ్లేషణ వచ్చిన చోట కూడ, సామాజిక అంశాల లోతు, విస్తృతిలకు తగినట్టుగా సమాచార సేకరణ జరగడం లేదు. సమాజం ఎప్పటికప్పుడు తన గురించి తాను తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంటుంది. ఆ ప్రయత్నమే విద్యార్థులలో, పరిశోధకులలో, సామాజిక నాయకులలో, అభిప్రాయ రూప కర్తలలో, విధాన నిర్ణయ కర్తలలో, విధానాలను అమలు చేసే యంత్రాంగంలో, ప్రచార సాధనాలలో జ్ఞానదాహంగా కనబడుతుంది. సిడిఆర్‌సి ఆ అంతరాన్ని తీర్చడానికి, ఆ జ్ఞాన దాహాన్ని తీర్చడానికి తన వంతు కృషి చేయడానికి నిర్ణయించుకుంది.

'వీక్షణం' ఇకనుంచి సిడిఆర్‌సి కార్యకలాపాల గురించి సమాచారాన్ని పాఠకులతో పంచుకుంటుంది.

## సిడిఆర్‌సి స్థాపకులు




ప్రొ. ఆర్ ఎస్ రావు, సంబల్‌పూర్ విశ్వవిద్యాలయ ఆర్థికశాఖ ఆచార్యులు (రి)
ప్రొ. కె ఆర్ చౌదరి, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ వ్యవసాయ ఆర్థికశాఖ ఆచార్యులు (రి)
వి. హనుమంతరావు, సీనియర్ పాత్రికేయులు, డేటాన్యూస్ ఫీచర్స్ స్థాపకులు
ప్రొ. ఎం. భారతి, బుర్లా (ఒరిస్సా) ఇన్‌స్టిట్యూట్ ఫర్ స్టడీ అఫ్ సొసైటీ అండ్ కల్చర్ స్థాపకులు
బి. ఎస్. రాజు, మెకానికల్ ఇంజనీర్, కన్సల్టెంట్
పి. అరవింద, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రొఫెషనల్
సి. వనజ, ఎలక్ట్రానిక్ మీడియా ప్రొఫెషనల్

డైరెక్టర్: ఎన్. వేణుగోపాల్, సీనియర్ పాత్రికేయులు, వీక్షణం సంపాదకులు

# సోషలిస్ట్ రిజిస్టర్

-డా॥ మానేపల్లి

**1964** నుంచి ప్రతి ఏటా సోషలిస్టు రిజిస్టర్ వెలువడుతున్నది. దీన్ని రాల్ఫ్ మిలిబాండ్ (1924-1994), జాన్ శాలివి ప్రారంభించారు. ఇప్పుడు లియో పానిచ్, కాలిన్ లీస్ ఆ బాధ్యత తలకెత్తుకున్నారు. ప్రతిటేటా ఆ కాలానికి సంబంధించిన సమస్యనొకదాన్ని తీసుకొని, నిపుణుల చేత వ్యాసాలు రాయించి, ప్రామాణికం అనదగిన సమాచారంతో, విశ్లేషణతో సంకలించి, సంపాదకీయం రాసి-ప్రతిఏటా వెలువరిస్తున్నారు. నేటికి దాదాపు నలభయ్యేళ్లుగా ఈ కృషి నిరంతరాయంగా కొనసాగుతున్నది. జార్జి ఆల్బా, పాల్ కమ్మక్, డేవిడ్ కోట్స్, డేనియల్ ఎల్సన్, శామ్ గిండిన్, ఉర్సులా క్యూస్, షిలా రాబోతమ్, ఎలెన్ మీస్కిన్స్ వుడ్ మొదలైన వాళ్లు తరచుగా వ్యాసాలు రాస్తుంటారు. అందరికందరూ-నిబద్ధత, నిమగ్నత గల ప్రథమశ్రేణి మేధావులు. వీరిలో ఎలెన్ మంత్లీరివ్యూ సంపాదక సభ్యురాలు. వీరుకాక ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాలకు చెందిన మేధావులతో ఒక సంపాదకవర్గం అనుబంధంగా పనిచేస్తుంది. వీరందరి సమిష్టికృషి ఫలితమే-ఏటా వెలువడే సోషలిస్టు రిజిస్టరు. దీన్ని లండన్‌లోని మెర్లిన్ ప్రెస్ ప్రచురిస్తుంది. 2004 సంపుటిని "దిన్యూ ఇంపీరియల్ ఛాలెంజ్" అనే ప్రధానాంశంపై కేంద్రీకరించి వెలువరించింది. (దీన్ని ఇండియా కె. పి. బాగ్చీ అండ్‌కో అనేక కలవేత్త ప్రచురణ సంస్థ ప్రచురిస్తున్నది. 2004 సంపుటి. 328 పేజీలు. 400 రూ)

క్రమం తప్పకుండా దీన్ని చదవడం, అది ఒక అనుభూతి, అనుభవం.

2004లో ప్రచురించిన ఈ సంపుటిని నిజానికి 2000 వసంతం లోనే-అంటే 2001 సెప్టెంబర్ 11 సంఘటన కంటే బాగా ముందుగానే-ఆలోచించి పెట్టుకున్నారు. 2003 నాటి ఇరాక్‌పై అమెరికా దాడి నేపథ్యం ఎలాగూ వుండనే వుంది. గత చరిత్ర తవ్వడం కాకుండా-సమకాలిక ప్రపంచ చరిత్రకు అత్యధిక ప్రాధాన్యం ఇచ్చి రూపొందించారు. 2004లో సంపుటిలో గ్లోబలైజేషన్‌పై వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాల్ని మార్క్సిస్టులూ, మార్క్సిస్టులు కానివారు కూడా రాశారు.

2004 సంపుటికి 'నూతన సామ్రాజ్యవాద సవాలు' అనే అంశాన్ని ఎంచుకోవడానికి కారణం- ఈనాడు నిరంతరం మానవ మనుగడకు ఏర్పడుతున్న విఘాతం, పెచ్చు పెరిగిపోతున్న సామ్రాజ్యవాద ఆగడం, ముఖ్యంగా అమెరికన్ వైఖరివల్ల ఏర్పడుతున్న ముప్పు-చర్చించడం.

2005 సంపుటికి ఇప్పుడే-ముందుగానే "ది న్యూ ఇంపీరియల్ ఆర్డర్" అని నామకరణం చేసుకున్నారు సంపాదకులు. అంటే ఒక పద్ధతి, నిర్దుష్టమైన ప్రణాళిక, నిర్దిష్ట లక్ష్యం-వీటి వెలుగులోనే ప్రతిఏటా సంపుటాలు రూపొందుతాయి. వీరు ఎట్టి పరిస్థితుల్లోనూ తమ లక్ష్యాలకు, ప్రాధాన్యాంశాలకు తప్పి నడవరు. ప్రగతిశీల దృక్పథం, లక్ష్య శుద్ధి సోషలిస్టు రిజిస్టర్ మొట్టమొదటి ప్రత్యేకత. దీనితో పోల్చదగిన సంపుటాలు ప్రపంచంలో మరి ఏ దేశంలోనూ, ఏ భాషలోను లేవు. దీనికి మంత్లీరివ్యూ పత్రిక, ప్రచురణలు కొంతవరకూ సమానంగా వస్తాయి. ఒకోసారి రెండు ప్రయత్నాల్లోనూ పరస్పర అవగాహన కూడా ఉంటుంది.

అందుకే దేశ వ్యాప్తంగా ఆర్థిక, రాజకీయ, సమకాలిక సామాజిక రంగాల్లో సోషలిస్టు రిజిస్టరుకు అంత ప్రాధాన్యత. సోషలిస్టు రిజిస్టరు చదవడమే ఒక క్వాలిఫికేషన్ వంటిదని ప్రపంచ మేధావుల నమ్మకం.

అమెరికన్ సామ్రాజ్యవాద నేపథ్యంలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం గురించి-లియో పానిచ్, శామ్ గన్‌దిన్ ఒక వ్యాసం రాశారు. ఈనాడు సామ్రాజ్యవాద విధానం దానికి గల వ్యతిరేకాంశాలను పైకి కనవడనివ్వకుండా ఆకర్షణీయంగానూ, ఆమోద యోగ్యంగానూ తయారయి మన ముందుకు ఎలా వస్తున్నదో ఈ వ్యాసంలో రచయితలు వివరించారు. నోమ్ చోమ్‌స్కీ ఇరాన్ ఆక్రమణ వెనకగల నిజా నిజాల్ని చర్చిస్తూ విపులమైన వ్యాసం రాశాడు. పౌరహక్కుల, వివిధ దేశాల్లో పౌర హక్కుల ఉల్లంఘనకు సంబంధించి-అమెరికనైజేషన్, గ్లోబలైజేషన్ గురించి కూడా మంచి వ్యాసాలున్నాయి.

అరబ్ దేశాల్లో ఆయిల్ సంక్షోభం, నూనె గనుల చుట్టూ తిరుగుతున్న అగ్రదేశాల యుద్ధాలపై ఒక వ్యాసం, పర్యావరణ సమస్య పెట్టుబడిదారీ విధానంపై మరొక వ్యాసం-ఇలా 21వ శతాబ్దపు సమస్యలన్నిటిపైనా మొత్తం 13 మంచి వ్యాసాలున్నాయి. సోషలిస్టు రిజిస్టర్ తప్పక చదవి తీరవలసిన వ్యాస సంపుటం.


Statement about ownership and other particulars of newspaper VEEKSHANAM as required to be published in the first issue of every year after the last day of February.

Form IV (See Rule 8)

| | |
|---|---|
| 1. Place of Publication: | Hyderabad |
| 2. Periodicity of its publication: | Fortnightly |
| 3. Printer's name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | 101, Mythri Residency, 3-6-394, Street No. 3, Himayatnagar, Hyderabad 500029 |
| 4. Publishers name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | Same as above |
| 5. Editor's name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | Same as above |
| 6. Names and addresses of individuals who own the newspaper: | Not applicable |

I, V Hanumantha Rao, hereby decalre that the particulars given above are true to the best of my knowledge and belief.

Dated March 1, 2005

*(V Hanumantha Rao)*
Signature of the Publisher

## ‘వీక్షణం’ చందాదారులుగా చేరండి!
## ‘వీక్షణం’ను మిత్రులకు పరిచయం చేయండి!

తెలుగు నాట విలక్షణమైన ఆర్థిక, సామాజిక పత్రిక ‘వీక్షణం’ ను రెండు సంవత్సరాలకు పైగా ఆదరించి పోషిస్తున్న మిత్రులందరికీ ‘వీక్షణం’ సంపాదకవర్గం వినమ్రంగా ధన్యవాదాలు తెలుపుతోంది. అయితే తెలుగుసీమలో రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాల విశ్లేషణ కోసం ప్రజలలో, పాఠకులలో, ఆలోచనా పరులలో వ్యక్తమవుతున్న తహతహకూ, ఆ ఆసక్తిని తీర్చడంలో ‘వీక్షణం’ చేస్తున్న కృషికీ మధ్య చాల అంతరం ఉంది. ఆ అంతరం పూడాలంటే ‘వీక్షణం’ కు పాఠకుల నుంచే ఇతోధిక సహకారం అందాలి. ‘వీక్షణం’ చందాదారుల సంఖ్య కనీసం మూడురెట్లు పెరిగితే గాని, ‘వీక్షణం’ తన ముందు పెట్టుకున్న కర్తవ్యాలను తీర్చడం సాధ్యం కాదు. అంటే ‘వీక్షణం’ పాఠకులలో ప్రతి ఒక్కరూ తమ చందాలను క్రమం తప్పకుండా పునరుద్ధరించుకోవడంతో పాటు, కనీస మరొక ముగ్గురు మిత్రులకు ‘వీక్షణం’ ను పరిచయం చేసి చందాలు కట్టించాలి.

* ‘వీక్షణం’ చందాదారులుగా చేరండి!
* మీ మిత్రులను ‘వీక్షణం’ చందాదారులుగా చేర్పండి!
* ఇది వీక్షణం కు సాయం కాదు. తెలుగు సమాజం తన గురించి తాను తెలుసుకోవడానికి చేసే అన్వేషణకు సాయం!

వీక్షణం విడిప్రతి రు. 12 సంవత్సర చందా రు. 150, జీవిత చందా రు. 1,000
చందాలు, ఎం.ఓ.లు పంపవలసిన చిరునామా:

సంపాదకుడు, వీక్షణం, సిడిఆర్‌సి, మైత్రి రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

## మీలోని రచయితను వెలికి తీయండి!
## ‘వీక్షణం’ మీ రచన కోసం వేచి చూస్తోంది!

మీ చుట్టూ, మీ గ్రామంలో, మీ బస్తీలో, మీ పని స్థలంలో, మీరు పనిచేసే సంఘంలో ఏదో ఒక ఘటన మిమ్మల్ని కదిలిస్తుంది. మీలో ఆలోచనలు రగిలిస్తుంది. ఆ ఘటన వెనుక ఉన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక మూలాల గురించి మీరు అన్వేషిస్తుంటారు. మీ ఆలోచనలను రాయండి. సరిగ్గా ‘వీక్షణం’ ఎదురు చూస్తున్నది అటువంటి క్షేత్ర నివేదికల కోసమే. ‘వీక్షణం’ ఆర్థిక, సామాజిక పత్రిక తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే ఆలోచనలకు, అన్వేషణలకు ఒక వేదిక. మీరు అట్టడుగు నుంచి, మీ అనుభవాల నుంచి పంపే నివేదికలు ఆ ఆలోచనల్లో, అన్వేషణల్లో భాగమే.

‘వీక్షణం’ ను ఇటు క్షేత్ర నివేదికల, అటు నిపుణుల విశ్లేషణల మేలు కలయికగా తీర్చిదిద్దాలని సంపాదకవర్గం ప్రయత్నిస్తోంది. మన జీవితాల మీద ప్రగాఢ ప్రభావం వేయగల అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ పరిణామాల మీద నిపుణుల విశ్లేషణలు ఎంత అవసరమో, ఆ పరిణామాలు అట్టడుగు మనుషుల జీవన సరళిని ఎట్లా మారుస్తున్నాయో కింది నుంచి నివేదించడమూ అంతే అవసరం.

వీక్షణం మీ పత్రిక వీక్షణం మన పత్రిక
వీక్షణం తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణ. ఆ అన్వేషణలో భాగం పంచుకోండి.
రచనలు పంపవలసిన చిరునామా:

సంపాదకుడు, వీక్షణం, సిడిఆర్‌సి, మైత్రి రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

PRINTED BOOK

!టింరెడ్ గయుఁరదదండ 'ంఆక్షైడే'
!టింయుండ్ ంయుండరిడ యఅంత్యుడ డ'ంఆక్షైడే'

# అగ్రగామి ఆంధ్రప్రదేశ్

!టింయుంతీ కిఆడ యతయుండర ఁెఅయఁ
!దింక్షైఁడ డడ్ ంయుక్షై డడర డే 'ంఆక్షైడే'

- ఊరూరా, వాడవాడల పర్యటిస్తూ, ప్రజలను పలకరిస్తూ సమస్యలను పరిష్కరించే ప్రయత్నమే 'రాజీవ్ పల్లెబాట'
- ప్రతి గ్రామాన్ని ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేసి వారికి ఆన్‌లైన్ ద్వారా సమాచారం అందించడం కోసం 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్'
- నిరుద్యోగ యువత కోసం ఉపాధి లక్ష్యంగా 'రాజీవ్ యువశక్తి'
- రూ. 500 కోట్లతో ఎస్.సి., ఎస్.టి, బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు 'ఇందిర ప్రభ'
- రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో వ్యవసాయానికి అత్యంత ప్రాధాన్యతనిస్తూ, నీటిపారుదల, ఇతర అనుబంధ రంగాలకు మూడవ వంతు నిధులు
- పారిశ్రామిక ప్రగతికి పెద్దపీట. విశాఖ సమీపంలో 2120 ఎకరాలలో రూ.182 కోట్ల వ్యయంతో రూపుదిద్దుకోనున్న 'మెగా ఫార్మాసిటీ'
- వచ్చే ఐదేళ్లలో రికార్డు స్థాయిలో 46 వేల కోట్ల రూపాయల ఖర్చుతో నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రణాళికలు

VEEKSHANAM
G-MYTHRI RESIDENCY,
3-6-394, ROAD NO.3
HIMAYAT NAGAR, HYDERABAD-500029